శ్రీ

# శ్రీ కృష్ణాతిమానుషతత్త్వము

## ప్రథమ ఖండము



ఆంధ్ర విశ్వవిద్యాలయ గీర్వాణభాషా పరిషద్భూతపూర్వసభ్యులును,
మద్రాసు ప్రభుత్వ దేశీయ వైద్య సంఘభూతపూర్వసభ్యులును,
ఆంధ్ర వైద్య మండలీ భూతపూర్వాధ్యక్షులును,
ఆంధ్రప్రభుత్వాయుర్వేద నిష్ణాత సంఘ సభ్యులును,
ఆంధ్రప్రదేశ ప్రభుత్వాయుర్వేద సంఘసభ్యులును,
ఆంధ్రప్రదేశాయుర్వేద మహామండలాధ్యక్షులును,
అఖిల భారతానువంశికాయుర్వేదయూనానీవైద్యసంఘాధ్యక్షులును,
శ్రీరామమోహనాయుర్వేద కళాశాలాధ్యక్షులును,
శ్రీరామమోహన సంస్కృతపాఠశాల వ్యవహర్తలునగు

శతావధాని, ప్రాణాచార్య,

**దివి రంగాచార్యులుగారిచేఁ**

ప్రణీతము.

కథనములోని చమక్కులు చుక్కలై యొక కవి నుండి మఱియొక కవినివ్యవచ్ఛేదించు. కాకున్న కావ్యత్వము సామాన్యముగాన నిన్నిరక ముల వెలువడికయే వ్యర్థమై శాశ్వతికత్వ మందుకొనదు కదా! మన యెఱికన యెన్ని మఖపుబ్బల పరిభావము చూడఁబడలేదు?

నన్నయ వివిధ విధా శిల్పములఁదన రచనమునఁ బ్రిక్షేపించె. అందు సంభాషణాచమత్కృతి, నీతుల నిర్వచించు విధానమును గొని తిక్కన దాని నాత్మీయ మొనర్చుకొనెను. అట్లే కథాక్ష ప్తీకరణమును నాచనసోముఁడాత్మీయమనె. సమాస సౌందర్యము శ్రీనాథుడు నాదనె. పోతనపై వానితోఁబాటు నాంధ్రుల ప్రత్యేకతగు త్తఁగొన్న ననుప్రాస ములను జాతినోళులలో నాడెడు నానెడు సంస్కృతాంధ్ర పదముల వాడుక నాదేయనెను. ఆ తరువాతి వారలు పై వారి నడుగుజాడల నడ చుచు కొన్ని కొన్నింటిపై నాత్మీయతాముద్రలధి బంధించిరి. అందు రామకృష్ణుఁడు మొదటి పద్యములోఁదలను రెండవ పద్యములోఁదోఁకను మాత్రము చెప్పి నీరసమై యూహాకందఁదగు భాగము నూహించుకొనుఁ డను విధానమును బెంచెను.

ఇట్లు ప్రతి కావ్య మొక్కొక్క క్రొత్తబాటను రూపించుకొని స్థిరత్వమందుకొని నాఁటికి నేఁటికిఁ బాత్యములై యనుయాయి గ్రంథముల నావలకు నెట్టినవి. కాన కావ్యజ్ఞ శిక్షయెంతేని యవసరము గదా!

ఇట్టిది పఠించుట కేవలయునన్న భావించి, రూపించ వలయునన్న నింకెన్నియో తెలియవలయు. వ్యాద్ధతమును గావలయు. కాని చాప ల్యము, గ్రంధపఠన సమయసంజాత కౌతుకము, కించిజ్జతలోని మదాంధ్యము ముప్పిరిగొని యుక్కిరి బిక్కిరిసేయఁ గాకితములు కలవు కాబుచౌకగాన నొక మహాకావ్యమునకుఁ బీఠికాకరణ మొనర్పంగడఁ గట్టితి. సాహసకులు దోషజ్ఞులు సాహసిక్యమును మన్నింపఁగై వేడ్తు.

ఒక మహాకావ్యమనఁగనే ప్రశ్నపైఁ బ్రశ్నపుట్టు "యత్కృత మది" యన్నా మధేయవిశిష్ట మనియు.

ఎందులకన సామాన్యకవిత్వమైనను బ్రసిద్ధేతిహాసమునకుఁ బ్రశస్తి సహజము. కలదుగదా ఆర్యోక్తి " ధర లోకోత్తరనాయక, వరవర్ణనమల్పకవి యవర్ణించినచో, పరమామోదము విద్వత్పురుషుల కొనరించుఁ గొత్తపూఁబోడివలెన్" అని. కానవస్తుగౌరవము వలనఁ గవికింగౌరవంబబ్బు. ఇఁక వస్తువు సామాన్యమైనను మహాకవి పరిగృహీతమైనచో దానికింగౌరవంబుబ్బు. కావుననే "కాదేదీ కవిత కనర్హం - జేసేనూ శిల్పమనర్ఘ" మ్మని పాడుకొన్నాఁడొక నవకవి. కవియు నితిహాసమును బ్రసిద్ధములైన "హేమన్నకి పరమామోద" మబ్బుఁగదా! ఈయూసనే ప్రతివాఁడును బైప్రశ్నల నూపి రాదకుండఁ గుప్పించు. అది యీతెంగియె గ్రంథకర్తృ నామమును వినిచెద.

"అహా! వారుగో!! ప్రాణాచార్య, శ్రీమాన్ దీవి రంగాచార్యులు గారు !!!" ఏమీ ! ఏమేమీ !! వారు ... వాసుమాజ్ఞసుగారు దీవి రంగాచార్యులుగారే? వారేనా? ... అయిన వారు, వారే నయ్యా! రోగముతో విసుఁగుపుట్టిన మాప్రాణముల దగ్గరకుఁదీసి లాలించి, కోర్కెలనాలించి, రోగమునునిస్థానుధాముమునకర్చి మరల మా బొందియను గూటిలో నవోత్సాహము ననుపానముగఁజేసి ప్రతిష్ఠింతురు. అట్టివారు, వారేవ్రాసిరిగా? మేముకలనైన నూహింపనులేదే యిది! అవునులెండు "అతిసమస్థులకిల నసాధ్యంబులేదు గదా!" అయినను నీలోకమున కిదియొకరోగము. ఒకసమర్థుఁడు తన సామర్థ్యమును బ్రకాశమొనగ్చనీలకు నున్నట్లేయంగీకరింపదు. అవును గుప్తనచ్చినది వారికెన్నియో బిరుదులుకలవుగదూ! పండిత, శతావధాని ఆయుర్వేదాచార్య, ప్రాణాచార్య. ..."

అవును. కలవు. కాని మీ రేమైననను కొనుఁడు. మీ రెన్ని బిరుదములనైన గుర్తించుకొనుఁడు. నాకు మాత్రము "ప్రాణాచార్య" ప్రాణప్రదము. దానిలోనే నా ప్రాణములున్న వేమో యని పించును. నిజము. నావాక్కని వననేల రోగ ఖిన్నులై, నిరంతరరుగ్ణులై గూటిని వదల్చుకొన నెంచుప్రాణములు గలవారైనను, వారిని దర్శింప, వారి హస్త స్పర్శననుభవింప, వారి సుధామాధురీధురీణ వచస్సంపద గోచుకొన వారిప్రాణములు స్వస్థములై వారి బిరుదమునందుఁ గృతజ్ఞతతో నిమిడిపోవు. అందుకే వారి బిరుదమునకును నా ప్రాణముల కంతవిడరాని నేస్తము.

ఇట్టి మనప్రాణములకుంబూట కాపైన శ్రీమాన్ రంగాచార్యులుగా రోకేరియొక - అద్భుత - ప్రత్యద్భుతమైన మహాకావ్యమునకు రూప ప్రకాశన మొనర్చిరి.

నాకుఁ దెలియు. "మా డాక్టరుగారు మహాకావ్యమును సృష్టింపఁ గొక్కరాయివలె 'రూపప్రకాశన మొనర్చి' రందు వేమి ? రూపప్రకాశన మననుండియుం గాన రాని దానిని వెలుంగులోనికిం గొనివచ్చుట గదా! మీమాత్రమర్థమైనను గ్రహించుశక్తి లేదా ?" అని యడుగుదురని.

నిజమే. తెలియు. కాని వేదద్రష్టలైన మునులే యిట్లను గ్రహించిరి. "జ్ఞానము సృష్టింపఁబడునది కాదు. అది యనాద్యంతిము స్వయంప్రకాశమును. దానిని మహర్షులైన మానవోత్తములు తమ పాత్రలకొలఁది గ్రహించి లోకులకందిత్తురు. కావున నే వేదములు స్పష్టములు, పౌరుషేయములుఁ గావు. అవి దృష్టములు (అనగాఁ జూడఁబడినవి. తెలిసికొన బడినవి. అని మఱియును గ్రంథమున సంర్భింపఁబడినదని గదా యర్థము. అట్లే డాక్టరుగారుమను ననాదిగాఁ బ్రకృతిలో లీనమైన యొక మహాకావ్యమును మహర్షులై మనమధ్యకుం దెచ్చి శ్రీకృష్ణునకుఁ గాన్కగా నొసంగిరి.

ఇంతకు నొకవాక్యము జెప్పినట్లయినది. అదియిది. శ్రీమాన్ శ్రీ దీవి రంగాచార్యులుగారొక మహాకావ్యమును దర్శించిరి. అని.

మొదటి ప్రశ్నలో మిగిలిన భాగము మిగిలినట్లేయున్నది. దానికిది సమాధానము. వారు దర్శించి శ్రీకృష్ణున కర్పించిన కావ్య మణిహారము పంచాగమాత్మకవిశిష్టమై, ఆగమమున కైదుశీర్షములుగల శ్రీ "శ్రీకృష్ణాతిమానుష తత్త్వము" అని.

అనినంతనే మీకొక యూహపోఁచును గదా! ఇది "శ్రీకృష్ణుని యద్భుత చర్యలకు సంబంధించిన యథార్థమును బ్రకాశన మొనర్చు మహాకావ్య" మని. అవును. అదినిజమే. శ్రీకృష్ణునిబాల్యము మొదలవతార సమాప్తిపఱకుఁ గల విచిత్ర-చిత్ర చర్యలు వాని ప్రయోజనముల నంతార్థముల వివరించుగ్రంథము. అనునంతమిక్కిలి యక్కజంపడి "ఏమేమీ ఎఱ్ఱాప్రగడతో నాచన సోమునితో నారంభింపఁబడి సహజ పాండిత్యమండితుండైన బమ్మెరపోతనతో బహుళ ప్రచారమందుకొని మఱొకరు చేయిఁబెట్ట సాహసింపనీని శ్రీకృష్ణకథామృతమాయిది? ఎంత సుదినము! ఎంత వింతవార్త? అద్భురుగదూ! అవును అదియట్టిద.

పోతన దశమస్కంధమునఁ గృష్ణునిచర్యల వివరించిన తర్వాత మఱెవరునాపనిఁ జేయఁబూనలేదు. కొందఱు మాత్రమలఁతి యలఁతి పట్టుల గ్రహించి వివరింపయత్నించిరి. అందొక తిమ్మన (నంది) కృతార్థుఁడు. మఱియొక తిమ్మన (కూచిమంచి) తిమ్మనయే. ఆతరువాత వచ్చిన రచనా ప్రభేదములలో నశేషప్రఖ్యాతిఁ బండించుకొన్నది 'గయోపాఖ్యాన' నాటకము. అంతప్రశస్తి మఱిదేనికిలేదన నతిశయోక్తి లేదు. ఆతరువాతహరికథగావచ్చినది" భీమార్జునగర్వభంగము. (ఇవి ఆమూలకములని వినికిడి) ఇవిగాక 'రాధా మాధవసంప్రదా

యము ననుసరించి యొకటి రెండుకథలు శ్రీశ్రీ తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారిచే (వారిప్పుడు శివశంకరస్వాములు) నిబంధింపఁ బడినవి. అందొకటి "అగ్నిపీక్ష" రెండవది 'ఛిద్రఘటి'. మొదటిదాన జన్మించిన శ్రీకృష్ణుఁడు రాధనే చూడఁదలంచి కన్నులు తెఱవఁడఁట. రెండవదాన శ్రీకృష్ణునకుఁ దలనొప్పివచ్చెనఁట! అదిపోవ చిల్లికుండతోఁ జింది పోకుండ యమునాజలముదెచ్చి దృష్టి దీయవలయునట! అదియుఁదడే కతానమనస్కయైన రాధకే చేతనయ్యెనట' అని. ఇవిగాక నాయెఱిఁగి నంతవరకుఁ బ్రసిద్ధతా ప్రశస్తినందుకొన్న భాగములులేవు.

ఇవి యన్నియుఁ జదువుచు నిట్లు వికీర్ణములై యసంపూర్ణ గ్రథితములైన శ్రీకృష్ణ కథారత్నములనొకచోఁ గూర్చి క్రమబద్ధత సాధించిన శ్రీకృష్ణ భక్తులకు, వారి యనుయాయులకు సారస్వతోపాస కులకుంజాల మేలగుఁ గదాయని తలపోయువాఁడ. కాని యెట్టివను, సోమరిఁబోతన్నను దలంచుకొని "అయ్యో! వారిఁబోలి వారిమించు సాధకులు గలరా!" యని నిట్టూర్చువాఁడ. నిట్టూర్పులేమొ యిట్లె బాష్పవృష్టి మెఱిపించెడివి. ఇట్లు నాబోటివారెందఱు వెనుక వసట నలిగిరో! "కాలోహ్యయం నిరవధిర్విపులాచపృథ్వీ" యని యెంద ఱూఱటంపడిరో!- అట్టి నాబోటి నాటినాటి జీవుల యాక్రందన లావేదనలే ఘనీభవించి యీ రూపయ్యెనని విశ్వసింతు. కాననేవారికి 'ప్రాణాచార్య' అని యన్వర్థత. కాఁగా మఱియొక వాక్యముఁ జెప్ప నగ్గినది. అదియిది "శ్రీమాన్ దీవి రంగాచార్యులగారు శ్రీకృష్ణుని చరిత్రకు సంబంధించినపట్టుల నన్నింటిఁగూర్చి, క్రమబద్ధత సాధించి "శ్రీకృష్ణా తిమానుష తత్త్వ'మను మహా కావ్యమును నిబంధించిరి" అని.

ఇట్టి గ్రంథ విశేషములఁ జదువు నప్పుడెట్టి నాస్తికునకైనను దివ్య మహాత్మ్యములఁ గూర్చి విశ్వాస మిబ్బడి ముబ్బడియగు. కావుననే

యత్యద్భుతమగు కావ్యములఁజదివి గ్రిధయితల సంస్కారవిశేషమున కాశ్చర్యంపడుదుము. అప్పుడు ఈప్రశ్న రావచ్చుగదా!లోకమున నింగ మంది కవులు, భక్తులు, భక్తకవులు, కవిభక్తులుండ వీరేయేల కృష్ణాతి మానుష తత్త్వవివరణమునకుఁ బూనుకొనవలసి వచ్చినది?' అని.

నిజము. అట్టి యద్భుత ప్రాక్తనాధునా తన సంస్కారము లుండుటవలననే పూనుకొనిరి. కలవారు పూనుకొందురును. అందుఁ బ్రాక్తనములను మేయములు. అధునాతనములను మేయములు చాతుష్పములును. వాక్యరచన యిట్టిది. "వీరు శ్రీకృష్ణునకుఁబ్రియభక్తులు. శ్రీకృష్ణాతి మానుష తత్త్వమును గ్రిధనము సేయుటనలన. ఎవరేయే భగవంతునకు భక్తులో వారాభగవచ్చరిత్రముల సపూర్వముగాఁ జిత్రింతురు. పోతన, కృష్ణదేవరాయలు, ధూర్జటి రామకృష్ణులవలె. కారో కారు. తద్భిన్నులవలె. ఇది కేవల మనుమాన సాధ్యమగుటఁ బ్రాక్తనసంస్కారము. అధునాతన సంస్కారములఁ జూడుఁడు,

వంశము వ్యాసవాల్మీకి కాళిదాసాదుల నుతిఁగొన్న వైఖాన సము. ధర్మతత్పరతను పనిబంధించుచుఁ గాళిదాసు శాకుంతలమున "వైఖాన సంకిమనయావ్రత మాప్రదానాత్ వ్యాపారరోధి మద నస్య..." అనియనినాడు. అందుగోత్రర్షి గౌతముఁడు. ఇతఁడు స్మృతి కర్తగా తర్కసిద్ధాంత ప్రణీతగా నక్షపాదుఁడుగా బ్రసిద్ధిఁగన్నవాఁడు. వంశనామము దీవి. అన నాకేమి దోచుచున్నదన నాయాయిగుణముల ధర్మదుష్టములు, లోకవ్యామోహ జుష్టములుగాకుండ నిలువఁ గలుఁ గుట నదియే వంశనామమయ్యెనా యని. ఇట్టి పవిత్ర వంశమున జన్మించిన కవిగారి పితామహుఁడు "పూర్ణేందుండంబుధి సంభవిల్లినటు పాండిత్య ప్రసక్తిన్ మహో ద్గ్రింధాధ్యాపక తాను రక్తి సుకవిత్వా భ్యాస వైద్య ప్రశస్తిందిగ్దేశయ శోఁ౭ంచితుం"డయినాడు, అట్టివాని

మనుమనికి నట్టి గుణములువచ్చుటఁ (హెరిడిటరీ) సహజముగదా. అంతే గాదు తల్లిగారును.

అకలంకోత్తమవృత్తి, భర్తృహిత సేవాసక్తి సౌజన్యసా
త్త్వికయుక్తిన్, హరిభక్తి, బాంధవహితాతిథ్యోక్తి, సద్ధర్మబో
ధకశక్తిన్ సుగుణాప్తి, లోకవిలసత్ప్రఖ్యాతి నారంగమాం
బిక పేరెన్నికఁగాంచి నీతిమతి సాధ్వీరత్నమై పూతయై ॥

ఇట్టి గుణములఁ బేరెన్నికఁ గన్నది. అట్టిగుణములే పుత్రునకు నలవడినవి. అవునదృష్టవంతుఁడు. లోకము వాకొనుఁగదా! తల్లి పోలికవాఁడదృష్ట వంతుఁడని. ఇంతేకాదు, చాక్షుష ప్రత్యక్షమునకు మఱియొక పండువు. అది జన్మ సమకాలీన విచిత్రఘట్టము. వారి వాక్కులనే యనువదింతుఁ జూడుడు

కలికి రంగాంబ యష్టమ గర్భశుక్తి
దాల్చినను నవమాసముల్ దాటినంత
పైతృక గృహంబునకుఁ జేరె భర్తృనాజ్ఞ
పంచశీర్ష భుజగుఁ బ్రత్యక్షముగఁగాంచి
నాఁడె ప్రసవవేదనములు వొడమ
నాత్మశిశుఁజేర్చి యాలయంబునకేగి
నన్నుగన్న ... ... ... ... ... ॥ అని.

సాధారణులకు సర్పములే కానరావు, (తజ్జన్యభీతి, గండము మొదలగునవి లేకున్న) కానవచ్చినను సామాన్యములే కానవచ్చును. కాని ఆత్మసంస్కారోదాత్తతశోభించు దివ్యులకు దివ్యసర్ప దర్శనము జరుగును. అందున నేక శీర్షభిన్న భుజగదర్శనము పూర్వసాధకము. అది దివ్యులగువారి మహత్త్వములకు పూర్వరంగమని ప్రతివారికిఁ బ్రసిద్ధమే.

కాన పంచశీర్ష భుజగదర్శనము తప్పకయపూర్వమును సాధించితీరును. అది యానాఁటివారు గాదుగుర్తింపఁజాలకున్నను నాఁటినుండి నేఁటికి సజీవులైనవారీ యద్భుతగ్రంథ నిర్వాహణసూచికకే యిది జరిగెనని నిశ్చయింతును. ఇక్కడ మఱి యొకవిశేషము.

కేనోపనిషత్తు పరబ్రహ్మను సాధించుచు నిట్లు బోధించినది. “ఈజగదధిష్ఠానము బ్రహ్మ, జగత్తును గుర్తించు నింద్రియములకు స్వప్రకాశత లేదు. మనః ప్రకాశములేక యింద్రియములు విషయముల గుర్తింపవు కాబట్టి. మనస్సునకు స్వప్రకాశత నంగీకరింతు మన మనస్సు తనకు విరుద్ధములైనవిషయములందును బ్రవర్తించుఁగాఁబట్టి దానికిని స్వప్రకాశత లేదు. ఎట్టివాఁడును గొఱవితోఁ దలఁగోకికొనఁ దనకాళ్లపై గొడ్డలిపెట్టుపెట్టుకొనఁ గోరఁడుకదా! కాన మన ఆది ఇంద్రియభిన్న మైన దేదో యదియే పునః ప్రవర్తకము. అని యంగీకరించక తప్పదు. ఆయనిర్దిష్టమే నిరాకార నిర్గుణాది విశిష్టపరబ్రహ్మ” మని. ఇది యెందులకన ప్రతికార్యము మనచేఁ జేయఁబడినప్పటికిఁ బ్రవర్తకము మన మనుకొను నహంత కాదనియునది మనయందలి యధిష్ఠాతృచిద్విలాసమనియు, దానిరూపులోలోవిమర్శించి చూచుకొన దానికిఁబూర్వరంగము బయలగుననియు నాపూర్వరంగమునకే హేతుత్వము సిద్ధించు ననియు, జెప్పుటకే. ఇంతయు నెందులకన శ్రీమాన్ ద్రష్టలగు డాక్టరు గారికి నారాధ్యయగు నిందిరాదేవి స్వప్నసాన్నిధ్యమను గ్రహించి శ్రీకృష్ణుఁడే కృతిపతిగా నీచరిత్రమును వ్రాయుమని యాదేశించెనే కాని శీర్ష పంచకముగా నాగమపంచకముగా వ్రాయుమని నిర్దేశింపలేదు. అయినను వారట్లే నిబంధించిరి. కానదీనివలన వేఱువేఱు పేర్లతోఁబిలువఁ బడుచు దర్శన మనుగ్రహించు భగవంతుఁడే నియామకుఁడనియు నాఁతడే హేతువనియు రూపింపఁబడు చున్నదిగదా ? కాఁగా నీవాక్యముస్పష్టము “డాక్టరుగారు వేదమువంటి కావ్యమును భగవత్ప్రేరణచే వెలయించిరి” అనునది.

మఱియొకటి ప్రథమాగమముతో నలసితినని భావించిన డాక్టరు గారి కిందిరవునకు ప్రత్యక్షమయి గ్రంథ నిర్వాహణసాధనత్వ మంగీకరింప నను శాసించినది. కాంగా డాక్టరుగారాగమ చతుష్కముచే నవతార సమాప్తి వర్ణించి నను భగవద్గీత, నుత్తరగీతను నైదనయాగమ ముగా వెలయింప సముత్సుకులయియే యున్నారు. ఇందువలనను బంచశీర్ష భుజగదర్శన ప్రయోజనము వెల్లడియగుచున్నదికదా! కాంగా వాక్యరచనాస్వరూపమిది "దివ్యవస్తుదర్శనము దివ్యాపూర్వమును బుట్టించు. ఎట్లన ప్రాచీనులకువలె, లేనిచో లేదు" అని.

ఇక్కడ నొకప్రశ్న రావచ్చు. "ఖండికలకు శీర్షమను పేరుఁ బెట్టితిరి. సరియె. అది యుక్తము. కాని ఖండములకు నాగమమని పేరుఁ బెట్టుటలో నౌచిత్యముకన్నమతేదో...!! ఆగుఁడాగుఁడు. శబ్దము శక్తిగలది. అది యర్థము నెట్లు గల్గించునో యనర్థమువల్లే గల్గించును. ఇంతకు మీ సందేహము "ఇతి వేదాస్త్రయస్త్రయీ" కదా! ఐ దెట్లు పోనీ రానురాను నాల్గవదానిగా నాథర్వణము నంగీకరించితిరి' అని అథర్వణవేదమునకు [illegible]దక్కఁ చెప్పుకొన్నారుగదా! [illegible] రెండుగా విభక్తమై [illegible] ప్రసిద్ధిగాంచినది. ఒకటి ధనుర్వేదము. రెండవ దాయుర్వేదము. కాంగా వేదములయిదయినవి. అట్లే నాల్గవ [illegible] ద్విధావిభక్తమయినది.

పోనీ భారతమునకు 'పంచమవేద' మని ప్రసిద్ధిగలదు గదా! దాని నాధారము చేసికొని పంచమాగమత్వము సాధించుకొనఁదగదా యనఁదగదు. ఏలయన భారతము వేదమునకు వ్యాఖ్యానాఖ్యాన ప్రాయమిది యట్టిదిగాక వేదమువలె స్వతంత్రముగాన, నా చేసిన విభాగమే సరియయినది.

ఏతావతా శ్రీ శ్రీమాన్ ప్రణాచార్య దీవి రంగాచార్యుల వారు వేదమగు శ్రీకృష్ణాతిమానుషతత్త్వమును దర్శించి ప్రకాశ మొన రించిరి.

మఱియొకవింత ! తల్లిగారి పేరు రంగాంబగారు. వీరిపేరు నదియే. ఈ సంప్రదాయము మహర్షులది. వారు తల్లిపేరుతోఁ బిలువబడు చుండెడివారు. గార్గేయుడు, అగస్త్యుఁడు మొదలగువారు. ఈ సంప్రదాయము చరిత్రకందీయందని యాంధ్ర శాతవాహనులలోపలను గలదు. గౌతమీపుత్ర శాతకర్ణి, వాశిష్ఠపుత్ర శాతకర్ణి మొదలగునవి. అదియు దైవప్రేరణచేఁ గలసిన దన బంగారమునకుఁ దావి యబ్బుట గదా! కానసే యిది యాగమము. దీని ద్రష్టలు, మహర్షులునగు డాక్టరుగారు.

అట్టి దీనికిఁ బీఠికాకరణ మొనర్ప నుపాంగుచుఁ గథాకథన సాదృశ్య వైశిష్ట్యాది వివరణమున కభ్యనుజ్ఞఁ గోరుచున్నాఁడు. సరేనా?

"పూవుపుట్టఁగనే పరిమళించు" నని తెలుఁగుసామెత "నహి కస్తూరి కామోదశ్శపథేనవిభావ్యతే" అని సాంస్కృతికులసూక్తి ఇవన్నియు మానవుని జన్మజన్మార్జితతపశ్శక్తి వర్తమానజీవితమునవిక సించుననియు, నదియె భవిష్యజ్జన్మ పరంపరకు రూపుదిద్దుకుంచె యనియు వ్యక్తముచేయుచున్నవి. కావునసే యొకానొకకవి యొక్కొక్క విధముగాఁ బ్రారంభాది నిర్వాహణమొనర్చును. అది మొదలుగుఁబరి సమాప్తివరకు నాప్రత్యేకతనల్లె వెలువరుచును. ఈ వెలువఱుచుటయు ననేకవిధములు "మహాకవీనాంమతయశ్చభిన్నాః" కదా !

యాదవశూరశేసులకు రాజధానిగా మధురయను పట్టణము గలదు. ఆపట్టణ సౌభాగ్యముఁ దిలకింపుడు.

ధర్మసోదరి నిరం తరధర్మమూని తు
పారముక్తా ఫలాంజలు లొసంగఁ
బ్రాంత స్థితపరిదర్శ ణ భూధ రేంద్రుండు
లలితపరాగ శుల్కంబులీఁగ
బృందారకా వనబృందావనాసార
ధీర సమీర కిశోర మొలయఁ
గల్హారకమనీయ కమలాసరోనరా
శ్రితవిహంగము లలంకృతముసేయ,

విలసిల్లునట !

అతఁడు యమధర్మరాజు. పరేతపతి. అట్టివాని చెల్లెలు యమున. ఆమె. (ఆనీరే) దోసిళ్లకొలఁది తుషారముక్తాఫలమ్మ లకానక లొసఁగు. అతఁడు భూధరములకెల్లనిందురిఁడు పరివర్ణుఁడు. అట్టివాఁడే (ఆగుట్టయే) గందపొడిని శుల్కముగా (బహూమానముగా దిది పన్నుగా) నొసంగును. అది దేవతలనేని రక్షింపశక్తి గల బృందావనము. (చెట్లు పుట్టది) అట్టి బృందావనము దేవతలపై మలసి సొలసి పావిత్ర్యము మాధుర్యము [illegible] పవనములను పాయనమిచ్చు. ప్రియులపై మహా[illegible]లపైనల[illegible]ని మాధు[illegible] పావిత్ర్యముల నెఱ చూఱలిచ్చి వాయ[illegible]వుల విలువ ఆదికవులకు మహాత్ములకు మాత్రమె తెలియు. కానసే [illegible]ల్మీకి 'వాహి వాత ! యతః కాంతా తాంస్పృష్ట్వా మామపిశ్ప్రశో' అని రామునిచే ననిపించె. అట్టి మధురభావన మణుల మనకుఁ గుప్పికిఁదెచ్చిరి గదా !

సోఽహమునకు మాఱు రూపులైన హంసలుఁ (పక్షులే) కమలాకరముల నలంకరించునట ! ఎట్టి పుణ్యాజనులుండు పట్టణము ! కానసే దాని కంతసిరి ! దానికంతశోభ ! దానికి భగవంతుడే జన్మించు

నట్టి సుకృతము. అదియు నీడలేని నేలవాలని మేడలలోఁగాదు. భవంతు లలోఁగాదు. హాహాధ్వానభీభత్సమైన యొకచెఱసాలయందు. అహో ! ఎంతదృష్టమున కదృష్టము. చెఱసాలకే యిట్టి యదృష్టముండ భవంతు లకు హర్మ్యములకుఁ బ్రాసాదములకు నెట్టి యదృష్టముండునో ? అవును సందేహమేమి ? భక్తులే భగవంతుని కన్నమిన్నలు. కాన వారేడ జనినవారి జాడఁబట్టుకొని నోవ్రువెంటఁదగులుకొను భంగి భగ వంతుఁడే పరుగులువారు. ఇట్టి మధురాతి మధురములగు నూహలఁ జెఱసాల వర్ణించుటచే రూపుగట్టించిరి.

అక్కడ విద్యలకుఁ గొదునలేదు. వైదాంతి కవిజ్ఞానము కరత లామలకము. సంగీతమునకు యమునయే యూదిగురువై పుట్టకముందు నుండియే. బోధింప దానిపార మెంతని నిర్ణయింపఁగలము. జగన్నాటక సూత్రధారి యావిర్భవించు పట్టనమున- సారూప్య జగన్నాధులుగ్న పట్టణమున నాటకములకేమి కొదువ ? పదునాల్గులోకములనుదగ మందు దాఁచుకొని పోషించువారి కాహారలోపమెట్లు గల్గును ? ప్రతి వారు మోహినులైన పట్టణమున విలాసములెన్నని గణింపఁగలము ? ఇన్నిగల్గు పట్టణమున కింతయద్భుతమైన పట్టణమునకుఁ గలశ శరధి భవ కామధేనూపమ నీచోపమ యనిపించు. అంతకన్న గొప్పయుప మానము లేనప్పుడు, ననన్వయము సాదృశ్యమును బహిరంగపఱుపలే నపుడేమి చేయవలయు నున్నదానితో సరిపెట్టుకొనవలయుఁగదా !

అట్టి పట్టణమందు భయమునకే భయముగలిగించు చెఱసాల యందు హిమనూ వృతశశి కలయఁటులు-ధూమాళి ధూసరిత రత్నరుచిలీల- ధూమప్రిపరివృతాగ్ని శిఖభాతిఁ బోడిమిదక్కిన యువతియునాపె భర్తయు సిద్ధలోక రక్షాంకురదాతలౌ నదితి కశ్యపులోయనఁబొల్చి- కాలబద్ధులై యుండిరి. వారే దేవకీ వసుదేవులు.

మహాకావ్య నిర్వాహణమునకుఁ బురాణరచనకు నొక భేదము కలదు. పురాణమునఁ జరిత్రము పూర్వాను క్రమణికగా వర్ణింపఁ బడును. ఇట నది ˙ ాటఁటఁ పదలిపెట్టఁబడును కావుననే యిట దేవకీ దేవులదితి కశ్యపులై నను నాకథఁజెప్పిఁ కాలాతీతమొనర్పక పోలికతో విషయమును దేల్చెను. భాగవతము పురాణమగుట దాని కాదియగు పృశ్ని సుతప్రజాపతుల చరిత్రమును వివరించెను.

ఇట మఱియొక విశేషము రాఁబోవు కథను సూచించి విస్త రించుట. ఇది మహాకవులకు సహజమై నాటకనాందిలో నియమిత మైనది. ఇక్కడ నటులనే "కాలబద్ధులై" యనుచోట "సర్వాధారః కాలః" కాబట్టి కాలముచే బద్ధులె యనియు "ఏకదేశ వికృతస్యా నన్యత్వ" మ్మను న్యాయముచేఁ గాలనేమిచే బద్ధులనియు నర్థముల నిర్వహించు కొనవచ్చును. కాలనేమియనఁ గాలమను బండికిఁ బట్టా వంటి వాఁడని యర్థము. నేమి హీనమైన బండి నడువ నెట్లసమర్థమో యట్లే యాతని (కంసుని) ప్రభావములేక యాకాలముగూడ నడువ నసమర్థమన్నమాట! దీనిచే సమకాల జీవితముపైఁ గంసుని ప్రభావ మెంతపడునో యిటనే పాఠకుల కూహాగమ్య మగుచున్నది. మఱియు రామాయణ కాలమునఁ బ్రసిద్ధుఁడైన కాలనేమియే కంసుడుగా జన్మించెనని ముందుః జెప్పదలచిన కథనిట సూచించే. ఆహా! ఇది కదా మహాకవిత్వ ːంటాపథము !!

కాలప్రభావ మచింత్యమేకాక యనంతముఁగూడ. ఏనాఁటి కెట్లగునో యెవరు చెప్పగలరు? కాననే భవభూతి

పురాయత్రస్రోతః పులిన మధునాతత్ర సరితాం
విపర్యాసంయాతో ఘన విరళ భావః క్షితిరుహాం"

అనురీతి వివరించినాఁడు

మఱియొకరు

కిం, కరుఁడే రాజగు రాజె కింకరుఁడగున్ గాలానుసారంబుగా" అని వివరించిరి. సహజముగాఁ గాలమునకే యిట్టి పరిణామముండ నిఁకఁగాలనేమి పరిపాలితమగు కాలమునకెట్టి మార్పులుండవలెనో యుండునో యూహింపుఁడు.

"బ్రహ్మ నిష్ఠనుమాని పరవృత్తులకు దిగు
కులహీన భూసురుల్ గలరు నేఁడు
.................................
.................................
స్ఖలితులగు బ్రహ్మచారులు గలరు నేఁడు
కరుణలేని గృహస్థులు గలరు నేఁడు
కపటులైన సన్యాసులు గలరు నేఁడు

దీనికి ఫలిత మన్నట్లుగా

పితరుల పుత్రశోక పరిక్షీణన, క్షేమము లీతిబాధ, లా
శ్రితజన నిగ్రహంబు సురశిక్షణమున్ విషయైక వాంఛయున్
జ్యుతపురుషార్థ, మర్థిజన శోధన వేదవిమర్శనాది దు
ష్కృతములు నేఁడుగాక ......

అది కంస పరిపాలితమైన కాలప్రభావము ఫలితమును.

బ్రాహ్మణులు బ్రహ్మ నిష్ఠను మానిరి. ఇట బ్రహ్మశబ్దమునకు వేదమనియుఁ బరబ్రహ్మమనియు నర్థములు. కాన భూసురులు సగుణ నిర్గుణ కనిష్ఠల మానిరి. ఏంతగొప్ప భూసురులు? ఎంతటిఘన ప్రపాతము!!

బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడన నేటి బీరకాయలు గ్రామ సింహములు ననుకొంటిరా కాదు. అతఁడు జాతికి భాగ్యనిర్ణేత! తన సమస్త సౌఖ్యములను, పుణ్యములను దవదేశము కొఱకుఁ ద్యాగ

మొనర్చిన వదాన్యకేలి. ఇదినా నిర్వచనముగాదు. ప్రాచీనుల భావములను తన మాటలతో వివరించిన విశ్వకవి రవీంద్రుని భావము. వారి మాటలలోనె వినుడు 'ఎవ్వడు భయంకరుడుగాకుండునో యెవ్వడు లోభమును నిరసించునో యెవ్వడు దుఃఖమును జయించునో యెవ్వడభావమును లక్ష్యము సేయకుండునో యెవ్వడు పరబ్రహ్మమునం జిత్తము నిలిపి యుంచునో వాడే బ్రాహ్మణుడు ('గోరా' అనువాదకులు వేంకట పార్వతీశ్వరులు) అట్టి బ్రాహ్మణుడే చెడినప్పుడు జాతియంతయుం జెడును. ముదుసలులుపల్లె వాకొందురు. 'బ్రాహ్మణుండుం జెడె దేశమును జెడె. ఈప్రభావము కృష్ణుడున్న చోటం గృష్ణజననానంతరము గూడంగనుపడినది చూడుడు. (87వ పద్యమునుండి 190 వరకు)

ఒకఉదాహరణము

గడియించిరాసులం బిడికెడు మెదుకులే
　　కాకికివేయ వెన్కాడువానిం
దనకెంత [illegible] సుఖియించు
　　[illegible] మోర్వలేనిదాని
మోసమెఱుంగని పురుషులం గికురించి
　　పెద్దయై పురి విఱ్ఱవీంగువాని
నెఱసులు దనకున్న దొఱలించి యొరులపైం
　　దగవులకై కాలుందువ్వువాని
జీవనముం జౌర్యవృత్తితోం జేయువానిం
బహుప్రదనమున జీవికం గడుపుదాని''

... ... ... ... ...

శిశుంగఱుపంగ ... ... ... బలకృష్ణులాలో చింతురంట !

అహా! కాలపరిభావము! హనుమంతు ముందు సేనేగుప్పి గంతుల వేయించుఁగదా!

ఇది శ్రీకృష్ణుని యతిమానుష చర్యల యథార్థము నెఱుక పఱచునని మొదటన చెప్పితి. కావున శ్రీకృష్ణుఁడీ యాగపు సంపుటికి నాయకుఁడు. ఈయాగము నందు మాత్రము కంసుఁడు ప్రతి నాయకుఁడు, ఈనాయకునిచర్య లతిమానుషము లత్యద్భుతములు. కాన వానిఁగథారూపమున వివరించి వానిఁ బుష్టిఁగలిగించుటకై ప్రతి కథ చివర నతని యతిమానుషత్వము నిరూపించు పద్యముతో ముగించు. దీని వలనఁ బాఠకునకు విశ్వాసము ద్విగుణమగు.

చూడుడు

శకటాసుర సంహారమును గూర్చి హరివంశమిట్లు చెప్పుచున్నది. "యశోద యొకనాఁడు కృష్ణుని శకటముసీడ మంచము వైచి నిదురఁ బుచ్చి జలార్థము నది కేగె. తల్లిపోయి వచ్చులోన గృష్ణుఁడా శకటమును దన్న నది విఱిగిపోయె" ఇట సహజమున కసురత్వారోపము సరిగాదని యోయేమో భాగవతకర్త యిట్లుమార్చె "కృష్ణుఁడు బోర్ల బడ నేర్చెనని జన్మనక్షత్రమున యశోద ముత్తైదువులకుఁ బూజలోన నృచు 'యాద' మఱచెనఁట! అప్పుడు కృష్ణుడు నిద్రలేచి యేడ్చుచు శకటమును దన్నెనఁట! అది విరిగి నేలఁగూలెనఁట! ఇటఁ గృష్ణుఁడు మేలుకొను నంతవరకు బండి కానవచ్చినట్లు గాని యది కృష్ణుని కప కార మొనర్చినట్లు గాని కానరాదు, పైఁగా నాయలను బిల్లలు కాళ్ళెత్త నందకుండునట్లుగాఁ దొట్టెఁ గట్టెదరు, అట్టి యూయెలనుండి కృష్ణుని పాదము త్రివిక్రమ పాదమయ్యెనేమో యెఱుఁగరాదు, పైఁగా శకటమునకుఁ గంసునకుఁగల సంబంధ మెవ్వరును వివరింప లేదు,

ఇఁక నిటనట్లుగాక పూతనామృతి నెఱింగిన కంసుఁడే శకటాసురుని బంపినాఁడు, బండిరూపమున వచ్చి సూక్ష్మరూపమున నింటఁ జొరఁబడి కృష్ణుని జంప నాతఁడు నిద్రించుచోఁ దొలపైకి దూకె, అంతనది విరుగ నందున్న కృష్ణుఁడు తన్ను జంప వచ్చిన వాని బాధ పరిహారణంబున మర్దించెను- పై రెండు కథలకన్న నిదియే సమంజసముగ యథార్థముగ నున్నదని సహృదయ హృదయ ప్రత్యక్షముగా, ఇట్లే ప్రాచీన కథలకు వర్ణనములకు మెఱుఁగులు దిద్దుచుఁ గథా కథనమునఁ గ్రొత్తపుంతలు దొక్కిరి

**మఱియొకటి**

భాగవతమునఁ గానరానిదియు జయదేవునిచే గీత గోవిందమును వ్రాయించినదియు మధురభక్తికిఁ బట్టుగొమ్మయగు రాధ యిందుఁగాననగును, ఈరాధ జయదేవుని రాధవంటిదిగాక పూర్వసుకృతమునఁ గృష్ణుఁబ్రార్థించి మన్ననల వడయు నలకూబర మణిగ్రీవులఁజూచి భక్తి విధేయయై కృష్ణునిలో నైక్యమయినది, నందుని కడగొట్టు చెల్లెలును. ఆరాధాకృష్ణుల సమైక్యమును జూడుఁడు

జీవికా జీవుల భావంబును వహించి
చంద్రికా చకోరిల చందములను
బటువర్ణముల భాతి భాజ్యదుస్తరులయి
పూఁదావుల క్రమంబుఁ బొందిపొసఁగి
యాకాశ ఘటముల యట్టు లన్యోన్యులై
విద్యుల్లతలభాతిఁ బెనఁగియుణఁగి
శర్కరా శుద్ధజలముల చందమునను
గలసిమెలసి యెయ్యెడల నొక్కటిగ మెలఁగి

రెల 'మినవి భాజ్యాలై' అని సారూప్యమును బోలికలద్వారా రూపుగట్టించె. ఇటనొక విశేషము. ఒకటియనిత్యము మరి యొకటి నిత్యము. అయినను నిత్యసంసర్గముచే ననిత్యమును నిత్యమేయయినది. ఇంతకన్న మానవున కేమిచలయు ? దీని కొఱకేగదా కర్మాచరణయు మనియమప్రాణాయామ ప్రత్యాహారాదులు. "ఒకనిత్యున్ సృజయింప లేవంటి నిత్యుండన్న పేరున్న యందుకు" అని యొకకవి భగవంతు నిలువఁదీసి ప్రశ్నింప దానికి సమాధానముగా, ననిత్యమగు సృష్టినిత్యత నిట్లు సాధించుకొన వలెనని యుపదేశించి నట్లయినది.

కంసుఁడు ప్రతినాయకుఁడు ప్రతినాయకగతభయము నెంత పరిపోషింతుమో యంతిగా నాయక గతివీరము ప్రస్ఫుటమగును. దీనిని బ్రాచీనులంతగా గమనించి నట్లులేదు. కాకున్న మొదట నొక సాహసికుఁడైనట్లును మధ్యలో మానవ తనుదాల్చినట్లును తుదకు భయభీతుఁడై సచ్చినట్లును గానుపించు. కాననే మొదట బాల ఘాత కిని బూతనను బంపినను నాపంపఁబచ్చిన రాక్షసులు గంసప్రేరితులో కాలము దీరినవారో మనకెఱుకపడరు. ఇందట్లుగాక ప్రతిరాక్షసుఁ డును గంసప్రేరితుఁడే. ప్రేరణసమయమున నాతని మనోభావము లన్నియు మనకుఁ బ్రత్యక్షములు.

అశరీరవాణి వినిన కంసుఁడు దేవకిఁ జంపదలంచియుఁ దనప్రా ణము లట్టివే యితరుల ప్రాణములనుకొని తనకుమృత్యువు శిశువుల వలనగదాయని శిశువులను సంహరించె. కేవల మృత్యుకారకమగు నష్టము గర్భమును దేవకి దాల్పఁగ మరియొకమారు దేవకిఁ జంప నెంచియు "మాటఁజెల్లించికొనిరి దంపతులు నేనకల్లరీఁడన్న పెనున పఖ్యాతిఁ గనుదు" నని వెనుకాడి బాలునకై యెదురుసూచుచుండె.

తానొకటిఁదలఁప దైవమొకటిదలఁచినట్లు బాలునకు మాఱుగా బాలికయయ్యె, దాని కద్భుతమంది తికమకపడియుఁ జంపఁగాలితోఁ

దన్నదియెగిసి "నిన్ను, నిన్నోలు దుర్మదాంధులనధింప నాతోడనవత
రించి పెరుగుచున్నాఁడు హరి- స్మృతిస్థా మనీషు" అని చెప్పెమాయ
మయ్యె.

బంధుఘాతకు, స్త్రీఘాతకు మోమోడనీనాఁడు గొంతునకువచ్చి
నది. మంత్రులఁ బిలిపించియాలోచించినాఁడు 'పుట్టినవారిలో నెవరో
కంసునిఁజంపువాఁడు. దుష్టకంఠుల నందరిఁజంప నాతఁడుఁజనిపోవు.'
ఇది మంత్రులనిర్ణయము. ప్రభుత్వము గుర్తించినటకును 'రాజ్యాంతే
నరకంధ్రువ' మ్మనుటకు నింతకంటె వేరేనిదర్శన మేమికావలయు.
సరియ బాలుల నెట్లు సంపవలయునను దానికి విషస్తన్య మివ్వవలయు.
దానికి సమర్థురాలు కటికి గుండెకలది పూతనగాబట్టి దానినే పంప
వలయు. ఇది మంత్రుల స్పష్టమైన రహస్య నిర్ణయము. నిర్ణయము
వెంటనే కార్యాచరణ ప్రారంభింపబడినది. దాని వెంటనే బాలమర
ణము లెక్కువయినదని గర్గోలు. దానినాప ప్రతిమనుష్యుని ప్రక్క-
నొక గూఢచారి బాలమరణమునుగూర్చి నోరెత్తువారినెల్లఁ గార
బంధించుట. ప్రతివారునోరు నొక్కుకొనిరి. అవును చచ్చినవారిక్కై
యేడ్తురా? చావసిద్ధమగుదురా?

కానసే "నెమ్మనదిఁ(పూతన) తొక్కినట్టి గుమ్మమ్మ లేదు.
పూతనకు లోనుగాని కాపురము లేదు
బ్రదికి కొరింత వేయు నర్భకుఁడు లేఁడు"

అబ్బ! ఎంత భయంకరమగు శిశుప్రళయము. ఎంత విచ్చల
విడియగు దానవత! అవును. కంసురాజు. తనప్రాణమునకు వచ్చినది 'తన
చావు జన్మగ్రహణయము' ఆ తనప్రళయమునకన్న ముందు శిశుప్రళ
యము సాధింపించినాఁడు.

ఇంతఁజేసియు పూతన చచ్చినదేకాని తన్నుచంపువాఁడు మర
ణింపలేదు, కంసునకుభీతిగల్గినది. ఇంతలేని బాలుడే పూతననుజంప

నరయోమయమునఁ బడినాడు. నిరాశయుఁ గల్గినది. దాన "సంజాతమహాగ్రహజ్వాలన జర్జరితాత్ముఁడై శకటాసురుఁ బిలిపించినాఁడు. గౌరవించి" నన్నుగడ తేర్ప నెంచి జన్మంబునందిన 'అర్భకుండు పూతనను జక్కాడె ' వానినెట్లేనిఁ గడ తేర్పవలయునీవు ' అన్నాడు. దీనఁ గంసునకున్నభయము, ఆగ్రహములన్యతో సాధ్యములుగదా !

శకటాసురుఁడు తాతలఁజేరె. తృణావర్తుఁబిలిపించె. బాలుని గూర్చి యేమిచెప్పుటకు నోరుపెగలక యూరకున్న తృణావర్తుఁడే "స్థాల్యరూపుఁడు శకటరాక్షసుఁడు. దుగ్రింగె" (ఈ పాఠమిట్లుమార్పఁబడినది "హేయరూపుండు శకటదై తేయుఁడీల్గె" అని కారణముద్గ్రాహ్యము) అన్నాడు. అనవాఁడు పేరునకు (పైకి) లావుగా లావరియన్నట్లు గాననచ్చునేగాని యంతస్సారములేనివాఁడని యర్థశక్తిచేఁ దోఁచుగదా ! పైగా నా 'మనుజరూపకునేఁ బరికూర్పకున్న నసురవంశంబునకున పఖ్యాతిఁదేనె' ఎంత గర్వము ! ! ఎంత యహంభావము ! ! ఇది యుగయుగాల రాక్షసచరిత్రను గన్నులముందు రూపుఁ గట్టింపదా ? ఇట గర్వమను భావము చర్వణా పరాకాష్ఠనంది యహో ! యనుపించునుకదా ! అట్టి తృణావర్తుఁడును గాలిలోఁ బేలపిండి యయ్యె.

ఈ సంగతి కంసునకుఁ దెలిసినది. నమ్ముకొన్నముగ్గురు యమునకమ్ముఁబడిరి. ఏదిదిక్కు ? ఎవరుపాయముసెప్పువారు ? ఎట్లా కృష్ణుని మర్దించుట ? రాత్రులు నిద్రపట్టదు. ఆలోచనలు తెగవు. తిండిసయించదు. కనులుమూఁతఁబడవు. మూఁతఁబడెనా కృష్ణు తేజోదగ్ధనమే యగును. నిరంతరాను ధ్యానముచే భ్రాంతి పగాం కోటియందు కొన్నది. కనువచ్చినవాడెల్లఁ గృష్ణుడేయగుచున్నాడు. ఆఁపుకొన్న నాగక గొంతులోనుండి 'కె' వ్వను కేక బయులుపడుచున్నది. కన్నులను లిమికొని చూడవారు -వారిజాక్షులే. అయినను వారినల్లని కనువెలుఁ

గులఁ గృష్ణుని శ్యామరూపమే నిలిచినిది. ఎఱ్ఱని వస్త్రమునుజూచి బెదరు పసగమైనాఁడు కంసుఁడు. ఱట్టివాని కేదిభయకారణముగాదు. రథచక్రిమునుజూడఁ దద్వత్ (అదిగలవాని-కృష్ణుని) స్మరణము గలిగి తల్లడపడు! భోగములన్న-అవిగలవాఁడే వానిపాన్పను జ్ఞానమునఁ దలఁపంచి రోసరిల్లు. ఇట్లనుక్షణము మరణయాతనఁ బడుచుఁ దట్టుకొనలేక మఱలఁగూటమునేసి కృష్ణుఁడు వనచరుఁడుగాన వనచర రూపముఁ దాల్పఁగలవారలే చంపఁగలరని యెంచి యట్టి వేషమునఁ గృష్ణుఁ జంపువారలకు సాఁబాలురాజ్య మిత్తునని చాటంబంచె.

కంసునకు వచ్చిన వనచరరూపధారులంగాంచినంత వంతదీరె నఁట! సంతసమున నొడలుమఱచెనఁట; అవును ప్రతిక్రొత్త యాశయు వింధ్యమంత పెరిగి పాతాళమునకరుగుఁగదా! మఱియు నాశ పెరుగు నపుడే 'విరుగుటకొఱకే' యనుశకునమును మనస్సులో లోపారలనుండి తలయెత్తును. కాననే యుత్కలారణ్యవాసియగు వత్సాసురుఁడు "మాయాభ్రాంతుఁగావించి కూల్చెదనన" సులభసాధ్యుఁడుగాఁడు సుమా" యనుచునే పంపె.

వచ్చినవాఁడు వచ్చినట్లు సచ్చె.

ఆతర్వాత నొక్కొక్కఁ డేఁ కృష్ణుఁజంపలేరను భీతిగాఁబోలు బకుని వానితమ్ము నఘాసురుని బంపె.

వారును జచ్చిరి.

పోయినపోకడయేగాని రాకడ లేదు. ఆశలాఁగెనవి. స్వేదము గుండె నిండినది. ఇంకేమి సుఖములు? ఇంకేమి బ్రతుకను నైరాశ్య జ్ఞానమున "మృగమదాద్యనులేప భోగములనుమాని యోగియయ్యె" రోగి యాశవదలినను బంధువులాశ వదలరు. మరికొందరి బట్టుకొని వత్తు మనినారు. విని పరిహాసించి-ఎందుకీ కల్లల్ పొల్లులనె - వీరి దర్శ

నమున వ్యర్థాలాపమువలన రేగిన చిరాకుతోఁ గసురుమనె. దాన మంత్రులించుక తగ్గి "జాతస్య హిధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్యచ" అయినను "ప్రారబ్ధము త్తమ గుణాన పరిత్యజంతి" అని విన్నవించిరి. పోనిండు ! అదియుఁ జూతమన్నాడు కంసుఁడు. మంత్రులు పంప ధేనుకుడువోయి బలరాము చేతిలో నీల్గె.

ఇటనొక సందర్భశుద్ధి. భాగవతమునఁ దనంతఁదా ఖరాకారు ధేనుకుఁ జంపినట్లున్నది. ప్రతి రాక్షసునకుఁ గృష్ణునిపైఁ గోపము గాని బలునిపైఁ గాదుగదా ? అయిన బలుఁడేల పిలువని పేరంటము నకుఁ బోయె ? ఇందుమాత్రము గృష్ణుఁడే పోవ ధేనుకుఁడు దన మాయల విస్తరించుననియు నంతపనియేల నీవే వానిపని సరిజేయు మని కృష్ణుడే పంపుఁ దీననొక లాభమును గలదు. కృష్ణునిఁ జంపనే యింతసతమగు వానికిట్టిఁడు మరొకఁడుండెనని యెఱుకపఱుప మరింత గుండె పగులునను సూచించుటకే.

అనుకొన్నంత యయినది. కంసుని కెఱుకపఱుపక యె మంత్రులు ప్రలంబు నంపిరి. కృష్ణకనుసన్న బలుఁడే వానింజంపె.

మంత్రులకు భయమూరినది. చుట్టుపక్కలనున్న సామాన్యుల సామాన్యులు కృష్ణుని జంపలేరని నిశ్చయించుకొని బ్రహ్మదేశవాసి మంత్రశక్తి నాశాంతప్రసిద్ధుఁడగు కాళియుఁ బిలిపించిరి. వర్షాశన మిచ్చిరి. కోర్కెదీర మేపిరి. ఎంతదూరమున నున్నను మీరు మేము నొకటియే యని సంబంధము గల్పిరి.

కృష్ణభీతి నాసలపీడిన కంసుమమ్ముఁ గాపాడుమని ప్రార్థించిరి. 'నీసమర్థత వినుటఁ జేరాసతోడఁ విసువుఁజెందియుఁ ప్రాణముల్ బిగ్గ బట్టి బ్రతుకుచున్నా'మని దువ్విరి. వాఁడు పొంగినను 'ఆహా ! యిది యుంగడు దుష్కరంబె ? అని ప్రశ్నార్థక వాక్యమునఁ దేలి కదనము జూపినను వాని మనస్సు నిశ్చయార్థక మీరోయేవకారమవన్నది. (దుష్క-

రంబే తప్పక దుష్కరము) అయినను దిన్న విశ్వాసము-సాజాత్య విశ్వాసము సహజ మదమాంద్యముతోడ రాఁగాఁగాళిందిలోఁ దిష్ఠ వేసినాఁడు.

ప్రజలు కష్టోలుపడిన. భూతరక్షణమే కర్తవ్యముగాఁ గల యదూద్వహుఁడు చూతమని కాళింగి దగ్గరకు వెళ్లినాఁడు కాళియుఁడు నీటిలోపలకుఁ గొంటినాఁడు. పాటు వానిపైఁ బౌరుషమేలయని కృష్ణుఁడు గిరుక్కున నింటికిమరలె. అప్పటినుండి కాళియునకుఁ గృష్ణుఁ డెప్పుడెప్పుడు వచ్చునాయని యెదురుచూచుట, ధ్యానించుటతోనే సరిపోయినది. ఈప్రతీక్షలో గతకాలంలోనున్న మోహము నేనింత యంతవాడనను గర్వమును దుడుచుకొనిపోయినది. ఇఁక మిగిలినది శేషభాగేచ్ఛయే. తెలిసిచిందినను తెలియక చిందినను గతక గంధము కలుషోదకముఁ దేర్చుగదా!

కలఁకఁదేరిన యుదకమున ప్రతిబింబమేర్పడును. కానికలుషమడు గున నుండనేయుండు. దానిఁ బోఁగొట్టవలయు. కృష్ణుఁడు చేయవలసిన పనియది. దానికై నికటస్థ భూరుహమెక్కి ఫణములపై దూఁకె. అడుగున నున్న మలినము వెడలించె. రుధిరోద్గారమునఁ గృష్ణుపవిత్ర పాదస్పర్శ నమున నేమ వింతభయమును సంతోషము ననుభవించుచున్నాడు. వానిభార్యలువచ్చి శరణనిరి. మంగల సూత్రమును దక్కించుమనిరి కూలికి విషముగాగ్రుసంబేద యనిరి. భగవంతుడవార్తత్రాణ పరా యణుండవగు నీకచ్చెచల్లార దేనిముందు మమ్ము జంపుమనిరి. భగవం తుఁడు లోలోనవ్వుకొనియెను. ఈవార్త తెలిసిన గోపబాలకులు వచ్చి యాశ్చర్యముతోఁ జూచుచుండిరి. ఇంతగోలయుఁ గాళియునకు స్వప్న ములో వినవచ్చు మధుస్వరములవలెనుండె, తనవారిగొంతులో దాఁగిన విషాదము మేల్కొలుప మత్తువీడిచూచె. తలపై భగవంతుఁడు. మేన్నెల్ల

పులకించెను. గతమెల్ల తలఁపునకుఁదగిలె. పాదములంటి కంపముతో నిట్లువిన్నవించె.

పావన కోమలాంబురుహపాద ! భవత్పద ఘట్టనంబులన్
బావనమయ్యెఁనాతనువు భావమునీ కరుణార్ద్ర దృగ్వ్యతిక
బావనమయ్యె నాత్మ పరిణామమునందెఁ ద్వదీయసన్నిధిన్
గావర మేదె-దాసుఁడను గాచుటొ యేచుటొ యాచరింపవే

అన, జరిపినతప్పుల జరుపకుండ హిమవత్పర్వతముల దరికేఁగుమనె.

ఈ కథ భాగవతమున గృష్ణుఁడు పుట్టిననాఁటనుండియుఁ గాళియుఁడు యమునాహ్రదంబునఁ గాళింది మడుగులో విషముమియుచునే యుండెననియు-దాన గృష్ణున కొకరోజు కాళియు సరిజేయసంకల్పము గలిగి చేసెనని గలదు. హరివంశమందింతేకాక కాళియునను చరులు గోరూపుధరించి తనకుఁ గీడొనర్పరోయుదరనియాశంకించి తదీయనాయకు నొంప నెంచెనని కలదు.

ఈ రెండుగ్రంథములఁ గృష్ణుఁడంతవరకుపేక్షించి యానాఁడ పేక్షించుటకుఁ గారణము మృగ్యము. కర్మయన భక్తియనఁ బాపము లాచరించుటాయను ప్రశ్నమిగులు. దీనవట్టి వొసఁగుదొల్లిక సందర్భ శుద్ధిని సవరించుకొనెఁ గదా !

మంత్రులు మొదటఁ గంసునితోఁ బ్రలంబకాళియుల సంగతిఁ జెప్పకున్నను దర్వాత విన్నవించుకొనిరి. కంసుఁడును గృష్ణుఁబ్రత్యక్షముగ జయింపలేమిని బృందఁగాల్ప నద్రుశ్యవీరులఁ బంపిరి. వారట్లే యొనర్చిరి. అమంటలకావనము ప్రళయపయోధియట్లల్లకల్లోలమై యుద్ధుకుడుచుకొనె. పదునాల్గులోకములబొజ్జలోదాఁచుకొన్న కృష్ణుఁడు చేతులుసారించె. దగ్ధసర్వము పునరుజ్జీవన మందినది. చిగిరించినది. ననలెత్తినది. విస్తరించినదియు. అదిసూచిన దనుజులు కృష్ణుపాదముల

పైఁబడిరి. అభయం సర్వభూతేభ్యోదదామ్యే తద్వ్రతం మమ యనె. ప్రతిపని యెదురుతిరిగినప్పుడేది కానవచ్చిన దానితోనే కార్యసాధనకు పక్రమింతురు. ఇదిసహజము. దీనఁ గార్యసాను కూలమాశించికాదు. ఏదో చేయవలయుఁగదా! అట్లే వృషభాసురుఁ బిలిపించికొనిరి. పంపిరి చంపుకొనిరియు.

కంసుని కొక్కనిపై మిక్కిలి ప్రేమగలదు. విశ్వాసముగలదు. తెలివికలవాఁడని గౌరవముఁగలదు. వాఁడు కేశి. వానికి దీర్ఘ కేశ పాశము గలుగుట నట్టిపేరువచ్చెను. వానిఁబిలిపించి కృష్ణుఁజంపలేమను నిరాశఘోష మందున బాలాదివృద్ధులఁ జిదిమిరానాజ్ఞాపించెను కంసునిలో గూడుకట్టుకొన్న నిరాశ ప్రియమిత్రులతోనైన మాటాడనీదు. కేవలము తడియారినకన్నులతో, దిగులునిండిన గుండెతో నీట మునుఁగువాఁడు చేతులాడించునట్లు కన్నులనాడింపఁజూచి మంత్రులే కృష్ణు సంబంధించునే యొక్కనినైన జంపింపఁ గృష్ణుఁ జంపినంతగా సంబరంపడ పేరాసలుపెట్టుకొనిరి' అవును బలవంతుఁడైన శత్రువును జంపలేనప్పుడు. వానికి సంబంధించునే యొక్కనినైన మట్టుపెట్టి (కనీసము మాటలలోనైన) సంతసించుట మానవసహజము- అదేయిట పరాసృష్టమైనది కాని పాపము వారేమెఱుఁగుదురు భగవంతుని కన్న భక్తులే మిన్నయని!

కేశి తెలివి కలవాఁడు ప్రతి విషయమును జాగ్రతగఁబరికించు వాఁడు పతికి హితము సేయని-చెప్పని పరిచారకులు పరిహారకులను విశ్వాసమువాఁడు. కాన నొకవేళజరిగినదానిఁ బునరాలోచించి సన్మార్గమందు నేమోయను నాశతో నిట్లుపక్రమించె.

దేవా! మీకొఱకే నేను మేమందరము జీవించుదుము. మీరు దూఁకమన్న నగ్గినైన దూఁకుదుము, అయినను హితుఁడగు వాఁడు హితమప్రియమైనను వచింపవలయు, కాఱులఱచిన లాభ

మున్నె? చూడుడు 'బాలుండర్భకుఁడాతతాయి' యని మాయూహ కానీ మాయల్లుఁడు (మాయంత సత్త్వమువారసత్త్వమని ధ్వని) పైఁగా హరి [దుష్టులహరించువాఁడు] దనుజమాయలనే మాయింప జన్మించి నాఁడు. అతఁడు సామాన్యుఁడా? పాలు త్రాగు వయస్సునుండియు మనమాయల భంజించుచునే యున్నాడుకదా? ఇట్లు మనకు శత్రు వైనను బాహియని పాదములంబడ ముందు వెన్క లాలోచింపక రక్షించువాఁడు కాళియాదుల రక్షించిన వాఁడును. జీవన్ భద్రాణి పశ్యతి గదా! మనమూ దారినే యాశ్రయించిన లగ్గగునేమో? ఇది నాప్రాణములపై నాశ చేసచింపను. ఈప్రాణములెప్పుడు తమ పాదముల కర్పితములు. కాని... తమ... తమ యాత్మ మనోరక్షణల కొఱకే యింత సాహసింప వలసె.

పోఁగాలము దాఁపించినవాఁడు మిత్రవాక్యము వినఁడు. కాని తెల్లవోవు, ఆశ్చర్యపడు, తలవంచు, మొండిపట్టుదలతో దనవాదము బునరుద్ధరించుకొను. కంసుఁడు నట్లు ప్రవర్తించె. అవునతఁడేమి యాకసమునుండి యూడిపడెనా మరియొకరీతి బ్రవర్తింప? అతని సమర్థన మిది.

కేశీ! కేశవుఁడా వ్రజార్భకుఁ డుఁలో కేశుండె శ్రీకృష్ణుడై
నైశాటోత్కర నాశనార్థమయి జన్మంబందు టాకాశవా
ణీశ స్తోత్రుల' నమ్మియున్నాము, ఇంతవరకట్లే యున్నదియు దానినే వివరించుటలో నీయుద్దేశము 'భయోద్రేకంబు బ్రేరేచుటేనా? మరి యేమిన్నగలదా? ఏమికర్మమోకాని ఆకాశవాణి వార్తల! విన్న నాఁటినుండి గుండెలపైఁ జేయిడి నిద్రవోయి యెఱుంగఁగదా!

కంసునకున్న యాశయొక్కటి యూడిపోయినది. కేశిపైఁ గల నమ్మకమున నింతవరకు జీవన్మరణసంధిలో నూఁగులాడువాఁడు కంసుఁడు. ఇప్పుడందుఁబూర్వార్థ ముగిసిపోయినది. ఉత్తరార్థమునకు

సిద్ధపడి మంత్రులఁ బిలిపించినాఁడు. 'ఇంతవరకు మీరొనర్చిన సాయము మరువరానిది. దీనికిఁ బ్రతియీజన్మలోఁ జేయఁజాల. మరుజన్మమునఁ దీర్చుకొనెద. నాకొఱకెన్నఁడు నూరక గతాసులుగాఁ బనిలేదు. కాలము మేలై చనుదెంచెనేని "శత్రుక్షన్ నాశముచేయవచ్చు తుది మాట లివేనవివీడు కోఁదగుఁ" అని మరణవాఙ్మలముపై సంత కింపఁబూనినాఁడు. మంత్రులెల్ల గొల్లుమని "మీరిట్లాలోచించి మనసుఁ జెడఁగొట్టుకొనకుఁడు ప్రభూ! మిమ్ముఁ విడుతుమా? మిమ్ముఁబాసి మనంగ నేర్తుమా? "అంతవచ్చిన సందర మొకెసారి కట్టకట్టుకొని దూకుదుముగాక– అయినను" గట్టకడఁదాక నెక్కైన పట్టుఁబట్టి కార్య భరమువహింతు' మన్నారు. వారి భక్తివిశ్వాసముల కలరినను నజ్ఞతకు శలభత్వమునకు నవ్వుకొని తలయూఁచినాఁడు.

మంత్రులు గాలించి గాలించి మయుని కొడుకగు వ్యోమకా సురునిఁ బట్టుకొన్నారు. అతఁడు మంత్ర తంత్రములదిట్ట– వానితో 'నీకు సరివారెవరయ్యా సురాసురాదులన్' అన్నారు. అతఁడటునిటుఁ జూచెను "ఎవఁడు మాబావయగు రావణేశ్వరుని వధించెనా హరి నేఁడు శ్రీకృష్ణుఁడయ్యె' నని రోసమెక్కించిరి. అట్టి కృష్ణుఁజంపి తేనికి సాయపడుమని ప్రార్థించిరి. వ్యోముఁడును" జోశ్! ఇదెంతపని? పరాధికారము పైనవేసికొనరాదని యూరకుంటిఁగాని లేకున్న 'కృష్ణు గిష్ణు దుర్మదమణఁగింపనే? నన్నెదిరి జీవముతోఁజన నెవ్వఁడు పుమీ ముదల యొసంగుఁడీ' యనుచుఁబోయెను బృందకు వ్యోముదైత్యుడున్.

అతఁడు మాయావి! మాటలునేర్చినవాఁడును. కాఁగా గొల్లని వేషముతోవచ్చి కృష్ణుని మోసగించి దూరమునకుఁ గొంపోఁబోవఁ గృష్ణుఁడాతని గొంతువట్టుకొనె. వాఁడు తెల్లవోయియు 'నీహితుండు' నన్నాఁడు. కృష్ణుఁడును నేనునీకు హితమేచేయుచుంటి. ననె. వాఁడె దురు దిరిగె కృష్ణుఁడు వానినిఁ బడఁద్రొబ్బె. నెత్తురులు గక్కి– మ

వాఁడు "గతాసుఁడయ్యె" (ఇక్కడ అసువులు గతములు. ఆత్మనిత్య మయ్యెనని వ్యంగ్యము)

కంసుని దగ్గరకుఁ జేరుటకే మంత్రులు భయంపడుచుండఁ గంసుఁడే పిలిపించి "అనుకొన్నది తలక్రిందులయినది. మిత్రుల మ్రింగితి నను నపఖ్యాతి మిగిలినది. ఏదినమునకాదినము దిగులు పెరుగు చున్నది. "ఇఁక నేని నన్ను బుచ్చినఁ దికమకలను గనక ...... బాధక జీవితముక్తి గనుదు" నన్నాడు.

రాజుతో మంత్రుల జీవితములు ముడివడియుండు. కానఁ దమ కొఱకయిన రాజును రక్షించుకొన వలయు. అందుకే.

కంసజన నాయకా ! ఆత్మహింసకంటె
నధమ కృత్యంబుగలదె ? ప్రయత్నమునను
గాని కార్యంబుగలుఁగునే ? కట్టకడకు
నెట్టనఁగడంగువాఁడె పోదిట్ట" అనినారు.

ఇట నాత్మహింసయెట్లో నామంత్రులకే తెలియవలయు. ఏల ధన యర్మాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే" అని కదానాఁటి సంప్రదాయము. మరియు "హతోవాప్రాప్స్యసే స్వర్గం జిత్వావాభోక్ష్యసేమహీం" అనియుఁ గలదు. కాన యుద్ధ మెటులైనను లాభకారి కరణీయ ధర్మమే కాని యాత్మహింసకాదు. కాని రాజు మనసు మార్పఁడలక మతికించి నట్లతికించిరి. "అయిననేమి చేయవలయు నను ప్రశ్నకు" మూల బలచ్ఛేదమొనర్చిన రాజు దుర్బలుఁడై వశ్యుఁడగు. అట్లే కృష్ణునకు మూలబలము 'గోవిబుధ విప్రగణంబు. కాన వానిని బాధింపఁ గృష్ణుండు కీలెడలినబొమ్మ యగు నిదె మంత్రము.

సహజముగాఁ గంసుని పరిపాలనమే ధర్మభ్రష్టము. పైఁగా భయము వలన మరింతయుఁజెడినది. దానికిఁదోడు నీనాఁడీయాజ్ఞ. అది వరకే మాత్రమేని జనులొనర్చు పుణ్యములలో షష్ఠాంశమువచ్చి రాజునకు ధారకమైన నీనాఁటితో నదియు బిగిసినది. మరియు నది వరకుఁ దనకొంటకై యొక్క కృష్ణునితో మాత్రమే విరోధము. ఈనాఁడు ధర్మముతోఁగూడ. అదివరకేమాత్రమేని మానవత్వమున్న నీయాజ్ఞతో నదియుఁగాలీ. ఇఁక మిగిలినది కేవలస్వార్థపూరితుఁడైన కంసుఁడు. దీనిని వ్యంగ్యమర్యాదచే భాసింపఁ జేయుటకేన రాధముం డని చెప్పుట. పదేచితియని నిదిగదా! కంసుఁడట్లేయని చాటింపించి నాడు.

ప్రభుత్వ మొకచట్టమును దీసికొని రావలయునన్నఁ బ్రజల యూఁపును బరిశీలించును. వ్యతిరేకు లెక్కువైనఁ దోకముడువకయు ముడిచినట్లుగను గొన్ని కొన్ని వారి వీరికి ననుకూలమైన మార్పులను గావించు. దానితోనందరు చల్లబడఁగాఁ దన చట్టము నట్లెబిగించు. ఎవరేనిఁ గొందరు గొణుఁగుకొనువారున్న ననుకూలురు గూఢచారులు గొంతుట్లొక్కుదురు. అసలే సహించలేనివారున్న పరదేశముల కేఁగు దురు. ఇద్దియునాధిమ్యోగాళ యనంతమైన సంప్రదాయమును. కంసుని పరిపాలన మందుఁగూడనట్లె. కావుననే సహించలేని కొందరేనా నావిషయంబు లేగిరి, అందుఁ గొందరు బృందఁజేరి యాగము సంక ల్పింపఁ గృష్ణువిరహితముగా నుండవలెనని కంసుఁడాజ్ఞాపించె. దానిఁ గడవలేక యద్ధ్వరద్రవ్యములు వ్యర్థమగునని మహర్షులచ్యుత (ఎప్ప టికిని ద్యాగ మొనర్పఁతగిన వాఁడని ధ్వని) వ్యజించి యాగకార్యములు నిర్వహింపఁబూని. ఒ! అహా! సమశీతోష్ణాది ద్వంద్వులగు వారికే ప్రాణముల పై నిఅ మాసలుండఁ బామసప్రధానుఁడగు కంసునకెంత యుండవలయు?

ఇట్లు కంస గతభయమునఁ గృష్ణగతవీరము పరిపుష్టమై అతి మానుషత్వమునువ్యక్తీకరించుచుఁ బ్రతికథకు సందర్భశుద్ధిఁ గలిగించుచు ముగ్ధ ముగ్ధముగాఁ జర్వణా గోచరమగుచున్నదికదా !

శిల్పమన వ్యక్తులనాయా భావముల హృదయమునకు హత్తుకొనిపోవు నటులరూపించుట. అదిలేనికావ్యము-రచనహృద్యమైనను చిరంతనత్వమందుకొన్నను విన్నప్పుడు కన్నప్పుడానందమిచ్చునే కాని రూప ప్రత్యక్షతనందుకొనదు. కాననే భావకవిత్వము చదువునపుడు సుందరము. భారతమువలె అమరుక కావ్యమువలె తలఁచినప్పుడెల్ల స్పష్టతదాల్చదు దీనఁ దనబ్రతుకుకొఱకై మానవత్వమునుండి జారి భయభీతుఁడైన కంసుఁడు. కనవచ్చు పసిపాపనెల్ల కాలమట్టిన పూతన. స్థౌల్యరూపుడైన శకటుఁడు, గరిష్ఠుండైన తృణావర్తాదులు బొమ్మలవలె మనకనుల ముందరనాడుదురు. అందరికన్న నెక్కువగా నన్నిచోట్ల తానైన శ్రీకృష్ణుడుఁ ప్రతిపనికినేనని చిరునవ్వుతో ముందునకు వచ్చు. మేఘములోనున్న మెఱుపన్నట్లు నందుని కడగొట్టు చెల్లెలు హఠాత్తుగా జిగేలుమని మఱుగుపడినట్లు ముమ్మూర్తు దర్శనమిచ్చును.

వ్యోమకాసురుని గొల్ల వేష మెంత యందము నుండెనో చూడుడు. చేతనుగోల, పాగయును శీర్షమునన్, జెవిజంపు, మీస లున్ మూతిపయిన్, ద్రిపుండ్రములు మోమున, గంటె (వెండిది) గళాన, మూఁపుపై ప్రాతది దుప్పటమ్ము మొలత్రాటను గజ్జెలు గోనుముల్లుడా చేతను గొమ్ము, గాళ్ల గిఱు చెప్పులతో" నట !

నిద్రను గూర్చిన యీ వివరణమెంత హితబోధకమో శీలించుడు. "తమోమయంబై, సర్వజీవావశ్యంకంబై ప్రాణిపోషకంబై చైతన్య స్థబ్ధకంబై పారిశ్రామిక దేహ రుజోన్మూలక దివ్యౌషధంబై మేదోమయ బద్ధక నిర్వ్యాయామ. శారీరక రుగ్వ్యాపకంబై దైహిక

మల విమదుమ వేగ బహిర్గత్వాపాదన పాటవంబై కాయదార్ఢ్య కరంబై యారోగ్యవర్ధకంబై యామయశమన కారణ సమర్థంబై నిత్య ప్రిశయసాంకేతికంబై శారీరేంద్రియ సత్వపరిశాంతి కరంబై నివిూలితేక్షణము హ్రాంకంబై విశ్వవిశ్వంభరా నాటకరంగ తిరస్కరణిమై ప్రకృతి బద్ధంబట నిద్ర!అహో! కొండ తిరుణాలకేగు గొల్లల తొట్రుపాటు చూడండి!

గీము వెల్వడివచ్చి కీల్జడస్మృతికిరాఁ
దేరఁ దిరిగిపోవుసీరజాక్షి
పల్లె వెల్వడిజరి యొల్లెగన్పడకున్న
వెన్కకునేగు నాభీరయువకుఁ
డధ్వాంతరమున భక్ష్యాదుల మఱచుట
మగనిగీమున కంపుమచ్చెకంటి
నగము చేరువకేగి నగల్కై వగచుని
ల్లాలిఁ పైగినియు వల్లవుల మేటి
వసతిఁ జేగియుఁ బైకంపుం బరణిలేమి
మగిడి నివ్వెఱ బాటు దంపతులజంటలట
అహో! శిల్పమన నిట్లుండ వలయు.
ఇట్టి శిల్ప మనోహరత దీన సామాన్యము.

'సంగీతమపి సాహిత్యం సరస్వత్యా స్తనద్వయం
ఏకమాపాతమధురీ మన్యదాలోచనా మృతం' అన్నారు.

ప్రాచీనులు తమ వేలవేల సంవత్సరాలయను భూతికి నిదర్శనముగా. ఇందు సాహిత్యమునుగూర్చి చాలఁ జాలఁ జర్చించి ధ్వని సిద్ధాంతమునకు వచ్చాలకిత్వచ్చిరి.

అదియిది 'యత్రార్థశ్శబ్దో వాతమర్థము పసర్జనీ కృతసార్థే

వ్యంక్తః కావ్యవిశేషః సధ్వని 'రితి' అనఁగా శబ్దముగాని యర్థముగాని వాచ్యార్థ విశిష్టమైన యర్థమును బ్రత్యాయన మొనర్చు నది ధ్వనియగు. తద్వత్కావ్యమునక యగ్రస్థానము.

అట్టికావ్య మణులలోనిది నాయకమణి. లోకోత్తరమైన కథ కల్గిన తేనెపెర. ఎటఁబిండినను వాచ్యార్థ విశిష్టధ్వని యూరుచునే యుండు. ప్రతినాయక చిత్రిణలో దీనినట నట వివరించితిని గూడ.

మీరునమ్మఁడు. నమ్మకపొండు. కనులమూసికొని పుస్తకము దెఱచి చూచితిని. చూడఁగనే 'బుద్ధిస్థానముఁ గోలుపోయి' అను పద్యము కానవచ్చినది. అది తనకునన్వయించినట్లు "నేను తెలివితక్కువ వాఁడనా?" యని యహంతమూల్గినది. 'కాదా' యని హృదయ మెక్కఁదీసినది. "ఔనేమో?" యని చిత్తముగొణఁగి కొన్నది.

నిజము: ప్రాచీను లొకవిషయము నెరవేరునా లేదా? యని సందేహము గల్గినప్పుడు భగవంతుని ధ్యానించి, కనులుమూసికొని పుస్తకముఁ దెఱతురఁట! అటనే భావముండెనో యదియే సందేహము నకు సమాధానమని విశ్వసింతురఁట! అది నిజమాయని మఱియొక మారు చదువుకొంటి. మరొకమారు. మఱియొకమారును. నిజమే యనిపించెను.

పోనిండు, అసలు పద్యమిది.

బుద్ధిస్థానము గోలుపోయినినుదుర్బుద్ధిం బరీక్షించితిన్
గ్రుద్ధుండన్ మదదగ్ధుడన్ వికటదుర్గోత్రైక వైదగ్ధుడన్
శుద్ధప్రాజ్యభవత్ప్ర పూజ్యచరణాంభోజద్వయ స్పర్శసం
సిద్ధప్రాజ్ఞత సంభవించుటరయన్ సిద్ధాంతమే శ్రీహరీ!

ఇది దేవేంద్రుఁడు గృష్ణుఁ బరీక్షించిన పిమ్మట జేసిన స్తోత్రము. ఇందిందుఁనకుఁ గృష్ణు నతిమానుషచర్యలఁజూడ నాశ్చర్య ముతో మతిచెడినది. దానితో దుర్బుద్ధి ప్రవేశించినది. కాఁగా పొట్టేలు

కొండనువలె గోవిందుల నాశమొనగ్ప సంకెళ్ల బిగించిన పుష్కలావర్త కాది మేఘముల సంకెలలవిదిల్చె. అవియు నేడుదినములు పిడుగులు మిసినవి, జలప్రళయ మొనర్చినవి. దానితో నసాధ్యమును సాధించిన మదము శరీరమును గాల్చుచుండఁ దన గొప్పఁదనము తనవారలకుఁ జూపఁ దీసికొని వచ్చెను. ఏమైనది? ఏమియుఁగాలేదు. గోపాలురందఱు సురక్షితులయియే యున్నారు. వికటదుర్బోధమనువై దగ్ధ్యతి (పండితం మన్యత) పెచ్చరిల్లినది. కోపమునఁ గన్నులు రక్తముగ్రక్కినవి. ఒడలం తయు బిట్టుచలింపఁ దనకుఁ దెలియకయే గిరిభేత్తృాచణమైన వజ్రమును గోవర్ధనముపైఁ బ్రయోగించెను. అది కొండపైకి వచ్చుచుండ సహస్ర సహస్ర వజ్రసన్నిభమైన హస్తమావచ్చు నాయుధమును గ్రసించినది. అప్పుడు బెదరె. భయంపడె. నివ్వెఱపడె వజ్రి (ఇటనీశబ్దము పరిహాస ద్యోతకము)

నిశ్చేష్టుఁడై వెనకు వెనుకకుఁబోవ సర్వము గోచరించినది. వెంటనే పూర్వసుకృత విశేషమునఁ గృష్ణపాదముల నంటఁగల్గెను. దాన సంసిద్ధ ప్రాజ్ఞత సంభవించె. ఇది సిద్ధాంతమా? ఇది యొక గొప్పయా? అనఁగల్గె.

ఇట్లు సామాన్యముగఁ బద్యమున్నట్లున్నను నర్థమువలన నర్థాంతర ప్రతీతులుగల్గి ధ్వని కుదాహరణత్వమందు కొనెఁగదా!

ఇటఁగావ్యలింగమను నలంకారముగలదు. అది భగవద్గత మహిమాతిశయ మునభివ్యంజించుచు నింద్రగత భక్తిభావమును దృఢం పరిపోషించుచున్నది.

ఇట్టిపద్యము లిందు కోకొల్లలు. దేనిముట్టుకొన్నను ధ్వని యూరుచునేయుండు. కాననే దీనికి నాగమత్వ మబ్బినది.

తమసోమాజ్యోతిర్గమయ

ఇట్లు, బుధజనవిధేయుడు
సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ,
వారణాసి కోటేశ్వరశర్మ

శ్రీరస్తు

శ్రీకృష్ణ [illegible]

# శ్రీకృష్ణాతిమానుషతత్త్వము.



## ప్రథమాశ్వాసము.

క॥ శ్రీ రుక్మిణికిం శ్రేష్ఠుండౌ
సిరిగం నా పరము పదము శ్రీ ద్వారకగాం
స్వారాజ్యస్థుల యాదవు
లై రాజిల నవతరించు నచ్యుతుం దలంతున్.

ఉ॥ వేణువుమూది పుణ్యాలత-విస్తృతి సేసి సుదర్శనాగ్ని న
జ్ఞాన తమచ్ఛటా విదళనం బొనరించి చలజ్జగత్పరి
త్రాణ మొనర్చి శాస్త్రితనయ-ధర్మము తేలిన గోపబాలకుం
డౌ నవతారమూర్తి యభయం బిడి లోకములుద్ధరించుతన్.

శా॥ లోకాకర్షక దివ్యమోహన విపీ-లోద్ద్యోతకంబై మరు
త్కేకాస్తోక మయూరవార హృదయ-క్షేత్రంబునై రాక్షసా
నీకక్రూరమృగాళి హృద్వ్యథన గం-భీరార్భటీస్ఫీతమౌ
శ్రీకృష్ణాంబుదమార్యచాతకములు-త్సేకింప వర్షించుతన్.

ఉ॥ బాలకుఁడై త్రిలోకపరి-పాలకుఁడై మృదుగానలీల గీ
తాలహరీప్రసాదమున-దైత్య దురాగతము ల్హరించి మో
క్షాలయమిచ్చు పామరుల-జ్ఞానుల గౌతుకవార్ధిఁ దేల్చు గో
పాలుని సంస్మరించెద శు-భప్రతిపాదన నిర్వహింపఁగన్.

చ॥ సరసులు మూర్ఖులుం బసులుఁ-జండమృగంబులుఁ బన్నగంబులున్
దరులు శిలల్ ద్రవించి ప్రమ-దంబునఁ దాండవమాడ మాధురీ

భరిత జగద్వశీకరణ - వంశవినోదను సల్పినట్టి సుం
దర యదునందనుండు కృప - నాకృతి చేకొని యాదరించుతన్.

మ॥ గణనాతీత పరాక్రమోజ్జ్వలిత శా - ఖంబుల్ దయాస్కంధ భా
జనముల్ గీర్తిలతాలవాలమును సౌ - జన్య ప్రసూనంబు స
జ్జన సంఘాత విహంగ సంశ్రయమునై - సద్యఃఫలంబౌ జనా
ర్దన కల్పద్రుము నాశ్రయింతును గృతా - ర్థత్వ ప్రసాదార్థనై.

కృతిపతి వంశ వర్ణన

సీ॥ ఎందు విరాజిల్లె - బృందారకానీక
కాంక్షిత "యదు" కల్ప - కనుమముంబు
ఎందుద్భవించె లో - కేశ్వర మానవ
తోషక "వృష్టి" పీయూషధార
ఎందుజన్మించె న - హీనార్థ వర్ధమా
నార్థి సేవిత "శూర" - నాకసురభి
ఎందు వెలింగె దు - ష్కృత తమోహర యశ
స్ఫుర దివ్య "వసుదేవ" కౌస్తుభమణి

తే॥ గీ॥ అట్టి గాంభీర్య రంగదా - ఖ్యాత రంగ
తుంగ యదువంశ దుగ్ధ పా - థోధి యందుఁ
గలిగెఁ బరమహంస చకోర - కావనుంచు
కీర్తి చంద్రికా కరుఁడు శ్రీ - కృష్ణ విభుఁడు.

ఉ॥ గోపరిపాలకుండు బహు - గోపరిపాలన మాచరించి ధా
త్రీ పరిరక్షకుండు వసు - దేవ మునీశ్వర శిక్షకుండు ధా
త్రీ పరిరక్షితుండు వసు - దేవ మునీశ్వర శిక్షితుండునై
గోపకుఁడై కుమారుఁడయి - ఘోషను మాధురి శౌర్యవర్తిలెన్.

సీ॥ కటూసురాముల - జనిమినై ... మై
బంధము లూడ్చి ము - కుందుఁ డనుగ

నంద భృశంబున -నంద నందనుఁడయి
రూపిత నిజ విశ్వ-రూపుఁ డగుచు
నాగేంద్రుఁ ద్రొక్కి ప-న్నగ మర్దనుండయి
వాంఛితార్థము లిచ్చి -వరదుఁ డగుచు
రాధ సేవలఁ గొని -రాధికా లోలుఁడై
త్రిదశ స్తుతుల దేవ-దేవుఁ డగుచు

తే॥ గీ॥ నృత్య నిపుణతఁ బాండవ -కృష్ణుఁడగుచు
హస్తధరంబెత్తి నగధరా-ఖ్యాతుఁ డగుచుఁ
గ్రూరుఁ గంసు వధించి కంసారి యగుచుఁ
గృష్ణ పరమాత్మ శైశవ-క్రీడ సలిపె.

మ॥ నిజ సౌందర్య బలాతిమానుష గుణా-నీకంబు లాలించి భీ
ష్మజ వైదర్భి మనోజతాప వివశ-స్వాంతంబుతో నుండఁ జే
ది జనాధీశున కీయ సోదరుఁడు య-త్నింపన్ రిపువ్రాత ము
క్కజమందన్ దనుజారి చేకొనియె న-క్కన్యామణిన్ రుక్మిణిన్.

మ॥ స్తవనీయోర్జిత శక్తిఁ దాఁకి యపవా-దంబుల్ నివారించి యు
త్సవ సంతోష శుభప్రశాంతులిడి ప-శ్చాత్తాపముల్ గూర్చి యా
హవ దాసక్రియ రత్నశుల్కమునఁ గం-జాక్షుండు పెండ్లాడె జాం
బవతీ దేవిని సత్యభామ బలస-న్మానప్రకర్షార్థమై.

మ॥ మురముఖ్యాసురనాథుఁడౌ నరకుఁడు-న్మూలింప బుష్యాశ్రమా
ధ్వర ధర్మంబు లమర్షియై కినుక స-త్యాయుక్త దాశార్హుఁడ
త్తటి సంగ్రామ ధనుర్వియుక్త శితశ-స్త్రాస్త్ర స్ఫురత్కేళి సం
హారణ ప్రాప్తి మురారియై నరకదై-త్య ధ్వంసియై భాసిలెన్.

చ॥ అమరులు గామలోభవశు-లై వ్యసనంబులఁ జిక్కి నొక్కవ్యా
జమున దివంబుఁ జొచ్చి త్రిద-శాధిపు శక్తిఁ బరీక్షఁ జేసి గ
ర్వమునడఁగించి శ్రీహరి ధ-రాస్థలికిన్ గొని తెచ్చి పారిజా

తమును బ్రతిష్ఠఁజేసె విబు-ధ ప్రకరంబులు సంభ్రమింపఁగన్.

శా॥ సారథ్యంబు వహించి చక్రి మదమా-త్సర్యాంధ చేతస్కులౌ
కౌరవ్యాద్యసుర ప్రబోధితుల శి-క్షాపాత్రులంజేసి లో
కారాధ్య క్రమ శస్త్రశాస్త్ర పథ ర-క్షా దీక్షితుండై ధరా
భారంబెల్ల హరించె భారత రణ-వ్యాజంబునన్ లీలమై.

సీ॥ విజ్ఞానమయ వేద-వేదాంగ బోధక
విమల గీతా రహ-స్యము వచించె
విజయోద్ధవాక్రూర-భీష్మాది భక్తులఁ
గ్రీఁగంటఁ జూచి త-రింపఁ జేసె
ద్రౌపదీ నంద సాం-దీప కుచేలురఁ
గృప నభీష్టము లిచ్చి-తృప్తిపఱచె
నిటలాక్ష వాణీశ నిర్జరాధిపులఁ
బ్రకటిత శక్తి దిగ్భ్రమణముంచెఁ

తే॥గీ॥ బాణి సఖుఁడైన గర్వింపఁ-బరిభవించె
ససురుఁడైన "బాహి" యను రా-జ్యంబొసంగె
విక్రమిత లోక విస్ఫూర్తి-విష్ణుమూర్తి
ధర్మపథవర్తి కృష్ణావ-తారమూర్తి.

తే॥ గీ॥ అట్టి యదువంశవార్ధి సుధాకరునకు
విశ్వగణ్యాతిమానుష-వేషునకును
ధర్మరక్షక విష్ణ్వవ-తారునకును
అఘతమోహర కృష్ణ కం-జాప్తునకును.

కపివంశానుక్రమణిక.

తే॥ గీ॥ వ్యాస వాల్మీకి కాళిదా-సాది సుకవి
గ్రంథ సంస్తుతిఁ గన్న వై-ఖానసాఖ్య

వెలయు సిద్ధ వైష్ణవనామ విప్రశాఖ
గౌతమస గోత్రి దీవి విఖ్యాత కులము.

శా॥ అం దావిర్భవమందె ధీనుత నృసింహాచార్యసంజ్ఞుండు, పూ
ర్ణేందుం డంబుధిసంభవిల్లినటు పాండిత్యప్రసక్తిన్ మహో
గ్రగ్రంథాధ్యాపకతానురక్తిని గవిత్వాభ్యాస వైద్య ప్రశ
స్తిం దిగ్దేశ యశోంచితుండయి ధనాప్తిన్ శిష్యసంఘాగ్రస్థుఁడై.

తే॥ గీ॥ అతఁడు గాంచెను మువ్వురు సుతులనందు
వేంకటార్యుండు నాతండ్రి, చిన్నతండ్రి
వైద్యమణి హనుమాచార్యవర్యుఁడు, మత్క
నిష్ఠపిత శేషయాచార్య సితికరుఁడు.

తే॥ గీ॥ అందు వేంకటాచార్య విఖ్యాతుఁ డెలమి
భార్గవసగోత్రి సచ్ఛ్రీనివాస వంశ
వేంకటార్య భిషఙ్మణి ప్రియతనూజ
రంగమాంబను జేపట్టి రాణఁ జెందె.

మ॥ అకలంకోత్తమవృత్తి భర్తృహితసేవాసక్తి సౌజన్య సా
త్వికయుక్తిన్ హరిభక్తి బాంధవ హితాతిథ్యోక్తి సద్ధర్మబో
ధక శక్తిన్ సుగుణాప్తి లోకవిలసత్ప్రఖ్యాతి, నా రంగమాం
బిక పేరెన్నికఁ గాంచె నీతిమతి సాధ్వీ రత్నమై పూతయై.

తే॥ గీ॥ సుతల నేవుర నిర్వుర సుతులఁ బడసి
కలికి రంగాంబ యష్టమ గర్భ శుక్తిఁ
దాల్చి నను నవమాసము ల్దాఁటినంతఁ
పైతృక గృహంబునకుఁ జేరె భర్తృనాజ్ఞ.

ఆ॥ వె॥ పంచ శీర్ష భుజగుఁ బ్రత్యక్షముగఁ గాంచి
నాఁడ ప్రసవవేదనములు వొడమ
నాత్మ శ్రీశుఁ జేర్చి యాలయంబున కేఁగి

నన్నుఁ గన్న వెంట-నాక మేఁగె.

తే॥ గీ॥ నిమున మెదఁబాటు గాకుండ -నెమ్మి మాతు
లుండు శ్రీ వేంకటప్పలా-ర్యుండు లోకి
కుండుఁ దద్భార్య రాజాంబ -కోరి నన్నుఁ
బెనిచి మనిచిరి మాయమ్మ -పేరుపెట్టి.

చ॥ పితయుఁ గొలంది రోజులకె -వీడె నిహంబును, దల్లిదండ్రులై
స్తుతమతి వేంకటప్పయయ-శోధర రాజము నాకు సర్వ స
ద్గతులయి విశ్వలంగఁజపి-తద్దయు నాస్తి నొసంగి సత్కృపా
[illegible] గని రంతకంటె హను-మాంబ తదేక తనూజ శ్రద్ధమై
సుతునకు మించు కూర్మి ననుఁ జూచుట, సాఁకుట చోద్య మారయన్

తే॥ గీ॥ దైవకృపయున్న నొక్క దు-స్తరము కలదె
యష్ట వర్షంబులకు గవిత్వాభ్యసనము
ద్వాదశాబ్దంబులకు నవ-ధాన పటిమ
యెటుల బొసఁగెనో నేఁడు నా -కెఱుక పడదు.

మ॥ కవితాహేతువుఁ గూర్చి సాహితియు, రు-గ్వ్యాజంబునన్ సర్వ వై
ద్య విశేష ప్రతిభా విభూతి, లవవి-ద్యాప్రాప్తి గీర్వాణ హూ
ణ వచః పాండితి, సర్వశాస్త్రి లఘు వి-జ్ఞానాప్తియున్ దేవదే
వ వరానుగ్రహ శక్తిఁ గాక యితరో-పాయంబులం గూడునే.

సీ॥ వ్రాయించె నేశక్తి -గ్రంథరాజంబుల
బాల్యంబు నంద యశ్శకుని చేత
తెప్పించె నేశక్తి-దిగ్దేశ బిరుదముల్
యాదృచ్ఛికోక్తి నయాచితముగ
ఇప్పించె నేశక్తి-యీడిత పదవులఁ
బ్రఖ్యాత పండిత - పాళివిడిచి
ఎక్కించె నేశక్తి -పృథుల సభాపీఠ

తలఁ బ్రతిపక్షులు తల్లడిల్ల

తే॥ గీ॥ నిచ్చు నీశక్తి యనుదినం బీప్సితార్థ
రాశి దాన ధర్మాది కార్యములకొఱకు
నట్టి శ్రీపతి శక్తి నాకమరు కతన
వ్రాయఁ జాలితి నీ గ్రంథరాజ మేను.

శా॥ రంగాచార్య భిషగ్వరుండను, సుభద్రానాథుఁడ స్వ్యాపితో
త్తుంగఖ్యాతి దిగంతుఁడన్ సుకవి సందోహాబ్ధ పంచాస్యుఁడన్
రంగత్సత్కవిరాజ భృత్యుఁడను బ్రాణాచార్యుఁడన్ వైద్యశా
స్త్రాంగోపాంగ విమండ భేషజ కళాశాలాది కార్యక్షుఁడన్.

వ. అను నేఁ గృతి యొసంగంబూనిన శ్రీ కృష్ణాతిమానుష తత్త్వ
మహాగ్రంథరాజంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన

కథాప్రారంభము

చ॥ కలదుగదా మహా భరతఖండ పవిత్ర పురప్రధానమై
జ్వలిత దిగంత కీర్తిగుణ సాంద్ర యశః పరిపోష్యమాణమై
యలఘు సుఖప్రదాయక నిరంతర భోగనిధానమై విని
ర్మల లసమానమైన మధురాపురి యాదవ రాజధానియై.

సీ॥ ధర్మసోదరి నిరంతర ధర్మమూని తు
షార ముక్తాఫలాంజలు లొసంగఁ
బ్రాంతస్థిత ప్రవర్షణ భూధర శ్రేణులు
లలితపరాగ పుల్కాంబు లీయ
బృందారకావన బృందావనాసార
ధీర సమీర కిశోర మొలయఁ
గల్హార కమనీయ కమలా సరోవరా
శ్రిత విహంగము లలంకృతము సేయఁ

తే॥ గీ॥ దన మహాద్భుత సహజ సౌం-దర్య గరిమ
కలరి ప్రాకృత సఖులు దో-హద మొసంగ
శోభన కరంబు మాథుర -శూరసేన
రాష్ట్ర తిలకంబు మధురా పు-రంబు వెలయు.

ఉ॥ యాదవ రాజబాంధవ వి-యత్పరిచుంబిత దివ్య సద్య ప్రా
సాదము లొక్క చక్కి, సవి-శ్రుత వేద పురాణ శాస్త్ర ఘో
షాదులు నొక్క దిక్కు, ధన-దాభ వణిగ్వర భవ్య సౌధ హ
ర్మ్యాదులు నొక్క ప్రక్కఁ గల-వా మధురా నగరీ శిరోమణిన్.

క॥ అచటి కుశీలవ చాతురి
నచటి నటకపాళి మహిమ -నచ్చటి మల్ల
ప్రచయ ప్రావీణ్యము విని
యచటికిఁ బరదేశ రసికు -లరుదెంత్రు తమిన్.

ఆ॥ వె॥ రచ్చ గొట్టములును - రక్షణ శాలలు
నాయుధాలయములు -నర్థ నిధులు
భట నికేతనాది -పాలక భవనము
ల్దనరు నచటి రాజ-ధాని యందు.

సీ॥ శాస్త్రార్థులకుఁ బరి-షద్రంగములును భా
ష్యాసక్తులకును వే-దాంత సభలు
సంగీత రతులకు -సంగీత శాలలు
నాటక ప్రియులకు -నాటకములు
భోజన పరులకు- భోజన సదనమ్ము
లుత్సేకులకు సంత-తోత్సవములు
విషయ లాలసులకు - వేశ్యా గృహంబులు
వ్యసన లోలురకు ద్యూ-తాంగణములు
తే॥ గీ॥ నిఖిల గుణ లఘు మానిత -నీచ శస్త

హీన కామ్యంబులను గురియించు కలశ
శరధి భవ కామధేనువు చందమునను
రంజిలె ధరిత్రి నమ్మధురాపురంబు.

మ॥ కనకా నప్పురి (గేళికా భవనము - ల్గ్రంథాలయంబు ల్పు.రాం
గణము ల్కార్మని కేతనంబులును సం-భాశ్శాలలు న్విత్రద
ర్శన గేహాంబులు యుద్ధవాద్య గృహముల్ -సైన్యప్రదేశాళి.స్యం
దన మాతంగ తురంగ శాలలును.వి-ద్యా వైద్య ధామంబులున్.

సీ॥ తన గృహ పారిశు-ధ్యము లోపమోయని
నరి యిండ్లఁ బరికించు పురజనుండు
దనకంటె నధిక వి-ద్యావంతులో యని
పరుల (బరీక్షించు -పురనివాసి
తనవలె నారోగ్య-ధన మొందరో యని
నరుల నిరీక్షించు -నాగరికుఁడు
దన శుద్ధ వస్త్రి నూత్నత గోప్యమో (యని
శంకించి తెలవోవు - జానపదుఁడు.

తే॥ గీ॥ దనవిభూతి సందేహించు -ధనయుతుండు
దన యలంకార భూషణ -గణమునన్య
లభ్య మొనరింప యత్నించు -లాలసుండు
గలరు మధురలో నేపిట (గానరారు.

క॥ ప్రేమామృత వశ రమ్య
శ్యామా యువజన విహార -సంకుల చిత్రా
రామాలంకరణంబుల
నా మధుర యలభ్య సామ్య-మై తనరారున్.

వ॥ అందు.

సీ॥ పురబాహ్య వనమున-నొరులకు దుర్గమం

బై భట పాలిత-మై యయోమ
యంబయి భూరి గాఢాంధ కారాగార
భూబిల మయ భయో-ద్భూత ఘోర
మై కరపాశముల్ -యాతన శాలలు
వధ్య స్థలంబులు -బంధములును
ముకోణములు గల్గి -మొరయు "హాహా" ధ్వాన
భీభత్సమై వప్ర -వివృతమై యు
శోక పాదపావృతమై విశుద్ధ సలిల
పూరితానేక కూపమై భోజనాల
యాసన శయన కల్పితమై విశాల
జాలకో పేతమౌ చెఱసాలయందు.

ఉ॥ సంకటమౌ నగారమున -శస్త్రధరుల్ వెను వెంటసిల్వ నా
తంకముల స్మరించి యనుతాపము లోర్చిన సిద్ధలోక ర
క్షాంకుర దాతలౌ నదితి -కశ్యపులో యనఁ బొల్చి శోక
ద్రాంక ముఖేందులై కలరు -దంపతులిర్వురు కాలుబద్ధులై

తే॥ గీ॥ అట హిమావృత శశికళ -యటుల ధూళి
ధూసరిత రత్న రుచిలీల - ధూమ్ర పరివృ
తాగ్ని శిఖభాతి బోడిమిం-దఱిగి యున్న
కలికి గద్గద స్వరమునఁ -బలికె నిట్లు.

మ॥ నను జేపట్టిన లగ్నమెట్టిదియొ కాన్తా నిస్తులాగర్భ శో
భన సౌభాగ్య నితాంత భోగ పరితృప్త ప్రాభ వైశ్వర్య భా
జనులౌ మీరు దురంత దుస్సహ మన-స్సంతాప కాభీలయౌ
తన సంతప్తులు గా ఘటిల్లె విధికృ-త్యం బెవ్విధిన్ లంఘ్యమౌ

సీ॥ పరిణయోత్సవమున -బంధింపఁ బడుట దౌ
ర్భాగ్యకారాగృహ - ప్రాప్తిఁ గనుట

అరణంబులకు మాఱ్ఱుహరణంబు లమరుట
లంఘన దీక్ష కాలంబ మగుట
శంకణాలకు మాఱు సంకెల ల్గలుగుట
తోషణ మెల్ల వినాశ మగుట
ధర్మార్థ కామముల్ త్యాజ్యంబులై యుంట
పుత్రశోకం బనుభోజ్య మగుట

తే॥ గీ॥ కాయ మారోగ్య మెడలి రుగ్వ్యాధ నవయుట
మానసము తారుమారయి మఱుఁగు వడుట
ధైర్య మెడఁబాసి దుర్నిమిత్తములఁ గనుట
నా కతంబునఁ గలిగెఁగా? నాథ! మీకు?

తే॥ గీ॥ శూన్య వాక్కుల నమ్మి నా సోదరుండు
కంస హతకుండు స్వార్థ సౌఖ్యములఁ గోరి
బంధు మర్యాద లోకాప వాదములను
నెంచ కీరీతి గారఁ ద్రోయించె మనల.

మ॥ శమముం సామము రాజధర్మమును వంశౌన్నత్యముం స్నేహ భా
వము బంధుత్వము మంత్రసూక్తు లనుకంపం బూరుషార్థంబు లే
శము నా కంస నృశంసుఁ డెంచఁ డకటా! సారంగబాష్పాంబు వ
ర్షము వ్యాధోగ్ర ధను ర్విముక్త విశిఖవ్రాతాగ్నిఁ జల్లార్చునే!

వ॥ ఇట్లు కటకటం బడుచుఁ గన్నీరు మున్నీరుగా నేడ్చు నిల్లాలి నాశ్వాసించుచు ఆ పురుషుం డిట్లనియె.

తే॥ గీ॥ మన పురాకృత కర్మ ప్రేరణము వలన
గంసుఁ డుపకరణం బయ్యెఁ గాదె కర్మ
వశమునను బ్రవర్తిల్లు సర్వమ్ము కర్మ
దేహు లీ దేవకీవసుదేవు లతివ.

వ॥ ఇంతియ గాక,

మ॥ కన దుత్తుంగ తరంగ రంగ విలుఠ-త్కాలప్రవాహంబు క
ర్మ నిబద్ధాఖిల దేహధాతులకు దు-ర్వారంబు నే తత్ప్రవా
హ నిమగ్నాత్మక మీ జగద్వితతి కాం-తా జీవముల్గొన్ని ప్రా
క్తన పుణ్యాణు విశిష్ట పోతమున మో-క్ష ప్రాప్తి గాంచుం దుదిన్.

సీ॥ కాల నిర్దిష్టుఁడై -కాంతుఁడై బలితొల్లి
సమర రాజ్యంబెల్ల -నపహరించెఁ
గాల మహిమ హేమ-కశిపుఁ డాగమ ధర్మ
పరుల సంశోధించి -వ్యథల ముంచెఁ
గాల వశంబునఁ -గాముకుఁడై పంక్తి
కంఠుఁ డుర్విజఁ బట్టి కార నుంచెఁ
గాల దోషంబునఁ గార్తవీర్యుఁడు సాధు
ధన చౌర్య దుర్బుద్ధిఁ-గని నశించెఁ

తే॥ గీ॥ గాలనిర్ణయమునఁ గదా -కంస మాగ
ధాది నృప నృశంసులు రాజ-ధర్మమెడలి
యసుర ధర్మావలంబను -లైరి కాల
నియతి యనివార్య -మనుసరణీయ మబల!

మ॥ తలఁపన్ ధర్మ పథైకతత్పరుఁడు స్వా-ర్థత్యాగి భక్తుండు వి
హ్వలయాదృచ్ఛిక కర్మభోక్తయు వృథా హంకార దూరుండు ని
శ్చలుఁడై కుమ్మర పుర్వు చందమున సం-సారంబునన్ గాలక
ర్మల ముక్తుండగు రాహు కేతు విషవ-క్త్ర స్కందితార్క్ష్య క్రియన్.

మ॥ వర ఝంఝానిల నమ్రి శుష్క తృణ పున్నాతిన్ మృతింబొందఁ గొం
దరో శేషించిన దప్ప కెల్లరుఁ దమో-మగ్నాసుర క్రూర ము
ష్కర దౌర్మార్గ్య దురంత వేదనమునన్ -గర్మానుభావ్యంబుఁ గాం
తురు ప్రారబ్ధ విముక్తికై చటుల వాతోద్ధూత జంతు క్రియన్.

వ॥ కావునఁ బ్రకృత కాలంబునఁ గర్మబద్ధుల మగుమన మెల్లరము మన మ

నపారబ్ధ ఫలితంబు లీ యానుర చేష్టితుండగు కంసుని మూలమున ననుభ వింప వలసి వచ్చె. ఇట్టిదుష్టుల దురాగతంబుల వలన లోక మెట్టి వికృతి పరిణామావస్థలోనున్నది యో పరికించి చూచితి వా?

సీ॥ బ్రహ్మ నిష్ఠను మాని -పరవృత్తులకు దిగు
కుల హీన భూసురుల్ -గలరు నేడు
పాలిత క్షేమముల్ -పరికింపని విషయ
లాలసుల్ పాలకు -ల్గలరు నేడు
లోకహితంబు నా-లోచింప లేని య
క్రమపరుల్ వైశ్యులు -గలరు నేడు
స్వామి మర్యాదల -సరకు జేయని యహం
కారులు శూద్రులు గలరు నేడు

తే॥ గీ॥ స్ఖలితులగు బ్రహ్మచారులు -గలరు నేడు
కరుణలేని గృహస్థులు -గలరు నేడు
కపటులైన సన్న్యాసులు -గలరు నేడు
ధర్మచలిత మా ద్వాపరాంతమున నేడు.

చ॥ పితరుల పుత్రశోక పరి-పీడన క్షామము లీతిబాధ లా
శ్రితజన నిగ్రహంబు సుర -శిక్షణముల్ విషమైక వాంఛయుల్
జ్యోతి పురుషార్థ మర్థిజన -శోధన వేద విమర్శనాది దు
ష్కృతములు నేడు గాక మఱి-యే యుగమందున సంభవించెనో?

క॥ అనినన్ విని దేవకి నిజ
వినమిత ముఖ బింబ మెత్తి వినయోక్తుల మె
ల్లన దన పెనిమిటితో ని
ట్లనె నానందాశ్రుధార- లల్లన నొలుకన్.

తే॥ గీ॥ ధారుణిం బాపచయము లు-త్కటములైన
ధర్మ గో సాధు జన పరి-త్రాణమునకు

నాసురాధర్మ మహిత వి-నాశమునకు
నవతరింపఁడె చక్రి ద-యాళు వగుచు?
ఆ॥ వె॥ సర్వసాక్షి సర్వ-సముఁడు సర్వాత్ముండు
విశ్వకర్త సర్వ-వేది త్రాత
లోక నాయకుండు -లోక రక్షణకునై
యిపుడు మగుడి యవత-రింపఁడొక్కొ?
వ॥ ఇట్లా దేవకీ వసుదేవులు వితర్కించుకొనునంత నినుం డస్తాద్రి కరిగిన.
చ॥ త్వరిత నిశాట పాంథజన -తస్కర భాస్కర మోద ఖేద సం
కరములు సంచల న్మృగ సృ-గాల దివాంధ భుజంగరా డ్భయం
కరములు తాపమగ్న విట-కాండ ముదావహ దిక్స్వర_త్తిమోం
కురములు మొల్చె జీవ జడ-కూట వశీకరణాంక శంకమై.
మ॥ నవ సౌందర్య మనోహర ప్రకృతి క-న్యారత్న వైవాహికో
త్సవ సందర్భ వినిర్మితాద్భుత విశే-షాలంకృతానేక వ
స్తు విచిత్ర స్ఫుట మంటప స్థగిత వి-ద్యుద్దీప గోళాకృతిన్
ఛవి విభ్రాజిత ఋక్షమాలిక నభ-స్థానంబునన్ భాసిలెన్.
వ॥ అంత.
మ॥ విరహి విహంగ సంఘు పరి-వేధక తీవ్ర విష ప్రలిప్త వి
స్ఫుర దురు చంద్రికా శరస-ముత్కర బద్ధ దయావిహీన ని
ష్ఠుర హృదయ స్మరాజ్ఞ కప-టోగ్ర నిషాద కరస్థ ధన్వమై
వఱలెను ప్రాకృతీ వదన -భాగమునన్ శశి రేఖ పేర్మిమై.
మ॥ నిసిరా (?)బాంజలులై కపోల విగళ న్నేత్రాంబులై దేవకీ
వసుదేవుల్ నతశీర్షులై జిత మనో-వ్యాపారులై శుద్ధమా
నసులై గద్గద కంఠులై యచలులై నారాయణ ప్రార్థనా
వశులై రంతట రోమహర్షణులునై -బ్రహ్మాను సంధానులై.
తే॥ గీ॥ మౌన నిష్ఠను ధ్యాన ని-మగ్ను లగుచుఁ

జాల తడవుండి పిదప నున్మీలితాక్షు
లగుచు నా దంపతులు కొనియాడి రిట్టుల
నేకమై విశ్వ విశ్వంభరేశుఁ గూర్చి.

ఉ॥ ఓ నిగమాంతవేద్య ప్రణవోన్నత కారణ కారణాత్మ తే
జోనిలయా యనంత గుణశోభిత సర్వ చరాచరాత్మ అ
జ్ఞాన తమోహరా అఘవినాశనముఁ గనయ ధర్మ లోక సం
త్రాణము నార్తరక్షణ శ్రీపావన భారము నూని ప్రోవవే

క॥ అని పలుమారు జపించుచు
మననం బన యంబు సలిపి మైమఱచి సుషు
ప్తిని దేలిరి నిస్పృహులై
యనివార్యము ప్రకృతివేగ మభవున కైనన్.

వ॥ ఇట్లు తమోమయంబై సర్వజీవావశ్యకంబై, ప్రాణిపోషకంబై చైతన్య
స్థాపకంబై, పారిశ్రామిక దేహ రుజోన్మూలక దివ్యౌషధంబై, మేదోమయ
స్థూలక నిర్వ్యాయామ శారీరక రుగ్వ్యాపకంబై, దైహిక మల విషదోష వేగ
నిర్గత్యాపాదన పాటవంబై, కాయ దార్ఢ్యకరంబై, యారోగ్య వర్ధకం
బై, యామయ శమన కారణ సమర్థంబై, నిత్య ప్రళయ సాంకేతికంబై, శ
రీరేంద్రియ సత్త్వ పరిశ్రాంతికరంబై, నిమీలితేక్షణ ముద్రాంకంబై, వి
శ్వ విశ్వంభరా నాటక రంగ తిరస్కరణియై, ప్రకృతిబద్ధంబైన నిద్రావశం
బున నా రాజదంపతు లిరువురు సొమ్మసిలి నెమ్మోమ్ముల నుమ్మరమ్ముగాఁ జి
మ్ము చెమ్మటలు క్రొమ్ముత్తెమ్ముల సరులు నాఁ గ్రమ్ముకొన వగఁ దగు
లున జిగి పిగిలిన సొగసుం దనంపు బిగి బిగువులు నునుమొగముఁ దొగల ని
గ నిగ లుడుగ రేప్రిగ్గడ దిగ్గునఁ బన్నిన మొగ్గరమ్మున నెగ్గక తలలొగ్గి
మొగ్గిన దృగ్గమనంపు టగ్గలంబులు పెగ్గెలుతగ్గి సిగ్గుపడు తమ్మిమొగ్గల ని
గ్గు నుగ్గుసేయ, వాతెరల నుండి తోతెంచు శ్వేతకుందంబులయందంబు డిం
దుపరచు సుందరపుం దశనమాలికలు ధవళేందు బింబంబుల పోలికలై వం

దాను శంఖంబుల యేలికలై క్రోల నిస్పృహులై వివశులై గాఢ నిద్రా
ముద్రాంక భద్రులై యున్నతరి.

మ॥ పొడగానన్ గడలేనివాఁడు నగుమోమున్ వాల్గనుల్ పాలురా
ల్చుబడి గల్లంబులవాఁడు నల్లనసుమై ఁ జొల్పారు వాఁ డెల్లపో
కడల న్మద్దులఁ జిల్కువాఁడు పటుఁ డొక్కం డాదట న్నిల్చి క
న్పడి మేల్కొల్పిన రీతిమై గనిరి స్వప్నం బేకకాలంబునన్.

క॥ ఇట్టులఁ గలలో నన్ గ
న్పట్టిన శిశువంపుఁ బొట్టి నట్టువు వారిన్
దట్టి పిలిచి తా నిట్టుల
నెట్టున గుట్టుగ వచించె నిట్టూర్పు మెయిన్.

మ॥ తలిదండ్రు ల్దొలిబామునన్ మగిడి ద్వైత్యధ్వంస ధర్మప్రతి
ష్ఠలఁ గావింపఁగ మీకు నే సుతుఁడనై జన్మింప నున్నాఁడఁ జిం
తల రక్షాంశయుఁ జింత సేయకుడు కర్మప్రాప్తియుం దేర మీ
వలవంతల్ నలుసంతలై తలఁగిపోవా! గాలిలోఁ బింజలై.

ఉ॥ పూర్వ కృతానుభావమును బొంది గతించిరి మున్ను గన్న యా
యార్వురు సప్తముండు సుఖరైమ మను గోకులమందు రోహిణీ
పూర్వ తనూజుఁడై మహిత భోగి మహాంశమునన్ జనించి మ
న్నిర్వహణీయ లీలలను నిర్ణయ కార్య భరంబుఁ బూనఁగన్.

ఉ॥ నే నుదయించి నంతట జనించును గోకుల మందు మాయ, మా
యా నిబిడాంధకార వివశావరణంబున నుందు రెల్లరున్
గాన భయంబుఁదక్కి నను నంపగృహంబును జేర్పగాఁవలెన్
బైని ఘటిల్లు కార్య గమనంబుఁ గనుండు నివృత్తచిత్తులై.

క॥ ఇలు జటుపోటి వడి నొడువుల
పటువట బటువుగను నుడివి పటు కపటమునన్
జటుకున నట మట వడఁగా

మటుమాయెం బాయె నకట! మాయా నటుఁడై.

తే॥ గీ॥ అపుడె దేదీప్యమాన ది-వ్యప్రభా వి
కసిత తేజంబు దేవకీ -గర్భ మందుఁ
జొచ్చినటు వసుదేవుండు -చూచి తుళ్ళి
పడుచు మేల్కాంచి నిదురించు -పడఁతి నంత.

తే॥ గీ॥ అటుల మేల్కొల్పి స్వప్నము -నందు నిరువు
రొక్క విషయమే కనుటచే -నక్కజంబు
చెంది యది దైవకృతమని -చింత చేసి
ధ్యాన నిష్ఠఁ దేలిరి కొంత -తడవు వారు.

వ॥ ఆనాఁటంగోలె.

సీ॥ ఖద్యోత మండలా-ఖర్వ గర్వాపహా
శ్రీ విభాసిత దుర్ని-రీక్ష్య శోభ
శరదిందు కర తిర-స్కార్యాతి దివ్య మో
హన సర్వ దిక్తట -వ్యాప్త రుచులు
పల్లవితోర్వీజ -ఫుల్ల నీరజ కాండ
పాలనా లోలోప -లాలసములు
నాస్తిక వాద వి-నాశక ప్రత్యక్ష
రూపిత విస్ఫుట -రూప రేఖ

ఆ॥ వె॥ అగుచు మోముఁ గనులు -హస్తముల్ మధ్యంబు
దైత్య దివ్య భూత -తతి వితండ
వాదులకు భయాను- మోద సౌఖ్యార్తులఁ
బెనిచె నింతి గర్భ-మును ధరించి.

వ॥ అంత.

చ॥ కలఁతలఁ గాలముఁగా గడపు -కంస నృశంసుని పాల గూఢ చా
రులు సకలాపచారులు ని-రూపిత దీపిత గర్భ లక్షణం

బుల రిపు రూక్షణంబులను -మోక్షణ శిక్షణ కారణంబులన్
వెల వెలవోవు మోముల ని-వేదన సల్పిరి వేదనాత్ములై.

ఉ॥ అష్టమ గర్భ సంజనితు-డైన కుమారుడు మాకకుండగున్
స్పష్టమటంచు విన్నడిన -వాక్కుల సంస్మరణంబు చేసి యా
కష్ట చరిత్రుడౌ కుటిల -కంసుడు నిర్వేఱబొంది క్రుద్ధుడై
చేష్టల దక్కి మాన్పడియె -జేతము కొందలమంది కుందగన్.

క॥ ఈగతి నుండి నిమేషము
వేగుల వారలను బనిచి -వేసరిలి రహ
స్యాగారంబున కేగి మ
నోగతమున్ దలచె నిటు మ-నోవ్యధ పొదలన్.

మ॥ అశరీర ధ్వని విశ్వసించితిని పో -ఆ వేళనే దేవకీ
వసుదేవ ద్వితయంబు ద్రుంప కనుకంపన్ బొందగా నేల? తా
పసియౌ నారదవాక్యముల్ వినియు స-ద్భావుండ గా నేల? దు
ర్యశమున్ వాదులకోడి యేల య లా -హాత్యోద్యమం బాపితిన్.

చ॥ కలిగెను దుర్నిమిత్తములు -గాసి సహించి మనం బదెంత యో
కలగెను తాపము ల్చెలగె గష్టసశంబున స్థైర్య ధైర్యముల్
దలగెను దేహము స్రలిగె- దారుణ దుర్వ్యధి చాల గ్రుద్ధుడై
యలిగెను "దిక్కు నాకుగలదా" యను "దుస్మృతి తప్పదా!"యనన్

తే॥ గీ॥ తక్షణ ముపేక్ష మాని పా-లాక్షు నేని
శిక్షితుంజేసి యెదిరి -దాక్షిణ్య మేది
గర్భవతి భూమి గర్భాన -దుర్భరంపు
టర్భకుల దిక్కునకు బుత్తు- నిర్భయముగ.

క॥ అని సంభ్రమమున లేచి వ
దన కమలము జేవురింప -దశన రవంబుల్
మిను ముట్టగ కృపాణము జే

కొనియును మాయా వశమున (-గ్రోధము మానె.
తే॥ గీ॥ ఇట్లు క్రోధంబు నడిగి భా-షించె మఱల
గనికరించియు (దిరిగి వ్యా-ఘాత మేల?
మాట (జెల్లించికొనిరి దం-పతులు నేన
కల్లరీడన్న పెను నప-ఖ్యాతి (గనుదు-
క॥ మిన్నక యున్నను నిట్లని
క్రన్నన నవమానములును - గడచి చనియె నా
తెన్నుఁ దెలిసికొని కంసుఁడు
గన్నుల వత్తులఁ దగిల్చి - కాచుచునుండె.
ఉ॥ శ్రీణమాన కృష్ణదిన - సంతతి నష్టమినాఁడు రోహిణీ
బావనమౌ ముహూర్తమున - భవ్య శుభ గ్రహరాశియందు నా
దేవకి కారయందు వసు-దేవ సహాయమున న్సుఖంబుగాఁ
నే వలవంత లేక ప్రస-వించె జగద్ధిత మాచరింపఁగన్.
తే॥ గీ॥ అప్పుడు విద్యోతమాన సే-వ్య పరిపూజ్య
నవ్య తేజంబు పొడఁగట్టె - దివ్య మృదుల
మాధురీ సూక్తములను సం-బోధనంబుఁ
జేసి విస్పష్టముగను భా-షించె నిట్లు.
సీ॥ కల్పాంతమందు నొ-క్కఁడె పాల మున్నీట
శయనించు వటపత్ర - శాయి యితఁడె
ఏ యోగమున నైన -నెఱుఁగఁ జాలని యాది
భోగి శయానుఁడౌ -యోగి యితఁడె
అల త్రిలోకముల మా-యా వ్యాప్తిఁ దేల్చి మా
యాతీతుఁ డగు పరమాత్మ యితఁడె
కర్మ బంధంబుల (-గల్పించి బంధ వి
ముక్తుఁడౌ శ్రీవిష్ణు- మూర్తి యితఁడె.

తే॥ గీ॥ భూరి భువన నాటక సూత్ర-ధారి యితఁడె
కడ మొదలు మధ్య లేని సా-కారుఁ డితఁడె
పుట్టు వెఱుఁగని గానముల-ప్రోవితండె
కంటి రీతనిఁ బున్నెంపుఁ-గతన మీరు.

క॥ ఈ పసి పాపని నేఁడే
ప్రేపల్లెకుఁ జేర్చవలయు-భీతిల్లక యే
యాపదలు పొందవ నేదవు
కాపాడు నితండె మిమ్ముఁ గను తెప్పవలెన్.

వ॥ తదనంతరంబు.

క॥ మాటలు వెలుఁగును సాఁగెఁ గ
వాటపు బంధములు విఱిగి-పడె భట చయము
గాటపు నిద్దురఁ జెందిరి
యాటంకము లేమి లేమి-కలదిరి వారల్.

తే॥ గీ॥ దేవకీదేవి ప్రణుతోప-దేశమునను
జింతిలక వసుదేవుండు-శిశువు నెత్తి
భుజము పయి నుంచుకొని యాత్మ-భుజగ శేషుఁ
దలఁచి ద్వారము దరియించి-తరలసాఁగె.

తే॥ గీ॥ అసుర మాయా వినిర్మిత-మగుచుఁ గంస
కల్పితమ్ముఁ బ్రసవ సూచ-కమ్ము నైన
గార్దభము రోదనముఁ జేయఁ-గంఠ మెత్త
నత శిరస్కుఁడై ప్రణమిల్లె-నతఁడు భక్తి.

చ॥ కనికరమూని గార్దభము-కంఠము డించెను గ్రూరసత్త్వమై
నను గృపఁబూని ప్రోచెడి న-నాథులు సాధులు నాశ్రయింప దు
ర్దిన చలితాత్ముఁడౌచు వసు-దేవుని యంతటి వాఁడు కార్య సా
ధన మునకై ఖరంబునకు-దాసుఁడుగాడె పురాకృతంబునన్.

ఉ॥ అంతట మాయ గోకులము-నందున నందునకున్ యశోదయున్
కాంతకు నుద్భవిల్లిన న-ఖండ తమోవయమై చెలంగె నా
శాంతములెల్ల దేవకియు-నా వసుదేవుడు దక్క నెల్లరున్
భ్రాంత మనస్కులై తెలివి బాసిరి గాఢ సుషుప్తిఁ దేలుచున్.

క॥ అప్పుడు వసుదేవుఁడు కా
ల్చెప్పుడు గాకుండ శిశువు -నందిటఁ గొనుచున్
దెప్పున వీధులఁ గడచుచు
నప్పుల దొరసాని యైన -యమునకుఁ జేరెన్.

శా॥ కాలాంభః పరిపూర్ణ భీషణ చల-ద్గంభీర కల్లోల మా
లా లోల ప్రతిరావ సంచర దభం-గా భీల సంక్షోభిత
వ్యాళ గ్రాహ కరాళ మీన కమఠా-వర్త హ్రదో దగ్ర మా
కాళిందీ నది దాఁటు ధీరులకు లక్ష్యంబే ప్రతిష్టంభముల్?

తే॥ గీ॥ దైవ కృపయున్న నొండు దు-స్తరము గలదె
యిచ్చు దాత ప్రియుండైన -నెచట నున్న
నేమి? కాళింది, దాఁటుట - యెంత? దేవ
దేవుఁడే సాయపడ వసు-దేవునకును.

ఉ॥ ఎట్టుల గోకులంబునకు -నేఁగెనొ నందు గృహంబు నందునన్
బుట్టిన బాల నెత్తికొని -పుట్టు వెఱుంగని పాప నచ్చటన్
బెట్టి నదిం దరించి పుర-వీధుల దాఁటి నివేశ మెట్టులన్
గుట్టుగఁ జేరెనో తనకె-గూఢముగా వసుదేవుఁ డాత్మలోన్.

చ॥ ఇది పరమేశ్వర ప్రథిత -కృత్యము యిట్టి విచిత్ర కల్పనం
బెదియును సంఘటిల్లెనె? మ-హెచ్చట నెవ్వరి కెన్నఁడేని న
భ్యుదయ పరంపర ల్గలుగుఁ-బో! జగతిన్ గలుషాంధకారముల్
సెదరి వికావిక ల్గని న-శించు శిశూదయ భాస్కర ద్యుతిన్.

క॥ ఎంచుచిటు ప్రయాణమున గ

తెంచిన విషయమ్ములెల్ల - దేవకికిఁ వి
న్పించుచు హరి లీలల ధ్యా
నించుచు బాష్పముల (గనుల -నించుచు నుండెఁ.

సీ॥ తెక్కలు విదళించి - 'కొక్కురో కూ' యను
 కుక్కుటంబులు లేచి - కూవ్వ లెక్కఁ
జొక్కి మేల్కొని మెక్క నెక్కొను పక్కుల
 "కుహూ కుహూ ధ్వనులు" ది-క్కులను జెక్కఁ
బిక్కటిల్లి చరించు -నక్కటికము లేని
 ముక్కడి దొంగల -చిక్కు చిక్కఁ
(గక్కదలియు నక్కి -వ్రక్కలై తక్కు స
 క్కజమగు బక్క చీఁ-కటులు సొక్క.

తే॥ గీ॥ రక్కసులు సొక్కి కూర్కు నేర్పడిన లెక్క
 రిక్క గమి లోన (జక్కనై -నిక్కు చుక్క
 య క్కమలజాప్తు మిక్కిలి -యమఁగు టక్క
 వినఁ దెరవు నెక్కఁ (గుడి(పక్క -వేఁగుఁ జుక్క.

క॥ భగవత్సంకల్పితమయి
 దిగంత విస్తరిత నిబిడ - తిమిరంబు క్రమం
 బుగను దిరోహితమై చన
 మగుడి యథావిధి జగంబు -మసలెఁ దెలివిమై.

క॥ ఈండ్రించె ఖరంబంతటఁ
 గాండ్రించుచు మేలుకొనిరి- కావలి వారల్
 దీండ్రించి లేచెఁ గంసుడు
 గోండ్రించిరి భటులు క్రోధ- ఘూర్ణితు లగుచుఁ.

శా॥ కంసుండంతట లేచి త్రుళ్ళిపడి శో-కాశ్చర్య దుర్భీత్యవ
 భ్రింశా లోల విషణ్ణ చిత్తుఁడయి కో-పాటోప సంరంభుఁడై

హాసన శ్రీకర దీప్త ఖడ్గ విలసద్ధస్తాంకునై బాలవి
ద్వేషోద్యుక్త నియుక్తుఁడై నదప్రభీభత్సాద్భుతీ యుక్తుఁడై.

చ॥ హయములఁ బూన్చి సూతుఁడొక స్యందనముం గొని తేర యోధ సం
చయములు మల్లులున్ భటులు మాగధులున్ వెనుకట్టి రా నహో
మయ భయ సంభ్రమంబునను మార్గచయు ల్పథముం దొలంగ న
వ్యయ భయ శోక కోప మతినై చెఱసాల నతండు సేరుచోన్.

ఉ॥ కావలి వార లుల్కిపడి కైమొడుపుల్ ఘటియింప దేవకీ
దేవి మొగంబుఁ ద్రిప్ప వసుదేవుఁడు మోము వాల్చి నిల్వఁగా
బావను మంచు నేడ్వఁ బసిబాప రథమ్మును డిగ్గి సేవకుల్
త్రోవను జూప వచ్చె సముదీర్ఘత ఘట్టిత ఘట్టనంబులన్.

తే॥ గీ॥ వచ్చి యిట్టు లేడ్చు పసిపాపఁ జూచి యయ్యొ
చావు దగులకు నమ్ముతెం బంది గగన
వాణి స్పృహాపురాఁ దికమన నుడుచు నుండ
దేవకి సహోదరుఁడు జూచి తెంపుఁ జేసి.

క॥ బిడ్డ నతని పాదంబుల
నొడ్డి ప్రణామంబుఁ జేసి యోపికతో నా
బిడ్డ నొసఁగి నిజ కరముల
నడ్డముగాఁ బట్టి యిట్టు లనెఁ గనుసైగన్.

శా॥ అన్నా? శూన్యరవంబె సత్యమని ప్రాణాపాయ భీతుండవై
నన్నున్ నీ మురిపెంపుఁ జెల్లెలని సన్మాన్యంపు నీ బావ నా
న్నన్నో యెగ్గుల కొగ్గఁ జేసియును నీ నెయ్యంపు మేనల్లురన్
గన్నుల్విప్పని కూసల న్నెడప నీ కారుణ్య మేమాయెనో.

ఉ॥ అష్టమ గర్భ సంజనితుఁ డైన కుమారుఁడు మారకుండనన్
స్పష్ట మటంచుఁ జెప్పఁగద! బాలుఁడు గాఁడిది బాల కానియా
దుష్ట వచస్స్మృతి న్విడిచి దోస మెఱుంగని మమ్ముఁ బ్రోచి యా

యష్టమ బాలునైన విడుమా వినుమా యనుమాన మేటికిన్.

క॥ శిశువధయే యెంతో కి
ల్బిష మందురె యందు నాఁడు బిడ్డ నుఁగూ యీ
శిశువు వధించినచో స్త్రీ
శిశు హత్యా కిల్బిషములు చేకుఱు నీకున్.

ఉ॥ క్రిందను మీఁదు దైవము నెఱింగి యొసర్చిన కార్యసర్గమే
యందముఁ జంపమై తేసర నార్యులు మెత్తురు రిత్తిమాటకై
నందియ మంది చిత్తమున సంకటముం శ్రమఁ గాయకష్టముం
నందను బొందితన్న! కరణీయ పథంబును ద్రొక్క మొక్కెదన్.

క॥ కలికి యిటుపలుకు పలుకులు
పలుకులుగాఁ దలఁచి తలఁకి పులుకు పులుకునన్
విలపించిరి జలమున సం
చల దరుణాశ్రుల స్ఫులింగ జాలము రాలన్.

శా॥ "ఏమేమీ! గగన ధ్వని త్రిదశ మాసింద్రోక్తులే కల్లలా?
మీ మోసంపుఁ గుయుక్తులే నిజములా? మీ మీ యసుల్ తీపి యెం
తో మాకంతియకా!" యటం చతఁడు కోపోన్మత్తుఁడై దేవకీ
భామం ద్రోయుచు బాల లాఁగికొని క్రుంపం గాలితోఁ దన్నినన్.

క॥ ఎగసి యదృశ్యంబై శిశు
వెగసి చనుచు దుర్నిరీక్ష్య పృథు తేజంబై
యగపడి యుదియుఁ దిశోహిత
మగుచున్ భాషించె నిటుల నందఱు వినఁగన్.

తే॥ గీ॥ "బాల ఘాతుక! కంస! నీ పాప సస్య
ములు ఫలించెను నిన్ను నిర్చెలు దుర్మ
దాంధుల వధింప నాతోడ నవతరించి
పెరుగుచున్నాఁడు హరి మృతి స్థిరము నీకు".

క॥ ఆ నాఁడుఁ గఱచుకొని సి
గ్గున శీర్షము నొగ్గి మోము- గోము విడిచి వె
ల్లనగాఁ గంపంబున స్యం
దనము నధిష్ఠించి వెడలె- దహాతహా పడుచున్.

ఉ॥ ఈ విపరీత నవ్యతర- దృశ్యము దైవ కృతంబు, దైవమా
యా వివృతంబు; తప్పద-సురాంత మఘాంతము దుర్మదాంతమున్
దేవకి పూజ్యురాలు పసుదేవుఁడు దేవుఁడటన్న వార్త స
ర్వావని వ్యాప్తిఁ జెంద ముద-మందిరి లోకులు ముక్తభీతులై.

ఉ॥ అచ్చట నందునింటి ప్రస-వాలయ మందు యశోద సెజ్జపై
నచ్చతురాస్య, వాసవ భ-వాది, నమస్కృత దివ్య మంగళో
ద్యచ్చరణారవిందుఁ డొక- యర్భకుఁడై పవళించి కన్నులన్
విచ్చుచుఁ గెవ్వుమంచుఁ బల-వించె నయాగము పల్లవింపఁగన్.

శా॥ చండాంశూత్కర కాండ దీధితులు ది-గ్జాలంబులన్ బర్వఁ బ్రో
ద్దండ స్యందన బద్ధ సప్త హయ వి-స్తార ప్రభా రాశి బ్ర
హ్మాండంబు న్వెలిఁగింప, సూత నర ని-ష్ఠాత్మత్వ మేపార మా
ర్తండోర్వీపతి ప్రాగ్దిశన్ బొడిచె నం-ధారాతి జైత్రార్థమై.

క॥ ఆ బాలుఁడేడ్చె నంతట
నా బాలప్రౌఢ మెల్ల- నావృత మాయన్
వేఁ బాసి మేల్కొని యశో
దా బాలుని సెజ్జఁ జూచి- త్వరితాత్మకురాలై.

ఉ॥ దాదులఁ బిల్చి, సేచన వి-ధానము, మంత్రము, నాభి నాళికా
చ్ఛేదము, స్నాన పానములు- స్నేహవిధిన్ కనకాది లేహ గ
ర్భోదక వామన క్రియలుఁ- బుణ్యావచోదిత జాత కర్మమున్
వేద విధిప్రయుక్తి నెఱ-వేర్చిరి బాలు చిరాయురాప్తికై.

ఉ॥ నంద యశోద భాగ్యమున- నందనుఁడొక్కఁ డదృష్ట జాతకుం

డందము చందముం గల మ-హా పురుషాంచిత లక్షణుండు గ
ల్గెం దమిమీఱఁ జూతమిఁక- లెండని కేకల వేసికొంచు నా
నందముతోడ గోకులము- నం గలయెల్ల రొకళ్ళొకళ్ళతోఁ.

క॥ చెప్పుకొను చాటలాడుచు
రొప్పుకొనుచుఁ బర్వులెత్తి - రోఁజుచు శ్రమచేఁ
జప్పటలఁ జరచు చేఁగిరి
ముప్పిరిఁగొను సంభ్రమమును- మోదముఁ జెలఁగన్.

శా॥ ఆలోఁ గాంచిరి నీల నీరద వర-శ్యామున్ బ్రభాభాసుర
శ్రీ లావణ్య మనోభిరాము, నత గౌరీ నాధ సుత్రాము, శో
భాలంకార కళా లలాముఁ, దత శుం-భల్లక్షణస్తోము, ని
త్యాలోలాఖిల లోక ధాముని యశో-దానంద కృతోత్సమునిన్.

వ॥ కని యందు.

సీ॥ లావణ్య లక్ష్మీ వి-లాస లాలితుఁడౌట
మాధవుఁడనుట స-మ్మతము గాదె?
మత్తారి దైత్య స-మాకర్షకుండౌట
శ్రీ కృష్ణుఁడన సము-చితము గాదె?
శోభాయమాన తే-జో మానితుండౌటఁ
బ్రద్యుమ్న చిహ్న మ-ర్హంబు గాదె?
ఆనంద పూర్ణ క-టాక్ష వీక్షణుఁడౌటఁ
గంజాక్షుఁడనుట యు-క్తంబు గాదె?

తే॥ గీ॥ గోకుల పయోధి చంద్రుఁడై - కొమరు మిగులు
కతన గోపాలకాఖ్య యో-గ్యంబు గాదె?
యనుచు వృద్ధులు బాలకుఁ - గని వచింప
వినుచు గోపకు లాడిరి - తనివి దీర.

క॥ ఆలకుఁ గ్రేపుల వదలుచుఁ

బాలకుఁ బాలనము మాని- పరవశులై గో
పాలురు పండువుఁ జేసిరి
బాలకు జననంబువలని - పరమ ప్రీతిన్.

వ॥ అప్పుడు.

సీ॥ కనుల కఱవు దీఱ - ఘన జగన్మోహన
సుందరాకారునిఁ - జూతువింకఁ
జెవుల త్రుప్పుడు వోవ - నవ మృదు మధుర ని
స్వనజాల మేవేళ - వినెద వింకఁ
బులకాంకురిత దివ్య - పూరుషానవరత
క్రీడా సుఖంబులఁ - గెరలు దింకఁ
బ్రతిదినాహూత ని-రంతర శ్రీ రంజ
కోత్సవ మగ్నవై - యుందు వింక

తే. గీ॥ నని యుపశ్రుతు లీరీతి - నాడికొనుచు
గోకులమ్మున గోపికా - కుల మమంద
హర్ష సాగర డోలిక - లందుఁ దేలి
తేరి యోలలనాడె న-వ్వేళ లీల.

ఉ॥ అంతకుఁ బూర్వమే ఖల నృ-పాధము కంసుని యందు ద్రోహమున్
జింతనఁ జేసి పెన్వెఱపు-చే వసుదేవుని భార్య రోహిణీ
కాంత యశోద బాల్యసఖి- కంసు పురంబును వీడి యెట్లొ యు
ధ్వాంతర బాధ లోర్చి నిర-పాయముగాఁ జని చేరె ఘోషలోన్.

తే॥ గీ॥ గోకులముఁ జేరి యిటు లోక- గోపకుండు
నంద మందిరమునుఁ జూప- నందుఁ జొచ్చి
పూర్వ సఖి యశోదఁ గని క-వుంగలించి
సర్వ వృత్తాంత మామెకుఁ - జాటి పలికె.

క॥ కనికరము దనుకఁగా గ

ర్భిణియగు రోహిణీ చరిత్ర - ప్రియుఁడగు నా నం
దునకు వచించి యశోద య
తని యనుమతి భగినిభంగి - దయఁ గనుచుండెన్ ।

క॥ ఒక శుభ దినమున రోహిణి
ప్రకటిత వేదనము నొంది - ప్రసవించెను బా
లకు, మానవ రూపక జా
లకు, శ్రిత పాలకు, సురారి - లయ మూలకునిన్.

తే॥ గీ॥ జన్మ కాలమునన బల-శాలి యగుచుఁ
ప్రేక్షక మనోభిరాముఁడై - వెలయు కతన
నతని బలరాముఁడంచును - సార్థక మగు
నామధేయం బొనర్చి రా-నందమునను.

తే॥ గీ॥ కృష్ణ జననంబు నాఁటికి - రెండు వత్స
రముల ప్రాయమ యీ బల-రామునకును
రోహిణీ యశోదలు కుమా-రులఁ బెంచిరి
సోదరుల లీల వారలఁ- జూచికొనుచు.

మాధవీవృత్తము. యదు వంశ పయో-ధ్యమృతాంశు మణీ
మద దైత్య తమో-న్మథన ద్యుమణీ
మృదు గీత వచో-మృత నిర్ఝరిణీ
సదృశాకృగ భా-స్వర కృష్ణ మణీ.

గద్యము.

ఇది శ్రీమదిందిరా నాథ ప్రసాద లబ్ధ సమాజ కవితా విరాజమాన శ్రీమద్గౌతమస
గోత్ర దివి వంశోద్భవ నరసింహాచార్య పౌత్ర వేంకటాచార్య
రంగమాంబికా తనూజ రంగాచార్య ప్రణీత శ్రీ
కృష్ణాతిమానుషతత్త్వ ప్రథమఖం
డాంతర్గత ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీరస్తు

శ్రీకృష్ణపరమాత్మనే నమః.

# శ్రీకృష్ణాతిమానుషతత్త్వము.



## ద్వితీయాశ్వాసము.

క॥ వేదాధ్వ విహార! హరేం
ద్రాది సుర శ్రిత పదాబ్జ! - యబ్జాక్ష! క్షమా
నాథ మకుట రంజిత శుభ
పాదయుగళ! గళితగాన - పన రస భరితా.

వ॥ అవధరింపుము.

చ॥ మధురను గంసుఁడంతట న-మాత్యుల నెయ్యురఁ బిల్వనంపి యే
ధమునఁ దన్నుఁ జంపఁ బ్రభ-వించిన బాలకు గుత్తెఱింగి యు
న్మథన మొనర్పఁగాఁ దగునొ - మారకు మారణ కర్మఁ దీక్ష నే
విధి కరణీయమో తెలియ- వేడుకఁ గూటమి నొందఁ గూర్చినన్.

తే॥ గీ॥ అందుఁ జర్చించి యెన్నొ ము-ఖ్యాంశములను
దుదకు వాడ వాడలఁ గల - దుగ్ధ కంతు
లకు విష స్తన్యము నొసంగి - లాలనమునఁ
జంపుటకు నిర్ణయంబుల - సలుపుకొనిరి.

క॥ నియమించిరి యందులకై
భయంకర దయావిహీన - పటుచేతన, ని
ర్ణయ విధ సాధిత యాతన,
నయ మార్గ విదూర పూత-నన్ శిశు హంత్రిన్.

ఉ॥ అచ్చట నంద గోకులము- నందున నందుఁడు పిల్వనంపఁగా

వచ్చి శుభోత్తరముల్ జనన- వాసర లగ్న ముహూర్త చక్రముల్
వ్రచ్చురఁ జూచి జాతకము- వ్రాసి త్రిశుద్ధిగఁ గృష్ణుఁడన్న పే
రచ్చుపడంగ నేర్పరచి- రార్యులు మెచ్చఁగ సార్థకంబుగాన్.

కం॥ బాలుఁడు జననంబందిన
దే లగ్నమొ కాని నంద- గృహ గోకులముల్
పాలాయములై పంటల
శ్రీలన్, సంపదల, నాల- జెలఁగెఁ గ్రమముగన్.

తే॥ గీ॥ అరయు క్షేమ వృత్తాంతంబు - నంధుఁడైన
వచ్చి పరికించి నగి చను - బధిరుఁడైనఁ
బని చెడిన వాఁడు కలనైనఁ- గనును దినము
బాలుఁ; దదితర విషయముల్ - వ్రాయనేల.

సీ॥ కనుఁ గూర్కినంత జ- గజ్జాల మున్నట్టి
కూర్కునో యని యెంచి - కొందలపడు
నగవు వెన్నెల మోముఁ - దోఁగ చిల్క భువనముల్
చిగిరించునో యని - చెలఁగి మురియుఁ
గలఁగుచుఁ బలవింపఁ- బ్రళయ కాలాభీల
గర్జనంబో యని- కంప మొందుఁ
గరలాక్షు దృగ్గుచుల్ - విరిసినంత నె లోక
మోహనంబో యని- మురువు నెందు

తే॥ గీ॥ అనవరత బాల పరిచర్య- లను నిమగ్న
యగుచు ననిమేష సంగతి- నను దినాభి
వర్ధ నార్భకు సంరక్ష- ణార్థ మొడలు
మఱచిన యశోద ప్రేమాభి- మాన పరత.

ఉ॥ పెన్నిధిఁ గన్న పేదవలెఁ - బ్రీతి వహించి ముదంబు పూరముల్
కన్నుల నించి బాలక వి- లాస వినోదములే తలంచి ని

ద్రాన్నము లైన మాని శిశు - రక్షణ భారమునే సహించి యే
యన్నముఁ బున్నె మున్నెఱిఁచి - యర్భకు నెంచుచు నందుఁడుండఁగాన్
క॥ వచ్చిరి కంసుని భృత్యులు
చెచ్చెరఁ గప్పములు మధురఁ- జేర్పఁగ ముదలన్
దెచ్చిరి నృపు పంపున వా
కొచ్చిరి రమ్మనుచుఁ గొలువు- కూటమ్మునకున్.
ఉ॥ నందుఁడు సంభ్రమంబునను - నందను బాయు సహింప కెంతయో
కుందుచుఁ గంస భూపమునకున్ వెఱగంది వియోగ తప్తుఁడై
గొందల మందియుం జనియె - గోకుల ముఖ్యులు వెంబడింప గో
వింద పదారవింద గతి- వీత మనోగత భీతుఁడై పడిన్.
తే॥ గీ॥ అతఁడు మధురాపురంబున - కరిగి యచటఁ
గంసు దర్శించి కాన్కలఁ - గప్పములను
జెల్లు వేయించి యటనుండి - చిర పరిచితుఁ
డైన వసుదేవుఁ గనఁ జెఱ - కరిగెఁ బ్రీతి.
క॥ అతనిఁ గని మ్రొక్క లిడఁగన్
కుతుకంబునఁ గౌఁగిలించి - కూరిమి మీరన్
జతురత వసుదేవుండనె
నతి వాత్సల్యంబు నెయ్య- మరిమురిఁ గొనఁగన్.
శా॥ అన్నా! నంద కిశోరుఁ డాత్మజుఁడు బృం-దారణ్య మధ్యంబునం
దున్నాఁడే! సుఖియై, సురక్షితుఁడునై - యుష్మద్దయా పాత్రుఁడై
యెన్నో నోములు నోచినందులకు నీ - వీబాలునిం గంటి నీ
గన్నన్ బాయు దురంత దుఃఖములు సం-తాపంబులున్ దూరమై.
తే॥ గీ॥ అయిన దుర్నిమిత్తములు బృం-దాటవికిని
జేకురును దాన వీహ కెట్టి - చేటు లేదు
చిత్త మర్భక సన్నిధిఁ - జేర్చి వానిఁ

గంటి తెప్ప విగ్రహమ్మునఁ - గాంచవలయు.

క॥ సీ ఆశీః ప్రశ్న మునకు నా
యాశీర్వాదములు నంద - యశ్భకు వార్తల్
మానసమున కొక్కపరి నేఁ
వ్రాసియు స్వయముగ నో యొజ్ఞక - బరచుము కరుణన్.

క॥ అన విని సంయమికుఁ వసుదే
వుని దయానను నెయ్యమునకుఁ - బొంది ముదముఁ బీ
డన మొదవు ననిన నుడికై
పెను వెలఁపున దిగులు పెంది- వీడ్కొని వెడలెన్.

వ॥ ఆ సమయంబున.

ఉ॥ పూతన కామరూపిణి య-పూర్వ విలాసిని యై యథేచ్ఛమై
వీత ఘృణాత్మ యై తిరిగి - వీథులు వాడలు వాడవాడలున్
ఘాత మొనర్చి స్తన్య మిడ- నర్మ మృదూక్తులఁ జేరి బాల సం
ఘాతము ఘోర వాతము ఘ-నాఘన పోత వితానమున్ బలెన్.

చ॥ కుటిలుఁడు కంసు నానతిని- గూఢచరుల్ పుట భేదనంబులన్
విటపములం గుటీరముల- వీధుల నాడుల సంభవిల్లు మి
క్కుటములు బాల హత్యలను- గుప్తముగా నొరు లెవ్వరే నెఱుం
గుటకు నసాధ్యమౌ పగిదిఁ- గోరి ఘటించిరి తాల్చి యాఁదలన్.

క॥ ఇటుల నిరాఘాటముగా
మటుమాయముఁ జేసి శిశుల- మధురారాజ్య
స్ఫుట పురముల జనపదముల
నటవీస్థలి బృందఁ బూత-నాసుర సేరెన్.

మ॥ నవ తాటంక రుచుల్ త్రైలింగ మణి దా-మంబుల్ ప్రకాశింపఁ గ
న్గవ లావణ్యము చెంగలింప నును మై- కాంతుల్ పిసాళింపఁ జ
న్గవ ప్రాగల్భ్యము వెల్లడింప ముఖ చం-ద్రజ్యోత్స్న రాణింప మో

వి వికాసంబు చేస ల్మసంగ వెడలెన్- వీథుల్ విహారార్థమై.

శా॥ సౌందర్యప్రభ మోహినీ వనిత చంచచ్చంచలా దేవి తా
నిం దేతెంచె నటంచుఁ జూచి రెలమిన్- బృందారికాభ్రాంతి గో
బృందంబుల్ విడనాడి బృందములుగా- బృందాటవీ వాసు లా
మందన్ మంద మదేభ యాన నడి సంభ్రాంతస్థితిన్ జెందుచున్.

తే॥గీ॥ నెమ్మి నది తొక్కినట్టి గుమ్మమ్ము లేను
పూతనకు లోనుగాని కాఁపురము లేదు
బ్రదికి కేరింత వేయు నర్భకుఁడు లేఁడు
మర్మ మెఱిగియుఁ దెలుపఁడే మానవుఁడును.

తే॥ గీ॥ గోకులావాస బాలురఁ గూర్పు నొంచి
నందునింటికిఁ జనుదెంచె- సుందరాంగి
యొక్కచో నిర్వు రర్భకు- లుంటఁ జూచి
చిత్తమునఁ బొంగి- డోలల- జెంత కరిగి.

క॥ ఇద్దరు శిశువుల లోపల
ముద్దులు మురిపెములఁ గులుకు - బుడి పాపనికై
బుద్ధి వొడమ నా యువ్యల
యొద్దకుఁ జని బిడ్డ నెత్తి - యొడి నుంచుకొనన్.

మ॥ అదివో మోసము కాని యెంతటి వయస్యల్ బందువుల్ డాసినన్
బెదరన్ గొట్టెను న య్యశోద వలుకన్- వెన్నాడె నా నాఁడు తా
నిదురం బోయెడి బాలు నెత్తికొనియు- న్నిద్రాత్తుఁ గావించియా
మద పీన స్తని ముద్దు పెట్టుకొని సంభావించి యాడించినన్.

ఉ॥ మూసిన కన్ను లెత్తి మఱి- మూయుచు నెత్తుచు నావులించుచున్
దాసము నొందినట్టులు గరంబుల బాదము లెత్తి యేప్పుచున్
గాసిని జెందినట్లు తమకంబునఁ గంపము నొంది యాల్గు వంక
మోస మొనర్చెఁ బూతన వినోదముగాఁ బసి బాలుఁ డంతటన్.

క॥ అన్నా! యేఁకొంటివి రా
చన్నిచ్చెదఁ గుడువు మన్న! చక్కంబడు నీ
గ్రొన్నగులు చిన్ని తండ్రీ!
యిన్నాళ్ళకు నిన్నుఁ గంటి- యెఱుక వడమిచేన్.

క॥ అని స్తన్యమీయ బాలుఁడు
కను మూయుచుఁ దెఱచి కొనుచుఁ- గరమునఁ గుచముల్
బుణుకుచు వాతెఱ లందిడి
కొని త్రావం గడఁగెఁ బాలు- గుటుకు గుటుకునన్.

క॥ పాలం గేలింతల తో
గ్రోలంగాఁ దొడఁగ శిశువు- గురునై బరునై
వాలుం గంటికి గుండెలు
వ్రీలంగాఁ జేయు నంత- వేఁగై తోఁచెన్.

క॥ ఇఁక నసులు నిలువ వనుకొని
యొకసక్కెముల న్నటించి- యిట్లనె శిశుఘా
తకి భూతకి రొప్పుచు బా
లకు వక్త్రమునుండి కుచము- లాఁగుచుఁ బూన్కిన్.

క॥ "అయ్యో! ననుఁ బోనిమ్మా
యియ్యంగాఁ జాలఁ బాల-నిఁక నీకును నా
కు య్యాలకించి వదలుము
చయ్యనఁ బోకున్న మిగుల- సంకట మొదవున్".

శా॥ బాలుం బ్రోద్ధతచేలుఁ బాలు కుడుపన్ - భారంబుగాఁ దోఁప న
బ్బాలా రత్నము త్రోసి పైచినను స- బ్బాలుండు చన్విడకే
వ్రేలాడన్ గర పాద తాడనముల- న్బీడించి క్రీడింప ను
ద్వేల క్షోభను గూలి నేలఁబడి యు-ద్వేగార్తిలం దూలుచున్.

తే॥ గీ॥ రక్త ఫేనము ల్వెడల వ- క్త్రమ్ము నుండి

నాసికా రంధ్రములను నుచ్ఛ్వాసన మెడల
వశ్రి వివృతాక్షములును జిహ్వయును నుబుకఁ
బొలిలి దొఱలుచుఁ బూతన తొఱఁగె మేను.

క॥ స్త్రీ హత్య యనుచు లోక
ద్రోహమునకుఁ బూనుకొన్న దుర్మతి దేశ
ద్రోహిణిఁ బూతన విడుచుట
ద్రోహముఁ బ్రళయాంకరంబు దోషము కాదే!

తే॥ గీ॥ నృపుఁడె శిశుహత్యఁ జేయ నందిచ్చి నపుడు
గనియుఁ బ్రకటించుటకు వీలు గాని యపుడు
సర్భకుల శక్తులను భోజ్యలైన యపుడు
దేవుఁడే కాక యెవరు సాధింపఁ గలఁడు!

మ॥ వికృతాకారముతో బహిర్గత మల స్వేదాశ్రు వర్షంబుతో
వికటాస్యోద్గత రక్త వీక్షణ శకృ త్ఫేనాస్రి జిహ్వాళితో
వికటంబౌ నసురాంగనా గురు కుచ స్వీకారముం జేసి పీ
డక పాల్ద్రావుచు రోఁజి రొప్పుచును నాట్యంబాడు నయ్యర్భకుల్.

చ॥ కనుఁగొని యయ్యశోదఁ ప్రియ కాంతను రోహిణి బిల్వఁబంపి నం
దునిఁ దలపక్ గులాగ్రిణులతోడ నతండును నాక్షణంబ చే
రినను దదీయ వార్తను నెఱింగి జనుల్ చనుదెంచి గుంపులై
కని మృతకాంత నర్భకు నఖండ మహాద్భుత విస్మయాత్ములై.

సీ॥ బాలకుఁ గరమర్థి బరిరంభణముఁ జేసి
ఎత్తి ముద్దిడుచు నాడించు నొకఁడు
అరుణోదకముఁ ద్రిప్పి చరణముల్ గడిగి ని
వాళించి పాటలఁ బాడు నొకర్తు
వ్రజ కులరజేలు వేల్పు వటించుఁ బాదముల్
ముట్టి దండంబులఁ బెట్టు నొకఁడు

పసులఁ బిల్చి యూరకేఁ బాడి యుయ్యాలఁ
బెట్టి దీవించి జోకొట్టు నోర్తు

తే॥ గీ॥ నందునిఁ గవుంగిలించి యానంద మొసఁగఁ
బుణ్యమూర్తి వటంచును- బొగడు నొకఁడు
ఓ యశోద! నీ వంశము- నుద్ధరించు
చిటి బుడుతఁ గంటివని స్తుతిఁ- జేయు నోర్తు.

క॥ ఈ పగిది గోకులంబున
గోపీ గోపకులు దేలి- కుతుకాంబుధిలోఁ
నా పూతి పూయ మేదుర
యా పూతన దహన విధుల- నంత నడపినన్.

ఉ॥ పూతన చావు కర్ణ పుట-ముల్ వ్యథఁ గొల్ప సరోషమయాత్ముఁడై
భీత మనస్కుఁడై మిగుల- వేదనఁ జెంది నిరాశ బొందియున్
జేతము సంబళించుకొని- చింతను మ్రింగి ధృతి న్వహించి సం
జాత మహాగ్రహ జ్వలన- జర్ఝరితాత్ముఁడు గంసుఁ డంతటన్.

క॥ పటుతర నిజానుచరు ను
ద్భట బాధాకరు నధర్మ- పరు భీకరు ను
త్కట కిల్బిష పటలాకరు
జటులా సురుఁ బిల్చి పంపె- శకటా సురునిన్.

క॥ పిలిపించి పూతనికిన్ భూ
షలు నవ పరిధానములును- స్వర్ణంబును గా
న్కలు నిచ్చి గారవించుచుఁ
బలికె నుచిత పీఠ మొసఁగి- పరిచయ మొసఁగన్.

శా॥ మాయోపాయ కళా సుధీనిధి వ-సామాన్యోగ్ర వీరుండ వా
త్మీయ స్నేహిత బంధు రక్షకుఁడ వు-త్తీర్ణార్థ విస్ఫూర్తి వీ
వే యిప్పట్టున యుష్మదీయ సఖుని- న్నే వేళఁ గాంక్షించు వ

న్నే యుల్లంఘనఁ జేయుచో నొరులు బి-క్కేల? నాకు వైరి స్తోత్రమా!

తే॥ గీ॥ నన్నుఁ గడతేర్ప నెంచి జన్మంబు నొందె
గోకులంబున నందుఁడ-న్గోపు నింట
నర్భకుండు పూతనను జక్కాడె నతఁడు
వాని నెట్లైనఁ బరిమార్ప - వలయు నీవు.

క॥ పలుక నిటు నింతకే భీ
తిలి నన్నుఁ బిలువంగ నేల? - తికమక చే? మీ
తెలివియుఁ దేటయు మాసెనో?
యలఘు భుజా బలుఁడ నిట్టు-లడలం దగునే?

క॥ చచ్చెరఁ జని యిప్పుడె నేఁ
డిచ్చెద నా శిశు శిరంబుఁ - దేకువ భయముల్
బుచ్చెద నీకును వహ్నిం
జొచ్చెదఁ గాదేని నిజము - చూడు నరేంద్రా!

క॥ యంత్రంబులఁ దంత్రంబుల
మంత్రంబుల యందుఁ గడు-సమర్థుండగు న
మ్మాంత్రికుఁ డిటు శపథంబు స్వ
తంత్ర పరాక్రమ మహోగ్ర-తన్ ఘటియించెన్.

చ॥ అనుచుఁ బ్రతిజ్ఞఁ జేసి శక-టాసురుఁ డంతట ఘోషలోనికిన్
జని యొక బండిరూపమునఁ-జయ్యన వీథులఁ బోయి పోయి నం
దుని గృహమందు డోలికను- దూఁగుచు నిద్దురఁ బోవుచున్న బా
లునిఁ గని సూక్ష్మరూపమున - లోపలికిం జని డోలఁ దాఁకినన్.

ఉ॥ డోలిక బ్రద్దలై పగిలె-డోలి సుషుప్తిని బొందుచున్న యా
బాలుఁడు మేలుకాంచి కుడి-పాదముతో నొక తన్నుఁ దన్ని సక
ల్పిలి వికావిక ల్గని గు-భేలునఁ గూలెను బండి యందు న
వ్వేలుపు గొంగ ప్రాణముల-వీడి భయానక వృత్తి గన్పడెన్.

క॥ ఈ వృత్తాంతం బెల్లను
బాపురుమని యెచ్చు చెరిగి - బలరామునితో
వాపిరి నాఁడను బాలకు
లావేళను వారి యిండ్ల-నాఖ్యా నింపన్.

క॥ గ్రేపల్లె నున్న గోపీ
గోపకు లా చిత్ర ఘటన - గొన కొని కనఁగాఁ
బాపల లేఁగలఁ బసులను
గోపురములఁ బసుల వదలి - కదలిరి వేడ్కన్.

క॥ ఆలో నంద యశోదలు
బాలుని లేవంగ నెత్తి - పరమాశ్చర్యా
లో లాత్ములగుచుఁ ద్రిభువన
పాలకుఁ డీ బిడ్డఁ డనుచు - భావించు నెడన్.

మ॥ గుంపులు గట్టి మందఁగల- గోపక గోపిక లేగుదెంచి నై
లింప విరోధి మేదుర క-ళేబరముల్ శకటంబు బద్ధలై
పెంపును సొంపు నేది కని-పించెడి; దానినిఁ గాంచి యద్భుతో
త్కంపిత గాత్రులై శిశువు- కట్టెడి రక్కసి బండిఁ గూల్చునే?.

సీ॥ ఇతఁడు కేవల బాలుఁ-డే జగత్త్రితయంక
రుండయి యాడు బా-లుండు గాని
ఇతఁడొక యర్భకుం-డే నాభిఁ బద్మజుఁ
బ్రోదిఁ గన్నట్టి య-ర్భకుఁడు గాని
ఈతఁడు పసి పాపఁ-డే పాప శేనిపై
వట పత్రమునఁ గూర్కు-పాప గాని
ఈతఁడు కౌమారుఁ-డే శౌర్య విక్రమ
దోష నిర్జిత కుమా-రుండు గాని.

తే॥ గీ॥ ఈతఁ డొక్క కిశోరుఁడే-వృధుల బలసు

రారి మత్తేభ హారి కిశోరంబు గాని
యనుచు గోపికా గోపకు లవశు లగుచుఁ
బాడి కొనియాడి యాడిరి భయము వీడి.

ఉ॥ కొందరు బండి యొండు చిటికుట్టిని దాఁకిన బాలుఁ డాపదం
బొందక పాద సంహతిని ముక్కలు ముక్కలుగా నొనర్చె నం
చందు రదెట్టులైన మనుజార్భకుఁ డెన్నఁడు నివ్వఁడేని బం
డిం దన కాలఁ దన్ని ప్రకటించెనె యద్భుత విక్రమోద్ధతిన్.

క॥ ఈ విషయముఁ గంసునకును
నా వార్తాహరులు దెలుప నటమట వడి తా
రావించెను వైశంబ తృ
ణావర్తుం డనెడు నొక్క యాసుర ముఖ్యున్.

తే॥ గీ॥ ఆ తృణావర్తుఁ డరుదెంచి యనిదెను నిట్లు
హేయ రూపుండు శకటుఁ డైతేయుఁ డీల్గె
మనుజ బాలకు నేఁ బరిమార్పఁ కున్న
నసుర వంశంబునకు నపఖ్యాతిఁ దేనె.

వ॥ ఇటు శపథంబుఁ జేసి చనిబృందకు నా చటులాసురుండు ప్రా
కట నిజ దైత్య మాయ సుడిగాలి విధంబున నందునింటి ముం
గిట నొక డోలఁ దూఁగుచు నొకోక్క గనుమూసి పరుండియున్న యా
చిటి బుడుతయ్య నెత్తుకొని చెంగున నింగికిఁ జెంగలించుచో.

ఉ॥ నరిగ యశోద లేద్వఁ గరుణామతి రోహిణి తల్లడిల్ల నా
క్రందము తోడ వెంట బలరాముఁడు చేలము నంటి రాఁ బ్రియా
బృందము సంకటింపఁ బుర వృద్ధులు ధైర్యముఁ జెప్ప గోపకుల్
కొందఱు రోసమూని పెనుఁగోలల గోలలు గోల సేయగన్.

మ॥ వినువీధిం దురపిల్లినట్టి నిజమాతృ భ్రాంత మేదైన నే
మణు మాత్రంబును యంతకంబ గుమనై యతాస్సాతతం బౌచు

వణ దైత్యాంగ మొకండు నేలఁబడె దచ్ఛరీర మధ్యంబు నం
దున శ్రీకృష్ణుఁడు డోలనున్న పగిదిఁ జూపట్టె నిర్భీతుఁడై.

వ॥ అంత.

సీ॥ ఏఁ డసామాన్యుఁడ విహగ వాహుండేమొ
యనుచు బాలకుని ముద్దాడు వారు
ఏఁ డమర్త్యుండ తొల్వేల్పుగాంగ యటంచు
గ్రక్కునఁ జాఁగిలి మ్రొక్కు వారు
ఏఁ డయోనిజుడ సేవిత విధాత్రి భవేంద్రుఁ
డగునేమొ యనుచును బొగడు వారు
ఏఁ డభీరుఁడ ఘోర విష భోగి పర్యంకుఁ
డేమొ యటంచుఁ గీర్తించు వారు

తే॥ గీ॥ నగుచు గోపికల్ గోపకు లర్భకునకు
దృష్టి దీయించి యారతు లిచ్చి డోల
నునిచి జోకొట్టి యానంద మునను నిజ ని
వాసమున కేఁగి రవ్వేళఁ బాడుకొనుచు.

చ॥ కడచెను గొంతకాలము సుఖంబునఁ గృష్ణుని శైశవంబు న
ద్దిడి చిటిపొట్టి కొన్నడుపు లెన్నొ మనోహర మంజులాకృతిఁ
బుడుతఁడు పల్కనేర్చె నునుముద్దులు మాటలు గట్టునట్లు క
న్పడిన నమోఘుతోష కలనంబున నాఁడులు దాఁటెనంతలోఁ.

క॥ ఆవృతుఁడై తన శిష్యుల
తో వానప్రస్థ సముచితోచిత విధి, బృం
దావన భూమికి వచ్చెను
దైవజ్ఞుండైన గర్గతాపసి నియతిన్.

తే॥ గీ॥ అతఁడు కాలజ్ఞుఁ డగుటఁ బృందాటవికిని
గోకులావాసు లెల్లరు గుములు గట్టి

యఱిగి యమ్మునివర చంగుని నాశ్రయించి
పడయఁ జాలిరి తమతమ - భావిగతుల

ఉ॥ నంద యశోద లేగి ముని - నాథున కొగ్గి నమస్కరింప, మీ
చందము నే నెఱుంగుదుఁ బ్ర- జాపతి యాజ్ఞ మనుష్యరూపముం
బొందిన దివ్యలీల, భవ - మోచకుఁడౌ హరిసేవఁ గోర నా
నందముతోడ మీకుఁ గను - గాఁ బరమిచ్చె నజుం డటంచు నేఁ

తే॥ గీ॥ అతఁడు బలరాముఁ బరికించి - యనియె నిటుల
సీతఁ డాది శేషాంశ జ - న్మించె సాధు
ధర్మ రక్షణార్థ యవ - తార మెత్తి
చక్రి కింగుడి భుజముయి - సాయ పడగ

క॥ నంద యశోదల చెంగటఁ
గందర్ప సమాన రూప - కను పేయుండెన్
సుందరు బాలుని జూచి య
మందానందాశ్రు లొలుక - మౌనిప్పుడి పలికెన్ ౨౦

శా॥ నందా నీ కరుణా విశేషమునఁ గన్నారం - గనన్గల్గె గో
విందుం డీ లోకము లోపఁ బుట్టిన మహా - విశ్వేశు సర్వేశు మీ
బృందారణ్యమునందు బురాకృత తపః - శ్రీ మీరు యోగీంద్రు లేఁ
బొందంజాలని భాగ్య మబ్బెఁ గద, నా - పుణ్యంబు సామాన్యమే?

తే॥ గీ॥ ఈతఁ డొక నిమిత్తమున జ - న్మించె దేవ
కికిని వసుదేవునకును, నీ - గృహము నందుఁ
బెరుగుచున్నాఁడు మీకు - నావిర్భవించి
మాయ శిశువు మీ కిచ్చిపోయె - మాయముగను ౨౧

ఉ॥ ఎన్ని భవంబులందుఁ బర - మేశ్వరు సేవ యొనర్చి యుంటిరో
యెన్నఁడు వాన వాజ నిట - లేక్షణు లేనియుఁ బొందలేని యీ
వెన్నుని బాల లీలఁ గని - పెంపఁగఁ గల్గెను మీకు నద్దిరా!

వున్నమఁటన్న! లేపు మిము - బోఁట్లు త్రిలోకము లందు నొక్కరేఁ?

క॥ ఈపాపని వలనను మి
మ్మాపద లెవ్వియును బొదవ - వర్భకుఁడే మీ
గోపుల, గోవుల, ఘోషముఁ
గాపాడును, శాంతి, సుఖముఁ - గలుగును మీకున్. ౭౮

క॥ అనిన ననిర్వాచ్యంబగు
ననుపమ మగు హర్షమంది - యానందాశ్రుల్
కనుఁ గొనలను జడిఁగొన గ
గ్గని యనుమతి మగిడి చనిరి - గోకుల మునకున్. ౭౯

మ॥ చన మాసంబులు నేఁడుఁ గొన్ని దినముల్ - సంవర్ధమానంబునై
జన సంస్తుత్యుఁడునై, మనోహరుఁడునై - సంభావ్యుఁడై గోకులం
బున కాకర్షకుఁడై, యనర్ఘ మణియై - బాల్యారు కృష్ణుండు నే
చన, మాటాడఁగ, నాడఁ, బాడఁ, బ్రతిభా - షల్ నేర్చె నానాఁటికిన్.

సీ॥ వఱువాత మేల్కని - పాల్ద్రావి, పదముల
సుద్దుల పల్కించు - ముద్దులొలుక
బోర్లుచుఁ దనకయి - బుడిబుడిఁ జనుదెంచు
తోడి బాలురతోడఁ - గూడియాడు
పొర్లాడి యంతనె చద్ది - సాపడి ఘోష
నిల్లిల్లుఁ గాల్నడ - నేఁగి వచ్చు
సాయంబునందు ని - చ్చలు నాల మందల
కెదురేఁగు గోపాలు - రెత్తుకొనఁగ

తే॥ గీ॥ రే యశోద ప్రక్కఁ బరుండి - ప్రీతిఁ గొసరి
కసరి కొన్నను నూఁకొట్టుఁ - గతలు వినుచు
విశ్వ సంరక్షకుండు - శ్రీ విష్ణుమూర్తి
యర్భక విశిష్ట పాత్ర ని - ట్లభినయించి. ౮౦

కం॥ బలరాముఁడు గృష్ణుండును
గలసి మెలసి యాడుకొనుచుఁ గలియఁ దిరుగుచుఁ గా
బిలుచుచుఁ జెలికాండ్రను గో
కులమున నడయాడు చుండ్రి గునగున మనుచుఁగా ౭౯

ఉ॥ గోకులమందు నున్న పసి - కుఱ్ఱలు నిద్దురలేచి యెల్లరుఁగా
వేకువ నందగోకళ్ళకరిఁ - బిల్చుచుఁ గృష్ణునిఁ గాన నేగ నా
పోకడ నంద నందనుఁడు - మున్నె యెఱుంగుచు లేచి బాలకుల్
రాక నిరీక్షసేయు, బలరాముని - మేల్కొలుపుఁగా గృపామతిఁగా.

సీ॥ చేర్చి ముంగురులెల్ల - సిగవేసి తుఱిమిన
చెంగల్వ యఱవాడి - చెలువు మివుల
వదనాబ్జమున రేఁగి - చెదరిన మృగమద
తిలకంపు గుమగుమ - లొలయ దెసల
చిటి ముద్దుటురమున - నటియించు ముడి వడ్డ
పులిగోరు పతకంబు - పొలుపు మీఱ
నునుబొజ్జ వలిపెంపు - మొలనూలు నందున్న
కనకంపు రతనాల - గంట లురలఁ

తే॥ గీ॥ చెవుల మద్దికాయల జోడు - చిందులాడ
నాస నవ మౌక్తికము నర్త - నంబుఁ సేయ
మురువులును దండ కడియంబు - లొరసి మొరయ
నెదురు పసువెత్తుఁ గృష్ణుఁడు - హితులఁ గలియ ౮౦

వ. ఇట్లు బాల్యక్రీడా వినోదంబులం దవిలి

ఉ. ఒక్కొకనాఁడు పక్కి దొర - యోజ నొకానొక బాలకుండు గా
నెక్కను విష్ణుమూర్తినని - కృష్ణుఁడు వాని భుజాలమీఁద దా
నొక్క పటంబు ఛత్రిమని - యోపికతో బలరాముఁడూన న
మ్మక్కలు నవ్వి పువ్వులను - నారతులీయ యశోద పొంగఁగాఁ

చ॥ మఱి యొకనాఁడు కృష్ణుఁడు ర - మాపతియై పవళించి నిద్రితో
నురగ చయోదధిన్ బలుఁడు - నూరులఁ దమ్ముని శీర్షమందుఁ గొం
ద అసురులై చెలఁగ, మఱి - తక్కిన బాలురు నాకవాసులై
మెఱలిడఁ బ్రోవఁగా నభయముద్ర యిడుచుఁ గుడి కేలు ద్రిప్పుచున్

చ॥ మఱి యొకనాఁడు కృష్ణుఁడు క్ష్మా - ధిపుఁడై పెనుఁ బీఠమెక్కఁ గొం
డఱు భటులై చెలంగ భట - నాయకుఁడై బలరాముఁ డొప్పఁ గొం
ద ఱెఁ బరాజితార్తులయి - దాసులుగాఁ దలలొగ్గ వారికిన్
శరణ మొసంగి పొమ్మనుచు - సంకెలలూడ్చి ప్రభుత్వ వైఖరిన్

ఉ॥ వేఱొకనాఁడు శౌరి సరి - పిల్లల నెల్లర రెండు శ్రేణులన్
దీర నియోగమున్ సలిపి - నీటుగ మోహినియై చెలంగుచున్
క్షీర ఘటం బొకండుఁ గొని - నృత్యము సేయుచు గాన మాధురిన్
వారలఁ దన్పుచున్ గపట - నాటకపాత్రము నిర్వహించెనిన్

ఉ॥ ఇంకొకనాఁడు స్నేహితుల - నెల్లరఁ గృష్ణుఁడు సేర్చి యొక్కచో
బింకముతోడ నెత్తయిన - పీఠ నధిష్ఠితుఁడై "గురుండ నా
కింకరు లీరు ఛాత్రు"లని - గీతల కొన్ని పఠించు జ్ఞానము
దాంకితులైన యట్లభిన - యం బొనరింపఁగ బాలు రర్థిమై

వ॥ ఇట్లు బాలక్రీడా వినోదంబులం దవిలియు బలరామ కృష్ణులు

సీ॥ బృందాటవిని గల - వికలాంగ, పంగ్వంధ
బధిరుల నరసి సే - వల ఘటింత్రు
నిష్ఠా గరిష్ఠులై - నియమ సంయములైన
యోగులఁ బరికించి - యుపచరింత్రు
ఆఁకొని యలసి వ్య - థార్తులై పలవించు
కడుఁ బేదలనుఁ జూచి - కనికరింత్రు
ధర్మ సంబద్ధులై - కర్మ పటిష్ఠులౌ
సద్గృహస్థుల నెంతొ - సత్కరింత్రు

తే॥ గీ॥ రోగులనుఁ బల్కరింపఁగ - నేఁగు దెంతొ?
శక్తిహీనుల కెంతయో - సాయ పడును
రర్భకుల క్షేమ వృత్తాంత - మరయు చుండ్రు
బృంద బల రామ కృష్ణులు - పిన్న లయ్యు.

క॥ అయినను సధర్మ పరులను
నయ దూరులఁ గృపణ మతుల - నైచ్య యుతుల ని
ర్భయులై గుణ పాతమ్ముల
నయముఁ గఱపు చుండ్రు పెక్కు - నడతలఁ గడఁకన్.

ఉ॥ కాటికిఁ గాళ్ళు సాఁచికొని - కంపమునన్ గడుఁ దూలుచుండు మో
మోటమిఁ ద్యాగమున్, సహన, - ముత్తమ ధర్మము లెవ్వి లేని జం
జాటముఁ బెంచుకొన్న మను - జాధముఁ జూచి సహింప లేక పో
రాటముఁ బెట్టుకొందురు ప - రాభవ కల్పన బుద్ధినేర్పఁగన్.

ఆ॥ వె॥ వయసు చెల్లువఱకు - భర్తను, నత్తను
జీల్చి, పిప్పిసేసి, - వెతలు పెట్టి
నేఁడు ముదిమి వొడమఁ గోడండ్రఁ గాఱించు
నత్తకొక్క పాఠ - మరయు చుంద్రు.

క॥ సోమరియై పనిపాటల
నేమఱి, కలుద్రావి, వచ్చి - గృహమున సతి నే
దే మిష వేధించెడి జను
నేమర కలయింత్రు చిత్త - వృత్తి నురల్పన్. ౯౧

క॥ గయ్యాళి గంపయై మా
మయ్యను, నత్తయ్య, మగని - నదలించెడు న
క్కయ్యను గుట్టు వెలార్చుచుఁ
గయ్యములకు లాఁగి బుద్ధిఁ - గఱపుదు రలుకన్.

సీ॥ గడియించి రాసులఁ - బిడికెఁడు మెదుకులేఁ

గాకికి వేయ వెన్నుడు వానిఁ
దనకెంత సిరియున్నఁ - దనవలె సుఖియించు
లేములఁ గని యోర్వ - లేని దాని
మోస మెఱుంగని - పురుషులఁ గికురించి
పెద్దయై పురి పెట్టి - వీఁగువాని
నెఱనులు దనకున్న - దొలఁగించి యొరులపైఁ
దగవులకై కాలుఁ - ద్రవ్వు దాని

తే॥ గీ॥ జీవనముఁ జౌర్య వృత్తితోఁ - జేయు వానిఁ
బుఘఁ దనమున జీవికఁ - గడపు దాని
శిక్షఁ గఱపఁగ నేమము యోజించు చంద్ర
బృంద బలరామ కృష్ణులు పిన్న లయ్యు.

వ. ఇట్లు బలరామ కృష్ణులు తోడి చెలికాండ్రంగూడి దినదినముఁ గనని వినని నూతనపుం దెన్నుల చిన్నమిన్నల నెన్నక వెన్నఁటె బన్నంబుల నెనోర్పు పన్నిన

క॥ బలరామ కృష్ణ శిక్షణ
ముఁ దూలెడు వారు విసిగి - మునుకొని యొకచోఁ
గలిసి, కులాధిపు ప్రియ పు
త్త్రిల దండన సేయు తెఱఁగు - రూఢి వడమిచేఁ.

క॥ ఒకరొకరె యశోద వలను
నకుఁ జని, బల కృష్ణ వర్త - నము నచ్చు నటుల్
ప్రకటింపఁగ ననుకొని నాఁ
టికిఁ జనిరి నివాసములకు - డెందము లలరన్.

వ. అంత మఱునాఁడు

ఉ॥ ముంగిటిలో యశోద యొడి - ముద్దుల కృష్ణుఁడు గూరుచుండ నా
చెంగట రోహిణీ సఖియుఁ - జేరి ప్రియోక్తుల నాడుచుండ ను

పొంగుచు రాముఁ డాడుకొనఁ - బోవఁగఁ దమ్ముని రమ్మటంచుఁ జే
రంగ యశోద బాలుని శి - రమ్మును మూర్కొనుచుండు నంతలోన్

క॥ పసవత వడఁకుచు నొదుపులు
దడఁబడ బెడిదంపు బెదద - దపదప మనఁ గా
ల్నడవడి యుడుఁగఁగ నడు గొ
క్కుడ యనుగుల నడుగు లిడుచుఁ - గడఁగి నుడివెన్. ౯౯

క॥ అరుదెంచి కోల పూనిక
వఱు వట్టుల గిట్ట వాయి - పగపడి యరోషన్
గఱచుచుఁ దల పంకించుచు
సరుగు పయిన్ గూరుచుండి - యనె నిట్టులుగన్.

క॥ "ఓ యక్క! నీ సుపుత్త్రులు
మా యింటికి రోజు వచ్చి - మా ధాన్యములన్
బోయుదు రొకలకుఁ గాదన
నూయుదు రదలింతు రింక - నోర్వను జమిమ్మా.

ఆ॥ వె॥ ఇంతలోనె యొక్క - వృద్ధురా లచటికిఁ
జిన్న కఱ్ఱ యొండు - చేతఁబట్టి
తొట్రి నోరు పెదవి - బిఱ్ఱ బిగించుచు
నేవఁ జలము గదుర - నేఁగు దెంచి.

చ॥ "వినవె యశోద నీసుతుల - వృత్తము నేఁగను గూడియున్న నీ
తనయులు వెన్న నోటనిడి, - దండడి మీసలు దీర్చి బుగ్గ మీఁ
దను నొక చుక్కవెట్టి, యొక - తాళ్లను సెజ్జకుఁ గట్టి నన్ను, మే
ల్కొనఁ బరుగెత్తుచున్ జనిరి - కఱ్ఱలుఁ గోడలుఁ జూచినవ్వఁగన్"

క॥ అనునంత బుఱ్ఱ మీసలు
నను బొజ్జయుఁ జెవుల జంపు - నుదుటను బుండ్రం
బును మెఱయ నటకు నరుదెం

చెను గోపకుఁ డొక్కఁడు డీటు వ - చించుచుఁ గినుకన్

క॥ ధనమున్నఁ గుఱువఁ దగుఁ బె
త్తనమున్నను నరయఁ దగుదు - దగమిఁ దగవులన్
బనుచుదురే? మీ కుమారుల
ననుబోట్లొకఁ గీడు సేయ - న్యాయమె మీకున్

ఉ॥ బాసల పాలు నేలఁ బడఁ - బిడ్డలు చేసిరి జాలరుస్విఁ నా
బోనము త్రోఁగు చుండు ఘుట - నుట్టుమాయముఁ జేసినారు నా
ప్రాణము చేసరిల్లఁ బలు - బాములఁ బెట్టుచు నున్నవారు మీ
యూన యుబద్ధమాడఁ గల నా? లలనా! మిముబోంట్లు ముంజటన్

క॥ అప్పుడె కడియము లందెల
చప్పుడు విన్పడఁగ గొప్ప - సవరము వీడన్
రొప్పుచుఁ గన్నీ రొలుకఁగఁ
జప్పునఁ జనుదెంచి యొక్క - జవ్వని యనియెన్

శా॥ దంపం బో చొరసాని మీ సుతుల స - త్యాగోపణల్ సల్పి పె
న్గొండాటంబులఁ బెట్టి బందుగులచేఁ - గొట్టించి తిట్టించి నా
యండా యాఁవ్రుఁ దొలఁగఁ జేసి రెటు చే- యంజాల కేతెంచితిన్
గండా గొండి తనంబు మాన్ప సుతులన్ - దండించు టర్హంబగున్

క॥ విలపించు చిట్లు కోమలి
పలుకు నెడన్ గుములుఁ గట్టి - పలువు రచటికిన్
గలఁగుచుఁ దలఁగుచుఁ దలఁకుచు
విలపించుచు వచ్చి రంత - వెతలు దెలుపఁగన్

సీ॥ వంటింటి కోఁ జొచ్చి - పాకముల్ పెరటిలో
వెదఁజల్లి రని -పలపించు నొకఁడు
చిటి పొటి మాటలఁ - జెప్పి కారముఁ గంట
విదిలించి చని రని - వదరు నొర్తు

తలగుడ్డ దాఁచి మీ - సలఁ గత్తిరించి నకౌ
బరిభవించి రటాచుఁ - బలుకు నొకఁడు
చెఱకుఁ బానక మిది - శీఘ్రమె కొనుమంచు
మూత్ర మొసఁగి రచుఁ - బొక్కు నొక్క
తే॥ గీ॥ కొంటె తనమునఁ దన - పైనిఁ గోల విసర
గాయపడె నంచుఁ జిం - దులు వేయు నొకఁడు
మద్దులకు దగ్గఱకుఁ దీయ - బుగ్గఁ గఱచి
గంటువడఁ జేసి రను మచ్చె - కంటి యోర్తు ౧౧౩

క॥ ఈ విధమునఁ దనకొమరులు
గావించెడి దుండగములఁ - గటువుగను యశో
దా వనజాక్షికిఁ దెలిపినఁ
గేవల బాలకులిటు లప - కృతుల ఘటింత్రే.

వ. అనుచుఁ దలవాంచి కొంత తడవు.

క॥ తలపోయు చుండ నిటు గో
కులమందలి యుత్తములును - క్షుద్బాధితు లం
ధులుఁ బంగు లనాథులును వి
క లాంగు లరుదెంచి యటకుఁ - గను కని వరుసన్

సీ॥ జనని! నీ సుతులు ని - చ్చలు నుపకారులై
చరియింత్రు సజ్జన - సమ్మతము గ
నీ కుమారులు తల్లి - యాఁకొన్న మముబోంట్లఁ
గరుణింతు రన్నోద - కంబు లొసఁగి
అంధుల మైన మ - మ్మనునయించెదరు నీ
యనుఁగు బిడ్డలు వచ్చి - యను దినంబు
మాపాలి వేల్పులై - కాపాడెదరు కూడు
గుడ్డల నొసఁగి నీ - కొమరు లతివ!

తే॥ గీ॥ కదలఁ జాలని మనుబోఁట్లఁ - గనికరింపు
తల్లి! నీ యర్భకులు సంత - త స్మృతుండగు
బాలకుల నలరించుచుఁ - బలుకు మాటఁ
గాంచుచు యశోద తికమకఁ - గనియెనంత

క॥ రోమాంచి కొంత తడవు ప
యోజాక్షి యశోద యేమి - యును వచియింపం
గాఁ జాలక వినయంబుగ
నాజనులను బొంపుటంచుఁ - బ్రార్థించె నొగిన్

సీ॥ "దండ గీండ్రిందునా - స్తుతియించు నార్త దీ
నోత్తమ వాక్యముల్ - రిక్త లగునె?
నిర్దోషు లందునా - నెలకొని పలువురు
పలికెడి పల్కుట్ల - బద్ధ మగును?
అర్భకు లందునా - యతిమానుష క్రియా
రతు లౌటఁ గడు నసం - గతము గాదె?
పరిపూర్ణు లందునా - ప్రబల దోషము గాదె
ముకుఁ బచ్చు లారని - బుద్ధత లగుట?

తే॥ గీ॥ ఇట్టి వైపరీత్యం బెన్నఁడేనిఁ గలదె
దండగీఁడ్రొ కాకున్న ని - ర్దోషులగుటొ
బోధ పడకుండె" ననుచు - యశోద పలికె
నసిపి, స్మరియించె గర్గవా - క్యముల నాత్మ

ఉ॥ నందుఁడుఁ గీముఁ జేరినను - నాఁటి నిశిన్ వినిపించి సర్వమున్
బొందె ప్రభూత హర్షము న - పూర్వ మహాద్భుత విస్మయంబులన్
డెందము లందు గర్గ ప్రక - టీకృత వాక్యములన్ స్మరించి యా
నందము మోదముం గనిరి - నందుఁడు రోహిణియున్ యశోదయున్

వ. కొన్ని దినంబులు గడచిన పిమ్మట నొక్కనాఁడు రేవ కడ యశోద

నిత్యకృత్యంబుల నిర్వర్తించుకొని తోడి చెలికాండ్రఁగూడఁ బోవు శ్రీ కృష్ణునిం జేరి బుగ్గ లొత్తిడి శిరంబు మూర్కొని భగవద్దర్శనం బిచ్చినట్లు బ్రహ్మానందంబు నొంది యీవస్సలాడు వెన్నఁదుకోరిన వెన్నయుఁ బక్కెలంబులును, నను మీగడయు నిక్కటంబుగ నొసఁగి, తిరిగి, కన్నయ్యాం దరిమి తరిమి ముద్దులాడి యిలువేలుపులకుం దలయొగ్గి గోమాణిక్యంబులఁ బూజించి పెరట నున్న తులసి తరువునకుఁ జాఁగిలి దధి మథనాగారంబు సొచ్చి గడమంచెపై నున్న దధి కలశము డించి భూతముల నుద్దేశించి యొక్కింత పెరుగు బలి యొసంగి భాండంబు మథన స్థానంబునకుఁ గొని చని కదుటఁ గుండ నుంచి పవ్వాలపుఁ గవ్వమ్ము నవ్వడి నిర్వాటిల్లఁ జేకొని తాఁబేటి మేటి కథనంబు మననంబుఁ జేసి క్షీరసాగర విధాన కథా గీతంబులఁ బాడుచు బేడిసలగోడుం బుచ్చు వాఁడి చూపుక్కుల పోఁడిమి వెలయఁ బజ్జనున్న గుజ్జునకుఁ దగిలియున్న రజ్జువుం గనుంగొని ఘటంబున గవ్వంబు నిక్షేపించి పేటమ్ములుగాఁ దాఁటం దగిలించి

చ॥ చిడిముడి పీడ ముంగురులు - చెప్పఁగఁ బూడఁ గుచంబు లప్పుడ
ప్పుడ పడఁగూడి వీడ సిగ - పూ లొగి వ్రాలుచుఁ జిందులాడ నే
ర్పుడి పడకున్న కొను గరు - వంబున గుల్కుచు నాట్యమాడ నా
వడఁతి మథింపసాఁగె దధి - భాండము గీతిక లెన్నొ పాడుచున్

వ. అట్టి సమయమ్మున యశోదమ్మ నెమ్మి నమ్మతిని నమ్మి యొసఁగిన తినుబండారములఁ దన చెలికాండ్రకుఁ బనిచి పెట్టు మనకొనిన, నునుమీఁగడయు వెన్నయుఁ దగినంత కనుపడమి నవనీత చోరుండై తిరిగి యిల్లెల్లెడఁ బెల్లుగ నల్లఁజన దురకిల్లు నల్లని వెన్న కల్లంతయు దురటిల్ల కుండుటకుఁ దెల్లవోయి నల్లనయ్య దొంగతనంబునం గల బెంగ మిగ్గి సంగతి నెఱింగించి యంగీకారంబునకై యడయం గడంగి చెంగుచెంగునఁ జెంగలించుచుఁ గంగున నార్చుచు నేఁకు దెంచి యంగనామణి యశోద యున్నపొంగ నిల్చెను.

క॥ "తల్లీ! తాయము లన్నియుఁ
గొల్లగ నా సంగడీండ్రకును నొసఁగితి నా
కిల్లయిన కిచ్చి పంపుము
వెల్లని మీఁగడయుఁ బెరుగు - వెన్నయు వేగన్"

వ. అందులకు

క॥ ముసిముసి నగవుల మెఱయుచు
నసి యాడఁగఁ గానఁ గురులు - నాస్యాబ్జముపై
దశన ప్రభ లొలయఁగ నా
యశోద వాత్సల్య మడర - ననె నిటు లెలమిన్

క॥ "కన్నయ్యా! చిన్నిబాబూ!
వెన్నయు మీఁగడయు మంచి - పెరుగును బాలున్
జున్నును జక్కెర దాఁచితి
మిన్నక కూర్చుండు మొక ని - మేషము తండ్రీ!"

చ॥ అని దధిఁద్రచ్చుచున్నఁ గన - టార్భకుఁడౌ హరి వేగిరింప న
వ్వనజదళాక్షి సామమున - బాలకు నాఁగు మటంచుఁ గోరినన్
విన కలుకన్ వహించి విల - పించినఁ గృష్ణుఁడు సద్దుచేయ కా
వనిత మొఱంగఁ గ్రుద్ధుఁడయి - భాండము గ్రద్దలు గొట్టె దద్దయున్

వ. బుడిబుడి యడుగు లిడుచుఁ దడఁబడుచు దుడుకుఁదనమున బడబడ పరువులిడు యశోద పెనుగినుకఁ గనలిమన మునఁ బెనఁగొనిన యనురాగము గొనకొని యణఁచుకొని తనతనయుని మొఱకుఁదనంబునకు వెఱఁ గొందియుఁ బెనగుఁ గడవ పిరపిర విఱుఁగుట మన మెరియఁ జూచుచుఁ గ నుకు జూడ్కులఁ బరచి పరువఁ బరువున హరిఁ బిఱుదగిలి తఱిమి తఱిమి మఱి మఱి పరువు లిడియు

ఉ॥ దాసియుఁ జేరబోయియును - దక్కరి డింభకు దాఁటిపోవు; బె
గాసివహించి పద్వడియు - గట్టి దుటుక్కగల పొట్టి నట్టువున్

బాసి చనుఁ; గరం బెలమిఁ - బట్టి కృతార్థతఁ గన్న నెట్టులో
మానసమొనర్చి డాఁగు భవ - మోచకుఁ డా హరిఁ బట్ట శక్యమే

క॥ ఇటుఁ గొంతతడవుఁ గడఁగియు
నటునటులై చనఁగఁ దన ప్ర - యత్నము లెల్లన్
గటకటఁ బడి కాళ్లొవ్వఁ బ్ర
కటితవిచారమున నిలిచి - కన్నీరొలుకన్

వ. ఒక్కచోఁ గూరుచుండి కన్నుల మూసికొని రెండుచేతులుసాఁచి గద్గద స్వరంబున బాలకు సంబోధించి యాపడఁతి యిట్లనియె.

మత్త॥ చిన్నపాపఁ డెవండు పూతన - జీవముల్గొని బండిఁగా
ల్దన్ని చక్రి మరుత్సురారి మ - దంబు డించి వెలింగి మా
వెన్న మీఁగడ మ్రింగి దొంగల - వేలుపై యిలు వేలుపో
వెన్నుఁ డల్లరి వాఁడు నల్లని - బిడ్డవానిఁ దలంచెదన్

చ॥ అని తలపోయు నంత విని - యార్తశరణ్యుఁడు నందనందనుం
డును మొలనూలి గంటలును - నూపురముల్ గడియాలు గజ్జెలున్
ధ్వను లొగిఁ జేయఁ గంకణ ర - వంబులుఁ గాసులు జంద్రహార ని
స్వనములు మేళవింప గరు - వంబున డాసె నొయారమేర్పడన్

క॥ జూసి యశోదను గనులను
మూసి నిజ కరాబ్జ యుగళి - ముద్దుగ నొడిలో
నోసరిలి కూరుచుండి ప్ర
యాసపడితి నీ శ్రమంబు - వ్యర్థంబగునే?

ఉ॥ నావుడు నా యశోద నళి - నాక్షుని కేల్దిగలాఁగి పట్టియిం
కేవిధిఁ గన్గొనంగఁ గల - వీవని చంకఁ గుదించి బాలు నా
కేవఁ గలట్టి త్రాటిఁ గొని - కేల్పదముల్బిగఁబట్టి కట్టె వాఁ
గై వడి వెల్లువై జడధి - యై చను ప్రేమ నడంచి రోఁటికిన్

క॥ తపముల జపముల నిష్ఠల
నుపవాస వ్రత విధాన - యోగంబులకున్

విపరీతుఁ డైన హరి గ్రే
నుపకత బంధితుఁడగుట స - మంజసముగదా!

వ. ఇట్లు బంధింపఁ బడియు సబ్బాలకుండు

ఉ॥ కన్నుల నీరుఁ దేఁకు కిను - కన్ గను లెత్తుచుఁ జేముబోఁటు భీ
తి న్నలుసంతఁ జెంపఁడతి - దీనత నార్వుఁటు నొచ్చి డస్సి మొం
దున్నగు మోముఁ బాయుఁతు వి - నోద విలాసము లేటు వీడఁ పొ
తెన్నన రోఁటఁ గట్టఁ బడి - లేకుపతోఁ గపు నక్కజంబుగాన్

కం॥ ఈ వైఖరిని యశోదా
దేవి కనుంగొని మహాన్మ్య - తేజిత మతియై
భావించె నంద నందను
చేవయు సహానము ధృతిఁ బతి - శీలింప నెసన్

కం॥ ఏసో పనిమీఁద యశో
దా దేవియు లోని కరుఁగ - దబ దబ కేఁకన్
బాదముల గొలుసు లూకిచి
రోదనము సెలంగ కిడ్చ్యు - రోఁటిఁ బెకటికెన్

శా॥ ఈ రీతిన్ బెను రోఁటితో సతఁడు - క్రీడింపన్ విలాసమ్ముగా
నా రో లచ్చటి యమ్మనాగముల మ - ధ్యం దోర్గ్లకొం చేఁగ ఘో
రా రావంబున భూరుహ ద్వయము స - స్నై నేలఁగూలెన్ దిశా
వారంబుల్ ఘనఘోషమఁ గ్రిక్కదల - సప్తాంభోనిధుల్ పొంగఁగాన్

మ॥ హరికి న్గట్టిన రజ్జువుల్ దెగియు లూ - ఖ్రగేసరంబున్ భయం
కర వృక్షార్భటి బ్రద్దలై తత తరూ - ఘాటంబునన్ భూమి బొం
గరమై దిర్ఘిర సంచలించినను సింగారంబు పొంగార ముం
గురులం దిద్దుచు శౌరి నిల్చెఁ దరు శా - ఖోత్థాయియై ధీరతన్

కం॥ చిచ్చర బాలకు కడకు వి
యచ్చర శారూలు లిర్వు - రవనత ముఖులై
వచ్చి నమస్కారంబుల

నచ్చు నపక బూజ సలిపి - యనిరీ వసిదిక

వ. మేము నలకూబర మణిగ్రీవులను సిద్ధులము కుబేర పుత్రులము భక్తవశంకరుండగు శంకరుని కింకరులము. మేమిరువు రొక్కనాఁడు హిమవన్నగంబున నప్పరోంగనల పొందున నమందానంద కందళిత హృదయారవిందులమై యనవరత విహారణంబులఁ బరిభ్రమణం బొనరించి జలక్రీడానోద కౌతూహలాయమాన మానసులమై పంకేరుహాకరంబునఁ గ్రీడించుచుండఁ దోడనే యనంత దేవమునియగు నారదుం డచ్చోటికిఁ జనుదెంచిన మేమిరువురముం దక్కఁ దక్కంగల యెల్లరు జల నిమజ్జనంబు మాని లజ్జచేఁ దమతమ పరిధానముల ధరించి యా మౌనిపుంగవుం జని తల లొగ్గుచుండఁ, మేమిరువురము విశ్రస్తులమై తూష్ణీంభావమున మిన్నకుండుటయు, నాతఁడు గమనించి మాపై నలిగి "మీరు బృందాటవిని యమలార్జున తరువులై జన్మింపుఁడని శపించిన మేము నహంకారముల వీడి వస్త్రధారులమై మగిడిపోయి యా యోగిపుంగవుని శాపోపశమ నార్థమై ప్రార్థింప నాతండు శాంతుండై "శ్రీకృష్ణ పదాహతి స్మీ శాపంబు వోయి యథా స్వరూపంబులు గలుగు" నని సెలవొసంగె నని చెప్పియు వెండియు నిట్లనిరి.

మ॥ భవ పద్మోద్భవ వాసవాదులు భవ - ద్వ్యాఖ్యాను వర్తుల్ చల
ద్భ్రుకుటంబుల్ భవదీయ నిర్మితము లీ - భూతప్రకాండంబులున్
భవ దిచ్ఛా కలన ప్రచాలితము లు - త్పాదింపఁ దూలింపఁ గ
ర్తవు భూభర్తవు సర్వహర్తవును ధ - ర్మత్రాత వీవే కదా!

మ॥ ప్రకృతి శూన్యుండవునై నిరంజనుఁడవై - వాగ్భావనాతీత వి
శ్రుత శుద్ధాకృతివై పరుండవయి తే - జో దుర్నిరీక్ష్యుండవై
తత లోకాకృతిమి తోన్నతుండ వగు నిన్ - త్రైలోక్య సమ్మోహనా
ద్భుత సవ్యార్భకలీలఁ జూచుటను మా - పుణ్యంబు సామాన్యమే!

తే॥ గీ॥ అనుచుఁ బ్రార్థింప నిటుల నా - హరి వచించె

"మీ వృథా గర్వ ముడిగికొన్ - మెలఁగి మనుఁడు
పొంతు మీ రాత్రోకమునకు మీ - పూర్ణ శక్తి
కలిమి" యన వారు వైళంబ - కదలి చనిరి

వ. తదనంతరంబ

సీ॥ చిన్నారి పొన్నారి - చెలువంపుఁ జిన్నది
యన యౌవనా రాధ - నందునకును
గడ గొట్టు చెల్లెలు కని - మాత గతియింప
నంద భృతముగఁ బెంపొందు లేమ
రాధ చంద్రని భాస్య - రాజీవ జనేత్రి
కుటిల కుంతల చాయ - కుచ మరాళ
యాన మృదు మృణాళ - హస్త చక్కని చుక్క
కనకాంగి బింబోష్ఠి - కమ్రనాసి

తే॥ గీ॥ శావిత గంధ ఫలి దివ్య - గగన మధ్య
వీథిఁ గుసుమూప చయ మొన - రించు నంత
భూజ పాతంబుచేకు మూర్ఛఁ - బొంది లేచి
యెలమి హరిసిద్ధ సంవాద - మెల్ల వినియె

మ॥ వినికోమోగ్గమనాంగియై - వివశయై ప్రేమామృతార్ద్రాత్మయై
ఘన హర్షాశ్రు పరీత లోచనయునై - జ్ఞానాంకుర ప్రాప్తయై
ప్రణుతాత్యంత నిగాఢ భక్తి రస పూ - ర్ణ స్వాంతయై యొప్పె ప్రా
క్తన కర్మ ప్రతిభాసి శేషమున రా - ధా దేవి నిశ్చేష్టయై

క॥ మ్రొనువడి యరయఁ గాఁ దన
మేనల్లుండయి హరి జని - యించుటకై యు
త్పానంద భరితయై నిజ
మానసమునఁ దలఁచె నిటు లమంద ప్రీతిన్

సీ॥ శుష్కోపవాసాది - నిష్కామ నియతుల

ప్రీతములఁ దపములఁ - బడయు ఫలము
ఆమ్నాయ ధర్మ వే - దాంత తత్త్వాలోడ
నైక సత్ఫలత సా - ధించు ఫలము
అనవరత ధ్యాన - యమ నియమ సమాధి
యోగ నిమగ్నత - నొందు ఫలము
జ్ఞాన మార్గ విహార - కర్మ యోగా సార
సంచార పరతఁ బ్రా - పించు ఫలము
తే॥ గీ॥ ఆశఁ బోఁదీర్ఘ మెసరయి - యబ్బి నట్టు
కొంగు బంగారమై యొన - గూడి నట్టు
నీ పరాత్పరు నమ్మి సే - వించు కతనఁ
బడయఁ గల్గును జన్మ సా - ఫల్య మగును. ౧౫౦
మ॥ అనురక్తిన్ జెను భక్తి నీ ప్రభుని పా - దాబ్జ ద్వయిం గొల్వఁ జూ
డను బంధమ్ముల, బంధువర్గములఁ గ - ష్టంబైన నా వంతఁ జూ
డను, సంసారముఁ జూడ నైహికము లా - టంకమ్ములం జూడఁ జూ
డను నా సౌఖ్య, మభీష్ట మెంతయుఁ బ్రహృ - ష్ట స్వాంతుఁ జేతున్ హరిన్.
క॥ అని నిశ్చయించి రాధిక
చని కృష్ణు సమీపమునకుఁ - జాగిలి పరిరం
భణ మొనరించుచు నిష్కా-
రణ రాగము భక్తిదోఁప - రాల్చె మునుసురిల్. ౧౫౨
వ. అంతలో
ఉ॥ దిమ్మర పోయి యీయాధ్వనికిఁ - దెల్పి యొకింత వహించి లేచి బం
ధమ్ముల నున్న బాలు వచ - నంబ స్మరించి యశోద సంభ్రమ
మ్మమ్మమకార దుఃఖములఁ - బొంది పడిం గనుఁ గొన్న నెచ్చటన్
గిమ్మన కుంటఁ జూచి, పరి - కించెను గూలిన చెట్ల దిక్కునన్ ౧౫౩
తే॥ గీ॥ ఆ నిపతిత భూజముల మ - ధ్యను విభిన్న

మగు నలూకలమును గని - వగపుఁ జెంది
పొగులు నంతలో రాధిక - భుజము మీఁద
నెత్తి కొని తెచ్చి యర్పించెఁ - గృష్ణు జిష్ణు ౧౫౪

తే॥ గీ॥ రాధ వలన నాలించి స - ర్వము యశోద
నిక్కమని యెంచె గర్గ మ - హీంద్రు సూక్తి
అంతలో నందుఁడును గోకు - లాధి వాసు
లెల్ల రరుదెంచి కాంచిరీ - దృశ్య మెల్ల. ౧౫౫

వ. కని యత్యద్భుత విస్మయాత్ములై

సీ॥ గోకుల మీనాఁడు - గోపురాధిక మయ్యె
గోపాల బాల వి - కుంఠ మగుట
బృందావనము నేఁడు - బృందారకా వనం
బయ్యె గోవింద పా - దాబ్జ భూతి
ఘోష నిర్ఘోషమై - ఘోషఁ జెందదు నేఁడు
పతిత పావనుని యా - వాస మగుట
మనమంద లెబ్బులి - మంద మ్రింగదు నేఁడు
హరి కిశోర విహార - పరత నుంట

తే॥ గీ॥ మనకులం బాకులము వీడి - మనును కుల న
గ ధృతి నమర కులముఁ బాసి - కనికరింప
నేఁడు నందనందనుఁ డంచుఁ - బాడి రంత
గోపికా గోపకులు నాఁడు - గోకులమున ౧౫౬

వ. ఆదినమునుండి దినదిన ప్రవర్ధమానంబులై రాధా కృష్ణా నురాగ వ
ల్లరు లనఁగి పెనఁగి పెను పొందుచుండ

సీ॥ జీవికా జీవుల - భావంబును వహించి
చంద్రికా చంద్రుల - చందమునను
పట వర్ణముల భాతి - భాజ్యా దు స్తరులయి

పూఁదావుల క్రమంబుఁ బొంది పొసఁగి
ఆకాశ ఘటముల - యట్టు నన్యోన్యములై
తేజోఽర్కుల వలె భే - దింపఁ బడక
అల గుణీ గుణములై - విల సిల్లి జీమూత
విద్యుల్లతల భాతిఁ - బెనఁగి యనఁగి
తే॥ గీ॥ శర్కరా శుద్ధ జలముల - సదృశ మనను
గలసి మెలసి యెయ్యెడల - నొక్కటిగ మెలఁగి
రెలమి నవి భాజ్యులై మేళ - వించి పూర్వ
కృత ఫలమ్మున రాధికా - కృష్ణు లంత ౧౫౯

వ. అనన్య సామాన్యాగ్రగణ్యా మూల్యారాధికా భక్తి విశేషంబున భక్త వశం వదుఁడగు నమ్ముకుందుండును ౧౬౦

మ॥ పతియై, భూపతియై, త్రిలోక పతియై - భావింప శైలాత్మజా
పతియై, మా పతియై, రతీ పతియునై - ప్రార్థింపఁగా భారతీ
పతియై, సర్వ పతిత్వముం బడసి భా - వ ప్రాప్త నానా విధా
కృతియై రాధికఁ దన్పి ప్రోచె హరి శ్రీ - కృష్ణ స్వరూపంబునన్

వ. ఆ రాధయు.

ఉ॥ లోకము విస్మరించి యను - లోక భయంబుఁ త్యజించి యూఁడు నా
లోకుల వాదు లోర్చి తన - లో నిలలోఁగల లోన సారసా
లోకను జూచి రాధిక వి - లోకనఁ జేయుదు లోకవృత్తి ము
ల్లోకము లెత్తి వచ్చినఁ డి - లోక విభూతులు డాసివచ్చినన్

వ. ఇట్లు దివసంబులు గడచి చనుచుండ నొక్కనాఁడు ౧౬౧

చ॥ బిర బిర రాముఁడున్ మఱియుఁ - బిల్లలుఁ గొందఱు నయ్యశోద ద
గ్గర కరుదెంచి "తల్లి యిటుఁ - గాంచుము కృష్ణుఁడు వెన్న మీఁగడల్
పెరుగును బాలు మాకునిడి - వేదుకఁ జెందిన రీతిఁ బోయి యొం
టరి నొకచో వసించి వికటంబుగ మన్ను గ్రసించె నమ్మరో!॥

వ. అనిన బాలురతోడ నయ్యశోదయు

క. పరువిడి మృద్భక్షణమును
జరిపెను నా కృష్ణుఁ గాంచి - సంభ్రమమునఁ ద
త్కరములను బట్టి కరములఁ
గర మనురాగమునఁ బలికెఁ - గనికర మొలయన్ ౧౬౬

క॥ వెన్నయు మీఁగడ దంగెడు
జున్ను నపూపములుఁ బండ్లు - నూడిద లెన్నో
యున్నవి వానిని నొల్లక
మన్నుం దినఁ బాడియే? కు - మారా! యనినన్ ౧౬౭

క॥ వెన్నుఁడు నగి యిట్లనె "నే
పున్నెము నన్నమ్మ నెఱుఁగ - బూటకమున కీ
తెన్నున నాపై వీరలు
పన్నిరి మన్నేడ" నంచు - వాతెఱఁ దెఱచెన్

శా॥ ఆలోఁ గాంచె యశోద సర్వ తత పారావార వాః పూర న
ద్వేలా ముద్రిత శైల కానన సరి-ద్భీమ ప్రవాహ క్షమా
జాల ద్యో విచల ద్దివాకర నట-చ్చంద్రోజ్జ్వల త్తారకా
ఖేలా లోల మరు త్ప్రకాండ మనురో-ద్విగ్నంబు బ్రహ్మాండమున్

వ॥ కని విభ్రాంత చేతస్కయు భయ విహ్వలయు నత్యాశ్చర్య మగ్నయు
నై యిట్లనియె

మ॥ ప్రచలత్సర్వ జగత్సమత్కరమునూ - ర్వ్యాది గ్రహానీకమున్
సచర ద్భూత విముచ్చరాసురులు నా - శా పాలకుల్ దైవత
ప్రచయం బీతని కుక్షి గుప్తములు నా - భాగ్యంబుచే నీ జగ
ద్రచనా పాలన నాశనాధిపునిఁ బ్ర-త్యక్షంబుగాఁ గాంచితిన్

ఆ॥ వె॥ మన్ను దిన్న నన్న - నన్నుఁ దన్నెఱుఁగంగఁ
బన్నెఁ గాక కన్నె - తెన్ను మిన్న

మిన్ను మన్నుఁ బన్ను - వెన్నన కెన్నఁగా
మన్ను దిన్న జన్ను - దిన్న నేఁడు?

వ॥ అనుచు నాఁటనుండి బాలకృష్ణుని లీలా మానుష విగ్రహునిగా భా
వించుచు భక్తిరస పూరితాత్ములై కాలంగడుపుచుండ.

చ॥ కడచెను కొన్ని నాళ్లు కుతుకంబునఁ గృష్ణుని కేళిఁ గొన్ని పై
బడెఁ బసు కాపరుల్ నిలువ - నాటికిఁ గోపకులని పోవఁ గృష్ణునిన్
జడియక యా యశోదయును - జంటగ రామునిఁ గూర్చి పంప నం
దుఁ డనుమతించె నందుల కనుంగుగ గోవుల మేఁపఁ బోవుచున్

క॥ గొల్లల సంగడి తనమునఁ
బిల్లనఁ గ్రోవియును నడుమఁ - బెట్టుక తెఱఁగు నా
లల్లన గాచుట యతనికి
మెల్లఁగ నభ్యాసమాయె - మీటె సితకలన్ ౧౭౩

వ॥ అంత ననుదినంబును

సీ॥ పొద్దు పొద్దున లేచి - మొరయించు మురళిపై
సుద్దులఁ బద్యముల్ - ముద్దులొలుకఁ
గాల్యముల్ దీర్చి వాత్సల్యంబున యశోద
తల దువ్వి సిగ వేయు - జలకమాడఁ
జేరువఁ గూర్చుండి - చెలఁగ రాధిక పాడఁ
గిలకిల మనుచు నో - గిరము మెసవుఁ
దల్లియు మేనత్త - తవిలి యద్దముఁ జూపఁ
దోడవిన దోడవులఁ - దొడిగి కొనును

తే॥ గీ॥ శిరము మూరుకొని యశోద - మురిసి కొనఁగ
గల్లములు గిల్లి ముద్దిడి - కౌఁగిలించి
యుల్ల సిల్లంగ రాధిక - యిల్లు వెడలుఁ
గృష్ణ పరమాత్మ మురళి మ్రో - గించు కొనుచు

వ॥ మఱియు

సీ॥ పిల్ల గాడ్పులఁ దూఁగు - పిరిచెంపు మిలమిల
లక్షణోదయ చ్ఛవి - నతిశయింప
ముద్దు టురంబునఁ బొల్చు - పచ్చల దండ
యినకర ద్యుతుల నీ - రెండ లీన
మురళి నటించు కె - మ్మోవిఁ గేల్దమ్ములు
సంధ్యారుణిమ గేలి - సలిపి వెలుఁగ
లేమొండ యండ మే - లిమి జరీ హారాం బట్టు
పచ్చని పుట్టంపుఁ - బ్రతిభ మెఱయ

తే॥ గీ॥ సన్న నునుఁ జిన్న కోల డా - చంక వెలయఁ
బెళుకుఁ దళుకు గొ్రింబావల - మెలఁగి కులుకు
నడుగుఁ దలిరుల లత్తుక - లడరి తనర
వెన్నుఁ డొయ్యార మెసలార - వీధి నిలుచు ౧౭౫

చ॥ నిలిచి, విలాస లాలిత ము - ఖోన్నమిత స్ఫుర దంగుళీయ కో
జ్జ్వల మృదులాంగుళీ భరిత - చారు హిరణ్మయ వంశ నాళికో
చ్చల దమలాతి పేశల వ - శంకర పంచమ మాధురీ స్వనం
బులు వెదఁజల్లు నద్దెసలఁ - బొంగి పికమ్ములు మూఁగ వల్కుఁగన్

శా॥ ఆనన్న స్వని వత్సము ల్నెగసిరా - నా వత్సముల్ వెంట రా
గో సంఘంబులు గోవులన్ గదిసిరా - గోపార్భకుల్ వారితో
డై సాగన్ వెను ముట్టి గోపకులుఁ దో - డై జాగిలంబుల్ గరం
బాసక్తిన్ బిఱుదంటి రాఁ గనుల విం - దౌ మందయాన నందజున్

వ॥ అయ్యవసరంబున.

సీ॥ ఊరుఁ గాయల గుచ్చి - మోరునఁ బొదవిన
చలిది మూటలఁ దెచ్చి - వెలఁదు లీయ
నుదుటఁ గుంకుమ పెట్టి - కదలు నాలకు నారి

తేరిన వైదుష్యల్ - వారు వోయ
బారులు దీరి ని - వాళించి యేకమై
పడుతుకల్ గోరక్షు - బాడి యాడ
పులకిత గాత్రులై - పొంగి గంతులవైచి
గోపకు లెల్లరు - గొమ్ము లూద
తే॥ గీ॥ మోదమున నాలు లేగలు - మోజలెత్తి
పనివి యొసరించు సంభార - వమ్ము లెసఁగ
మంద కాపులు సూచి యా - నంద మంద
గాపరులు తోడు రా మంద - కదలి చనును ౧౮౩

క॥ బాలకుఁడై నను మందకు
బాలకుఁడౌ నందునకును - బాలకు డౌటన్
బాలకు వలెఁ గాంచిరి గో
పాలకు గోపాలుఁ డను శు - భస్థితి గోపుల్ ౧౮౪

వ॥ ఇట్లు సుఖంబుగఁ గొంతకాలము గడచి చనునంత న మ్మధురాపురం
బునఁ గంసుఁడు.

మ॥ అనిమేషస్థితిఁ గాంచుఁ దా నను నిమే- షాపాయ మూహించి మా
రణ దృశ్యంబులఁ గాంచు నా హరి కుమా - రాదర్శ తేజోతిచిం
తను జింతించును సంతతంబును విము - ధ్యానంబుఁ జింతించి భో
జన సమ్మార్జన మజ్జనా ద్యవసర స్వాస్థ్య క్రియా హీనుఁడై
సీ॥ కనుమూయు నంతలో - దను జారి తన మీఁదఁ
గను బ్రామి పక్షి - నట్లు గలవరించు
ఎదుటి కెవ్వరు సన్న - మద మీది కెవ్వని
వనమాలి సెవనుంచి - పలవరించు
వారి జాక్షులఁ గన్న - వారి యక్షుల దండ
వారిజాక్షుఁ దలంచి - భయము నించు

రథ చక్ర యోధ చ - క్రంబులఁ గని చక్రి
తలఁ దుంచుమని మదిఁ - దత్తరించు
తే॥ గీ॥ భోగముల మాట విడనంత - భోగిశయను
యోగముల నంది సెవి సోఁక - యోగ భోక్త
స్మరణతో సిగ్గుచేఁ దగ్గి - శిరము వంచు
నంశమంబునఁ గంస - నృశంసుఁ డకట
తే॥ గీ॥ ఇటుల నిమిష గండమ్ముల - నెన్నొ గ్రుచ్చి
తక్కొన దుర్భరంబైనఁ - దుస్తి తపడసు
బాల మానస మార్గమ్ములఁ - బడయు కొఱకు
గుప్తముగఁ గూడబెట్టి నోటఁ - గూర్చి యుంచు ౮౯
క॥ వనచర గోపాలురతో
వన చరుఁడై మెలఁగు చున్న - వనమాలిని సం
హానన మొనర్చు సమర్థులు
వనచర రూపముఁ దాల్చు - వారని చెప్పన్
వ॥ అట్లు గూఢ సమాలోచనంబునఁ గావింపఁ బడిన నిర్ణయాను సారంబు గఁ గంసుండు తన గూఢచారుల నాడు నాడులకుఁ జాటఁబంపి " కానన సత్త్వ రూప ధారణ సమర్థులై తనజీవ హరణార్థమై వేచియున్న యదు తనయునిఁ దునుమఁగల దనుజునకుఁ దన రాజ్యంబున సగబా లొసఁగు దు నని ప్రకటింపించిన. ౯౦
క॥ చనుదెంచిరి మధురకుఁ గం
సుని భయమును బాపి దైత్య - సూదను నసులన్
గొని మెప్పు వడయఁగా బహు
దనుజులు బహుదూర విషయ - ధాములు గడఁకన్ ౯౧
వ॥ వారికెల్లరకు స్వాగతం బొసంగి ప్రత్యేకంబగు వసనంబు లేర్పఱచి భోజన మజ్జనాది నిత్య కృత్యంబులకును సమస్త భోగంబులకును నవకాశమ్ము

లు గల్పించి వలయు సేవక సివహంబులఁ గూర్చి నిత్య భోజనంబులకుఁ ద
గిన ద్రవ్యంబుల సమకూర్చి

క॥ ఇంతటి ఘన నిష్ఠాతలు
పంతంబుల నన్నుఁ బోవ - వచ్చి రటంచున్
జింత విడనాడి కంసుఁడు
సంతసమున నోడలు మఱచి - చరియించు నెడన్. ౧౯౩

వ॥ అందు సత్కళారణ్య నివాసియు నానా మృగయావ ధారణ సమర్థుం
డును నందఅకంటె మున్నరుగుదెంచి వేచియున్న వత్సాసుర నామ ధే
యుండు కంసునొద్ద కొక్కనాఁ డరుదెంచి యిట్లనియె.

శా॥ రాజా నా ప్రతిభా విశేషమున నీ - ప్రాణానిలా కర్షకుం
డై జన్మించిన కృష్ణు గృష్ణుఁ దుష్టిటి మా - యాభ్రాంతుఁ గావించితో
జ్జైజేజే 'జే' యన నీ యశోలత జగ - జ్జేయు మానంబుగా
నాజిం గూల్చెదఁ బోయి వత్స సెలవి - మ్మా బృందకుఁడ మందకా.

తే॥ గీ॥ అనినఁ గంసుండు వానితో - ననియె నగుచు
వంత వాఁడవ కాని యా - యర్భకుండు
సులభ సాధ్యుఁడు గాఁడు నీ - తెలివి తేట
లను బ్రయోగించి నను సఫ - లతఁ వహింతు. ౧౯౪

వ॥ అనిన నావత్సాసురుండు. ౧౯౫

క॥ మాటల వేటికిఁ? గనినా
పాటవమును ధాటి మేటి - బలిమిని నీవే
చూచెద వోరులకుఁ బోయెద
నేటికి సెలవొసఁగు "మనుచు నిజగతిఁ జనియెన్. ౧౯౬

వ॥ అచ్చటఁ గృష్ణుఁ డానాఁడు వేఁకువ మేల్కని, వైశంబ నిత్య కృత్యంబు
లఁ దీర్చికొని తనయన్నయగు రాముండు ముందు నడవ గోపాళ్ళ సలంగు-
డి గోవుల మేఁపఁబృందాటవికిఁ జనుదెంచి యాలను వత్సంబులను మేఁతకై

విడిచి తోడి చెలికాండ్రఁగూడి ౧౬౮

సీ॥ గోపాలు రవశులై - కుతుకాబ్ధిఁ దేలియు
ట్టూతలూఁగఁగ వేఁటు - పురందియాడి
పంచాస్య దిగ్భ్రమ - పాడితనహా లీల
సరసనృత్యంబులు - సలిపి సలిపి
వనలక్ష్మి నగి ప్రీతి - ధ్వనులీన మార్దన
ఫణితి గీతిక లోలిఁ - బాడి పాడి
కమల జాకరలీన - కమనీయ మూర్తియై
హేళి జలక్రీడ - లాడి యాడి

తే॥ గీ॥ సరభస చలన్మరు ద్వార - పరి వృతుఁడయి
తుష్టి హృష్టాత్ముఁడై పోలి - తూఁగితూఁగి
దివ్య వనచరా కర్ష కో - ద్దీప కుఁడయి
యటవి నంద నందనుఁడు వా - హ్యాళి సలిపె. ౧౬౯

ఉ॥ అత్తఱి వత్సదైత్యుఁడు ని - జాసుర మాయను వత్స రూపమున్
హత్తి నదిం దరించి మను - జార్భకుఁ డౌహరిఁ గాన బృందఁ బెం
ద త్తరఱపాటు దోఁచఁ బలు - తావుల ద్రిమ్మరి యొక్కచోట నే
కత్తఁగ హర్ష సంభ్రమము - లిమ్ములఁ గాంచెను విష్ణుఁ గృష్ణునిన్

ఉ॥ కాంచి నిగూఢ వేషమునఁ - గానన భూజ పరీత భూములన్
బొంచి తటాలునన్ గవిసెఁ - బూరి గ్రసింపఁగ మెల్ల మెల్ల నే
తెంచిన లేఁ లన్ సరసిఁ - దేలుచు నాడెడి శౌరి తక్క నే
కొంచెపు సంశయ స్థితిని - గోపకు లొందరు నెమ్మనమ్ములన్,

ఆ॥ వె॥ మాయ రూపు దాల్చి - మాయావి దనుజుండు
మాయ లెన్నొ పన్ని - మాయఁ జేసి
మాయ దారులను య - మాలయంబున కంపు
మా పతిని పథించు - మనుత వచ్చె

ఉ॥ శృంగము లేర్పడంగ నిజ - రింఖల సంగతి నింగి కార్చి యు
ప్పొంగుచుఁ జెంగలించు వెల - బొంగరముం బలెఁ జెంగు చెంగునన్
రింగునఁ జుట్టు ముట్టుచు గడి - మిగ్రింగచు రంగు హొంగు మీరు సా
రంగపుఁ బోకడన్ గను తె - అంగున వత్స సురారి పొంగుచున్

వ॥ అంత

ఉ॥ దాని విలాస విభ్రమము - దాని మనోహర మంజులాకృతిన్
దాని వినోద వృత్తమును - దాని మహాద్భుత చేష్టితంబులున్
దా నిజ మానసాధ్వమునఁ - దామర సాక్షుఁ డెఱింగి వెంటనే
తానము మాని గోపక వి - తానము నోమగ డాసెఁ దీరమున్.

వ॥ ఇట్లు కమలాకర బహిర్గతుండగు కమల నాభసఖుఁడు కనుసీయ విమల భూషణాంబరంబులఁ దమకంబున ధరించి శ్రీ మాకలితుండయ్యు నమరా తి సమయ విఘాతం బొనరించి యమ నదన గతుం గావించు నియమంబున

సీ॥ పులకాంకి తాంగమై - పొంగి వాలములెత్తి
నిక్కించి చెవుల గో - నికరము లుచయ
"అంభా" రవమ్ముల - నాల కెన్నంటగ లే
గలు మోరలెత్తె - మువ్వలు ధ్వనింప
కోలాకుల నాడు గో - పులు తన్మయతఁ బారి
చెలఁగి కేరింతలఁ - జిందులేయ
మంద కావరులయ్యు యం - దంద మొఱఁగొఱఁ
భైరవమ్ములు పార - పశ్యమొందఁ

తే॥ గీ॥ కూర్మి మృగచయ రవములు - మారు మొఱయు
కాననంబెల్ల నిస్తబ్ధ - గతి వహింప
సంచర ద్విహంగములు ని - శ్చలతఁ గాంచ
లాలితంబగు వశ నా - శంమ్ము నూఁదె 202

క॥ వత్సా సురుండు నసరిగ

తోత్సాహము గ్రమ్ముకొనఁగ - నోడలు పాటించి కెం
చి త్సమయు ముండి నిజ సను
యోత్సేకము సంస్మరించి - యోపిక తోడన్ ౨౦౭

కం॥ దిగ మ్రింగి పారవశ్యత
విగళిత వాత్సల్యుఁడై య - భీతి ముకుందున్
దెగ వ్రేయు నదనుఁ జూచుచుఁ
బగఁ దీర్చుకొనంగఁ జేర - వచ్చె గపటియై. ౨౦౮

ఉ॥ చేరి ముకుందుఁ డాసి ఖర - శృంగ విఘట్టిత భూ పరాగుఁడై
పాఱుచుఁ జేరఁ బోవు మఱి - బాఱుచుఁ జేరుచుఁ గూడి వీడుచున్
మోరను మీఁది కెత్తుచు యదు - పుత్రుని నాఁకుచు జిహ్వ సాఁచి యా
భీర కుమారు సట్లొ మఱ - పించి పళింపదుఁ జేయు పూన్కితోన్

వ॥ అంత

ఉ॥ పిల్లన గ్రోవి నాఁపి యదు - వీరుఁడు "గోపకులార! కంటిరే!
మెల్లఁగ నిల్లువీడి మన - మీఁది యకారణ మైన ప్రీతి వ్రే
పల్లెకు వచ్చి యద్వగత - బాధల కోర్చియు నన్నుఁ జేరె నీ
వెల్లని లేగ యియ్యది య - భీష్ట తమమ్ముగు నాకు నెంతయున్

కం॥ అని దానిఁ గదిసి నిమురుచు
బుజ్జుకుచు వాలంబు శిరము - మూఁపురమును జి
హ్వాను శస్త్ర హస్త లాఘవ
మును బ్రకటించుచును లాగి - మోదెఁ గరములన్

మ॥ ధరణిన్ వత్స సురారి కూలె నిజ దై - త్యాకార ముప్పార ది
గ్దిరిఁ దగ్గాడుచు నార్చుచున్ రుధిర వా - రిం గ్రక్కుచున్ వేగ ము
క్కుఱముల్ పెంటనసుల్ దలం - గఁ బుల కాంక్ష ప్రాప్తులై గోపకుల్
కెలఁక గందన్ హరి వాస చంద్రికలు న - ల్దిక్కుల్ ప్రకాశింపఁగన్

వ॥ అంత గోపకులు

సీ॥ వత్సను గూల్చుట - వాత్సల్యమూ! భక్త
వత్సల నామ! శ్రీ - వత్స ధారి!
వర దైత్య పటలికా - వర మడఁగించితి
వరద! సద్విరుదాంక! - ద్విరద వరద!
భీకరంపు రక్కసు - భీరుఁ గావించి తా
భీర వృత్తిఁ గడవె గం - భీర వీర!
అభయుఁడ వసురున - కభయ మొసఁగవు నీ
వభయము హస్తుఁడవె సిం - హాభ శౌర్య!!
తే. గీ॥ లేఁ గొమరు బ్రాయమందు బ - లే! గరువపు
లేఁగఁ దోలి వేల్పు జీవము - లేగ జముని
గవని కంపితి మేలులే - గరుడ గమన
యనుచు నెక వక్కియము లాడి - యాడి రంత
ఆ॥ వె॥ వత్స దనుజ మారణ - వార్తను గొంపోయి
గూఢ చరులు కంస - కువల యాధి
పునకుఁ దెలుప నతఁడు -పొంపిరి వో బక
సంజ్ఞ దైత్యుఁ డొకఁడు - సాఁగి వచ్చి ౨౧౭
క॥ అకలుష మగు నిజ శౌర్య!
ప్రకటన మొనరించి కంసు - భయ మపనయ ము
త్సుకతయుఁ బొనరిచి చనె బృం
దకు నఘుఁడను సోదరుండు - దనతో రాఁగా ౨౧౮
తే॥ గీ॥ సోదరుని నఘాసురు నొక్క - చోట నిల్పి
చొచ్చి బృందావనం బొక్క - చోట వత్స
సురభులను జూచి రొుక సర - స్సు నటఁ గాంచి
కృష్ణుఁ డరుదెంచు నటకని - యెంచి నిలచె
చ॥ నిలిచి బకా సురుండచట - నేత్రయుగంబును మూసి చిత్త ని.

శ్చలత నిరంత చింతన వ - శంబునఁ గృష్ణు బవిత్రమూర్తి హృ
జ్జలజము నందుఁ జేర్చికొని - సర్వ జగంబును విస్మరించి యి
మ్ముల సహించుచు యోగివలె - శీతలిక నాతప మారుతమ్ములన్

వ॥ అచ్చట నా గోపాలుండు గోపాలురతో బృందాటవిం గల కొండొక
కొలఁకు కెలంకున నున్న గొప్ప వటవృక్ష చ్ఛాయయందు

సీ॥ "నాయెద్దుఁ గూర్చుండు మా - యోగి రమున" కం
చను నికేతనముఁ బిల్చు - లంది కొనుచు
"వెన్న మీఁగడఁ జున్ను - లున్న నాహ్వానింపు"
డని పిల్పుఁ బణము వె - లార్చు కొనుచు
"మోహిని వైన మా - ముద్దు లివే" యన్న
నాడుచు మేలమ్ము - లాడు కొనుచు
నా వంకఁ జూచిన చో - వద్దు "నీముద్ద
నేఁగెద" నని పిలి - పించు కొనుచు

తే॥ గీ॥ "కనులు మూసికో వచ్చెద" - ననుచుఁ బోయి!
తినుచు నవ్వుచు నాడుచు - మునులు దివిజు
లచ్చెరువు నొంది చూడ న - య్యాగ భోక్త
యదుసుతుఁడు చల్దు లాఁ - కొని యారగించె ౨౨౨

వ॥ ఈరీతిఁ గోలాహలంబుగఁ గృష్ణుని తోడ ౨౨౩

క॥ గోపకులు చలిదిఁ దిని తృ
ష్ణా పాదితు లై తటాక - జలములకై పోఁ
జూప ముకుందుఁడు వారల
నాఁపి నడచి ముందునకు బ - కాసురు డాసెన్

ఉ॥ డాసిన నా బకాసురుఁడు - డగ్గఱి చంచువు నెత్తి విచ్చి యు
ఛ్ఛ్వాసము వెల్వడంగ భయ - సంభ్రమ కోప మహోద్భతేద్ధ సం
తోషము లుల్లసిల్ల ముఖతో - యజ మందున నార్చి మ్రింగె సం

త్రాసము నొంది గోపకులు - శ్రద్ధయు నొగ్గ సహిష్ణుఁ గృష్ణునిన్

ఉ॥ మిఁగిన వాము నాంగనుసు - మేదుర లీలను జెంప నాతనిన్
మిఁగక క్రిక్కినన్ గదిసి - కృష్ణుఁడు చంచుపు లాగిపట్టి యా
కొంగను బొంగిరమ్ము వలె - "గో" యన దిర్దిరఁ ద్రిప్పి త్రిప్పి వే
యంగ ధరాస్థలిం బడి బ - కాసురుఁ డీల్గెఁ బరిభ్రమించుచున్

వ॥ ఏత త్పరిసర ప్రాంతంబుల దాఁగి పొంచియున్న బకాసుర సహోదరుం డగు నఘాసురుండను గోపాల గోపకుల పథి నిరోధము సేయ నుంకించి.

క॥ బకు సోదరు గతిఁ గాంచియు
భ్రుకుటీకృత వదనుఁడగుచుఁ - బూర్ణాగ్రహుఁడై
వికృతుండై యజగర రూ
పకుఁడైన యఘాసురుండు - వడవడి వచ్చెన్

ఉ॥ గుట్టవలెన్ బ్రవర్తిలును - గొంచెము సేపరయంగ జొంపవకా
చెట్టు వలెన్ గనంబడును - జేరి కనుంగొన ఘోరమైన పెన్
బుట్ట వలెన్ విరాజిలును - బోయి పరీక్షను జేయ నల్ల తా
గట్టు విధానఁ దోఁచెడి న ఘాసురుఁడధ్వ నిరోధ గామియై

తే॥ గీ॥ పవన భక్షణా సక్తి వ్యా - పార ముక్తి
నిరత గోవింద పదరక్తి - నియమ యుక్తి
నతుల శక్తిని ననఘుఁడై - యఘ సురారి
పరమ పదమొంద నజగర - ప్రతిమఁ బూనె  ౨౩౦

వ॥ ఇట్లు ఘాసురుం డజగరంబై మార్గంబున కడ్డంబుగాఁ బడియున్న సమయంబున శ్రీకృష్ణ సమేతులగు గోపాలురు  ౨౩౧

ఉ॥ పాడుచుఁ గృష్ణ లీలల న - పారము దంబుధిఁ దేలి యాడుచున్
గూడుచు బర్వులెత్తి యొక - గుంపుగ సందడి మూగి వీడుచున్
వాడుచు క్షుద్దవాగ్ని హరి భ- వ్య కటాక్షముఁ గోరి వేడుచున్
మూడుచుఁ గ్రోధ దీప్తి నరు- ణ ప్రతి వీక్షణుఁ దైత్యుఁ డాసినన్

తే॥ గీ॥ అఘుఁడు నిజ ముఖ గహ్వర - మట్లు తెఱచి
వారి కభిముఖుండై పడి - యారఁ గప్ప
దనుజ మాయ నాకర్షించి - తనువుఁ బెనిచి
గోపకుల మిగిలంగ నతఁడొక - గుటక లోన ౨౨౩

ఛ॥ ఇది మునుపే యెఱింగి క్రమ - మేర్పడఁ జౌహరి వెన్క నక్కు దు
ర్మదు నను దైత్యు గోపకుల - గ్రాసిన మొసర్పగ నిచ్చి యమ్మహా
వదన బిలంబుఁ జొచ్చి నిజ - వామన దేహము బెంచి పెంచి భీ
ష్మోద భుజగాసురుఁ దునిమి - వల్లవ బాలురఁ బ్రోచె ధీరుడై

ఉ॥ ఈవ్విధ మేయు భవ్య సప - దృశ్యము గోపక జేగి ఘోషలో
నూఁదిన నూర నన్న జను - లుత్సుకతిన్ బయివెత్తి వచ్చి శం
ఖాది నినాదముల్ సెలఁగఁ - గాఁ గరదీపికలున్ జయధ్వనుల్
రోదసి నావరింప బహు - ళోత్సవముల్ ఘటియించి రర్థిమై

వ॥ ఆ సమయంబున గోకులవాసులెల్లరు నంద గృహ ప్రాంగణంబున గుములు గట్టి కూడి

సీ॥ ముత్తైదువులు వచ్చి - మోముఁ గుంకుమ మెత్తి
యిచ్చిరా రతుల దీ - వించి మించి
మంద కాఁపులు సాగి - ముందున కరుదెంచి
యాఁకగిరి పూదండ - లురలి కొలిచి
గోపిక లొగి జేరి - కోలాట మాడి కీ
ర్తించి రసుర వైరి - నెలమి కలిమి
భజనల సలిపి గో - పాల నాటక మెల్ల
నాడిరి పకు - లాడి పాడి

తే॥ గీ॥ ప్రీతి సమ్యగలంకృత - పీఠమందు
సోఁకు మూఁకల గొంగ గూ - ర్చుండఁ బెట్టి
రక్ష దీయించి శ్రీరామ - రక్షఁ బాడి
కలసి యీఁదిరానంద సా - గరము కరము ౨౩౨

ఉ॥ కొందరు మందబుద్ధులు ము - కుందుని లీలలు హింసలే కదా
యిందుల కీశ్వరుండను జని - యించునె? కోరిక నేయరల్ మృతిం
బొందరె? హింస మాని హిత - బోధ మనః పరివర్తనంబుఁ జే
యం దగదే? వధించుట చ - రాచర రక్షకు నిద్ధ ధర్మమే?

తే॥ గీ॥ అని కుతర్క గతుల విమ - ర్శనము సేయు
పండిత మ్మన్యు లీనాఁటఁ - బ్రబలి యుండ
వారి సంశయములఁ బాపి - వాసుదేవు
కథను సాగించు టరయ సు - కరము కరము.

ఆ॥ వె॥ ఒరుల కగ్గుగాక నిరుపద్రవంబులై
ప్రాప్త కర్మ ఫలిత - పరతి సతము
జీవితమును గడుపు - జీవులకును బూని
చెటి నొనర్చు హింస - నింద్య మండ్రు ౨౪౨

క॥ పర పీడన మొనరించుచుఁ
బర హింసా పాదనమునఁ - బ్రదికెడు బర దు
ర్భర సత్త్వములకు నిజ జీ
వ రక్ష నొనరించు హింస పాపం బగునే?

ఉ॥ పర పరిపీడనం బనయ - వర్తన ధర్మవినాశనంబు ము
ష్కర దురిత ప్రచారముచు - సాధు జనార్తిఁ బొనర్చు క్రూరునా
మరుని దురాత్ముఁడో ఖలుఁ బ్ర - జోద్ధరణార్థమనిక్కీ వధించి సం
బరమును గూర్చు టెంతొ యతి మానుష కృత్యము గాని హింసయే

తే॥ గీ॥ భువన కంటకు లైన దురా - పూతనా శ
కటసురారి తృణావర్త - చటుల వత్స
బక సురార్య ఘోన్మథన డిం - భకు జగదుప
కార లీల లమానుష - గతులు గావె? ౨౪౩

ఉ॥ కొందరు సాత్త్విక ప్రియులు - "క్రూర మృగంబులు గూడ శాంతముం

బొందు దయార్ద్ర భావమును - బూనిన సందున గాని యోగ శ
క్తిం దనరారి మాయల ని - కృష్ట నిశాచర యుక్తి నున్న వా
రిం దలలొగ్గఁ జేయఁగ వ - రిష్ఠ మునీంద్రుల కేని శక్యమే?

సీ॥ లోక మానుషులకు - లోఁబడి నప్పుడు
ధర్మ పరుల యండ - తఱిగి నపుడు
సాధువులకు ముప్పు - సమకూరి నప్పుడు
రాక్షస బాధలు - ప్రబలి నపుడు
శిష్ట కర్మ విముక్తి - చేకూరు నప్పుడు
నఘ రాశు లుత్కటం - బైన యపుడు
దుష్టు లేవిధమునం దుప్పొంగని యప్పుడు
ప్రియ భక్తులే ప్రోవఁ బిలిచి నపుడు

తే॥ గీ॥ క్రోధ భీతుల నే - నరు ల్గోరి నపుడు
నెందరో తన కయి నిరీ - క్షించు నపుడు
నృపులె దుష్పథములఁ జరి - యించు నపుడు
నీశ్వరుఁడు న్యాయముగఁ బ్రభ వింపఁ డొక్కొ

తే॥ గీ॥ భక్త వశవర్తి యగు భగ - వంతుఁ డెపుడు
భక్త సంకల్పముననె స - ర్వము ఘటించు
దైత్య విధ్వంసమున కవ - తార మెత్తె
భక్తులే కోరఁ ద ద్వ్యతి - రిక్తుఁ డగునె? ౨౩౭

మ॥ భయ దారణ్యముఁ బత్తనాకృతి నొన - ర్పఁగ దాని ఛేదించు టే
నయ ధర్మంబ యిటుల్ తమోంబుధి నిమ - గ్న క్రూర విధ్వంస వి
స్మయ మార్గంబ తదీయ చిత్త పరిణా - మం బా శరీరంబు నం
ద యసంభావ్యము సద్గతిం బడయఁ ద ద్ధ్వంసం బవశ్యంబగుఁ

తే॥ గీ॥ స్వర్ణ కారుఁ డే రీతి భూ - షల నొనర్చు
స్వర్ణమును నూఁది యటుల నీ - శ్వరుఁడు ప్రాని

ఆత్మ పరివర్తనము వధ - వ్యాజ మునను
బొరయఁ జేయు నద్భ్యాది శుభం - కరము గాదె?
తే॥ గీ॥ పరమ దేవుని సృష్టి శా - శ్వతము గలదె?
యీ చరా చరములను ర - క్షింప నతఁడె
అంత మొందించు లయ క_ర్త - యగుచు దాను
నితఁడె సృష్టి కర్తయయి సృ - జించు మగిడి ౨౯

ఉ॥ కావున సృష్టి సేయుటయుఁ - గాచుట యొంతటి యిద్ధ ధర్మమో
చేవ నడించి కూల్చుటయు - శ్రీశున కంతటి యిద్ధ ధర్మమో
నేవిధి నంత మొందని య - హీనచరాచర ముల్ స్వయంబుగాఁ
దా వధియించు చేఁ యతని - ధర్మము నందియ మేల పొందఁగా
తే॥ గీ॥ ఎన్ని యాతంకములు వచ్చి - రెందిరి కొన్న
వాని నన్నింటి నడఁచి లోఁ - బడి సమయక
ఘన తమో భేద కాదిత్య - కాంతి భంగి
వెలుఁగునజ దివ్య తేజమై - వెలయు నంశు ౨౧

తే॥ గీ॥ ఇట్టి దివ్య తేజః పరి - వృ(క)ఁడు గాన
దుర్గమ ప్రతిష్టంభముల్ - దునిమి స్వాస్థ్య
భంగ మొందక వెలిఁగె న - వ్యాసుదేవుఁ
డతఁ డరయ నతిమానుష - వ్యక్తి గాఁదె? ౨౨

శా॥ సర్వజ్ఞుండును సర్వ కాలకుఁడు నా - సర్వాత్ముఁడౌ శ్రీశుఁడే?
గర్వాడంబర రిక్త చిత్తులు గదా? కంజోద్భవాదుల్ భ్రమా
ఖర్వాహంకృత మంద బుద్ధులగుటన్ గంజాక్షు తేజః ప్రభా
దోర్వీర్యాదు లెఱుంగఁ జాలక ప్రమా - దోన్మత్తులౌ టొప్పదే
ఉ॥ కావున సర్వ యాదవుని - ఘానుడు చే వ్రతిఁబొంద కుండ గో
పావళిఁ గృష్ణుఁ డోపుటను - నాత్మ నెఱింగి చలన్మనస్కుఁడై
యావిధి "నా కి భాన మను - రారితిరస్కరణంబుఁ జేసె నే

నా వనజాక్షు కన్నొమ్మెలిగి - యాతని లాపుఁ బరీక్ష సేయునే
క॥ అని విగత విద్య మాత్స
ర్య నిగాఢ మదావృతుఁడగు నజుఁడా కృష్ణుఁ
గను మొఱఁగి డాఁచె నొకదిన
మున గో గోపకుల వత్సముల బిట్టలుకన్. ౨౫౫
చ॥ నలువ తమో మయుండయి యొం - నర్చు నకృత్యములెల్ల నాత్మలో
దెలిసియు నిద్రపోవునటు - దీర్ఘ కపొంతఁ బరుండి యుండి యా
జలజ దళాయ తాక్షుఁడు ప్ర - సన్నత నేమి యొఱుంగనట్లు క
న్నులు దెఱువంగ రాముఁడు మ - నోవ్యథఁ దమ్ముని డాసి యిట్లనెన్
శా॥ నీరేజాప్తుఁడు పశ్చిమాద్రి వయి గ - న్పించెన్ మృగా నీకముల్
పాఱుం జొచ్చె గుహాంతరోద్గతములై - వత్సమ్ములున్ గోపు లా
భీరుల్ రా రదియేమి? యీ కరణి - నిర్భీతిన్ దివా స్వాప మే
లా? రక్షో గణ మాయగాదు కద! మే - లా! యీ విపర్యాసముల్?
క॥ అన విని వనమాలియు న
ల్లన నవ్వుచు ననియె నిటు - బలా యిటు పొమ్మా
మనలేఁగ లాలు గోపకు
లును జనుదెంచెదరు - చని విలోకింపఁ గదే?
ఉ॥ రాముఁడు చెట్ల జొంపము బి - రానఁ దరింపఁగఁ బాని వత్స గో
భూమిక లూని గోపకుల - భూమిక లొందియుఁ గానిపించె నా
రాముఁడు వారలం గలిసి - రాఁగ యథాస్థితి నున్న కృష్ణుఁ "డ
న్నా! మఱి భీతిఁ జెందఁ దగు - నా" యని మేలము లాడె లీలమై
తే॥ గీ॥ ఈ పగిది నొక్క వత్సర-మేరి కేని
నెఱుక పడ కుండఁ గృష్ణుఁడు - బృంద యందు
సకల వత్స గో గోపాలుఁ డగుచు మెలఁగె
నింత కంటె నమానుష కృత్య - మెద్ది? ౨౬౦

మ॥ నిమిష ప్రాయము వర్ష మావిధికి న - న్వేషించి యోజించి యా
కమలాక్ష ప్రతిభావిశేష మహిమా - ఖండ ప్రభావంబు దు
ర్దమ సత్త్వంబు గ్రహించి సిగ్గువడి వి - ద్యా బోధితుండై నిగ
ర్వ మతిఁ గృష్ణు క్షమింప వేఁడికొన న - వ్వాణీశుఁ డా బృందకా
[illegible] రూఢుండై చనుదెంచి నిజ వాహనంబు బృందాటవీ
సమీపంబునఁ దిగ్గి [illegible] వదనుఁడై బృందారణ్య మధ్య ప్రదేశంబునం
గల కొండొక కాసార తీరంబున ౨౬౧

సీ॥ భువన మోహనుఁ డయ్యు - మురళి మ్రోయించుచు
మొదవుల వెనువెంటఁ - గదలు వాని
దేవ దేవుండయ్యు - వావిరి వల్లవ
ప్రియులతోఁ గోలఁ - జరించు వాని
గోపురాధిపుఁ డయ్యు - ఘోష మానుష లీల
నాడి పాడుచు నడ - యాడు వాని
లోక నాయకుఁ డయ్యు - లోలుఁడై కపట భా
తి పోషణమున వ - ర్తిల్లు వానిఁ
తే॥ గీ॥ బుధుల సంఛన్న మాయాతి - రిక్తుఁ డయ్యు
భక్త వశవర్తి యగుచు - లోఁ బడెడు వానిఁ
పాదచారియై చనుదెంచి - పద్మగర్భుఁ
డరసి ప్రణమిల్లి ప్రార్థించె - నతుల భక్తి ౨౬౩

శా॥ మాయాతీతుఁడవై, జగన్మయుఁడవై - మాయా పరీతుండవై
మాయా కల్పుఁడవై వికల్పుఁడవునై - మాయా ధురీణుండవై
మాయా కారుఁడవై సమగ్రుఁడవు నై - మా యాజమాన్యుండవై
మా యాగాఖిల భోక్తవైన హరి నా - మా! యందు కొమ్మంజలుల్
సీ॥ నీ కారణమునఁ గా - నిగమాగమ వ్రాత
భాషా చణుండనై - పలుకి నాఁడ

నీ మూలమునను గా - నిఖిల చరా చర
భువన కారణ సంజ్ఞఁ - బొంది నాఁడ?
నీ కతంబునను గా - నీచ కైటభ ముఖ
నిగ్రహ కర్త జీవనై - నెగడి నాఁడ!
నీ హేతువునను గా - నిరుపమ విద్యాధి
భర్తనై కర్తనై - ప్రబలి నాఁడ
తే॥ గీ॥ నీవలనఁ గాదె నేఁను త - మో విజిత్రి
భావ సంభావ్య భావనఁ - బరఁగి నాఁడ?
భక్తరంజన! దుష్కృత - భంజనా ని
రంజనా! యంజలి తను జి - తాంజ నాద్రి! ౨౬౫
శా॥ అజ్ఞానాంధ పరీత మానసుఁడనై - యజ్ఞాత యుష్మత్ప్రభా
వ ప్రజ్ఞా ప్రాభవ విస్మృతిన్ దదితర - ప్రాపంచ సామాన్య మి
థ్యా జ్ఞానాధిపుఁ గాఁ దలంచి మదమా - త్సర్య ప్రబోధైక కిం
చిద్ జ్ఞత్వంబున దుష్కృతిన్ సలిపి యున్ - సేవింప నేతెంచితిన్
చ॥ నినుఁ గికరింపఁ బూనితిని - నేనిది యెంతటి సాహసంబు శా
ఖను బవళించి మూలమును - ఖండన సేయు నతండ పోలె నా
పని తలక్రిందు లయ్యె నభ - వా! భువనావన! హేస్వయంభు ప్రా
నను క్షమియింప రాదె? నిను - నమ్మిన భక్తుల నెమ్మి బ్రోవవే?
మ॥ క్షర సంకల్ప! నిరర్థ కోద్ధతుఁడ శి - క్షా రక్షణా ధ్యక్షయ
క్షర భూయిష్ఠ పరిష్ఠ నిష్ఠుర మహా - గర్వాంధ కాముండ! అ
క్షర సంజ్ఞా! క్షరమయ్యె దుర్మదము ప-శ్చాత్తాపముం బొంది నీ
శరణుం జొచ్చితిఁ దావకీన సుతుఁడన్ - క్షంతవ్యుఁడన్ బ్రోవవే
మ॥ ఇదిగో లేగలు నాల్గుఁ జూడు మదిగో - బృందార్భకుల్ గోపకుల్
భవ దత్యద్భుత భిన్న దివ్య తర లీ - లా రూప సంక్షేపణో
త్సవ భాగ్యం బొనరించి గోని కర ఘో - పావాప సుస్వీకృతు

త్సవ వేణూచ్చలి దూర్జిత స్వన మహాగో - త్సాహంబుఁ గావింపవే

క॥ అని వినుతించిన నజుఁ డా
వనమునఁ బొడసూప వశిన-నవ చంద్రిక యె
ల్లనఁ గమలాక్షుఁడు గమలజు
తనువ్రుఁ బుణుకు చిట్టి లనియెఁ - దద్దయుఁ గరుణన్ ౧౭౦

ఉ॥ రాజస మార్గసారయిఁ బ - రాజయ భాజన మా వృథా రజో
రాజి సమూలమై తెగు న - రాజ సత్త్వ విశుద్ధి చేత నే
రాజస వృత్తి నుంట సుక - రాజన దుక్తి స్మరింతు రే కుమా
రా! సమస్త దేశ ముని - రాజులు నైతము మత్త చిత్తులై

తే॥ గీ॥ నీవు గాని గోపకులేని - గోవు లేని
దైత్యులేని నా కొకటియు - తప్పిదంబు
లేరి వైన నొకింత సై - రింపఁ జాల
నెవరు నను నమ్ముకొన్నఁ ద్య - జింపఁ జాల ౧౭౧

ఉ॥ రాజస మావరించిన బి - రాన నడంచు భవాదృశాధ్యులన్
రాజస తామసాత్ములయి - కారిచెడు వ్యక్తుల గాథ దుస్తమో
రాజి నిమగ్నులైన యసు - రాదుల నే విధి శిక్షఁ జేసియే
యోజను నుద్ధరింపఁ దగు - నో యటు సేయుట నాకుధర్మమౌ

క॥ ఈ యను భవము స్మరించుచు
నే యనువున రాజస పరి - వృతమతి గనకే
పోయి నిజోచిత ధర్మము
న్యాయమునఁ జరింపుమయ్య - యంబుజ గర్భా ౧౭౨

మ॥ అని యాయంబుజ నాభుఁ డానతిడ నాయంభోజ గర్భుండు వే
జనె నాజ్ఞాపితుఁడై పునః కృత నమ - స్కారమ్ము లర్పించి యీ
ఘన దివ్యాద్భుత దర్శన క్రమము న - క్కంజాక్షు మాహాత్మ్యము
వినిపింపన్ విని గోకుల ప్రజలు స్తం - భీ భూత వ్యాద్వేగులై

క॥ ఆడిరి పరవశు లగుచును
పాడిరి గోవిందు లీలఁ - బరమాత్ముని దయక
వేడిరి వేడుక మీటను
గూడిరి సభ చేసి పొగడ - గోపాలుని ౹౨౭

## ధ్రు వ కో కి ల

పరమ పావన! భక్తపోషణ! పాప భంజన! భావనా
నిరుపమాన! ఘనా ఘనాశన - నిర్వికార! చిదాననా!
ఖర ముఖాసుర కాంత ఖండన - కమ్ర శీతల వీక్షణా!
గురు తమోధిక పంక శోషణ - క్షాత్ర రాజన శిక్షణా!

## గ ద్య ము

ఇది శ్రీమదిందిరానాథ ప్రసాదలబ్ధ సహజ కవితా విరాజమాన శ్రీమద్
గౌతమ సగోత్ర దివి వంశోద్భవ నరసింహాచార్య పౌత్ర వెంక
టాచార్య రంగమాంబికా తనూజ రంగాచార్య ప్రణీత
శ్రీ కృష్ణాతి మానుషతత్త్వ ప్రథమ ఖండాతర్గత
ద్వితీయాశ్వాసము సంపూర్ణము.



# శ్రీ కృష్ణాతి మానుష తత్త్వము.

## తృతీయాశ్వాసము.



క॥ శ్రీహరి విహంగరాడ్ధరి
బాహార్జిత శౌర్య ధైర్య - బల జిఝరి ఘో
రాహవ జితహాః! వేణూ
త్సాహ విహారీ! నతారి - దైత్యావిదారీ! ౧

వ॥ అవధరింపుము. అంత నమ్మధురాపురమునఁ గంస నృపాధముండు.

ఆ॥ వె॥ మృగ కుశీల వాళి - మృగ తృష్ణ కెన యాట
మృగయు భీతిఁ బాఱు - మృగము వోలె
మృగ్య శోషణమున - మృగ మదాద్యనులేప.
భోగములను మాని - యోగి యయ్యె. ౩

వ॥ అంత ౪

క॥ మంత్రులు కంసుని కడకు ని
మంత్రితులై వచ్చి ప్రబల - మంత్రాంగములన్
యాంత్రిక మాంత్రిక శక్తి స్వ
తంత్రత్వముఁ బూని కృష్ణు - తలఁదెత్తు మనన్ ౫

వ॥ కంసుండు పరిహాసించి మంత్రులతో నిట్లనియె. ౬

శా॥ గొల్లం డర్భకుఁ డెంత? పోయి యిదిగో - గోపాలు ఖండింతు మం
చుల్లాసంబున బీరముల్ పలికి మీ - రుగ్రాసులన్ వోయి నా
కుల్లాసం బొనరించి రే కనుక మీ - యున్మత్త సంభాషణల్

గల్లల్ వొల్లు నుడుల్ సహింప నీకు నే - లా వ్యర్థ సల్లాపముల్ ౯
చ॥ అనిన నమాత్యు లిట్లనిరి - యందుల కై భయమేల? సైజమై
మనుజుల దార్కొనుఁ మృతియ- మర్త్యుఁ డశోకంబునులేదు భీతి ను
న్నను ధృతినున్న మృత్యు వొక- నాఁడును దప్పదు చేయుచున్న యో
పనులను మానటొప్పదు విపత్తిని - వచ్చిన వీఁక విచ్చినన్
తే॥ గీ॥ అనిన నంత నిరుత్సాహ - మునను గంస
ధారుణీ నేత వారి మం - త్రాంగ ములను
ననుమతింప నమాత్యులు - హర్ష మంది
ముదలఁ గైకొని తమ గృహా - మ్ములకు జనిరి. ౧౦
వ॥ అంత నమ్మఱు నాఁడు
ఉ॥ ధేనుక నామ దానవుఁడు - ధీర పరాక్రమ దోర్బలుండు మా
యా నిరతుం డమాత్యుల స - మాగమనం బొనరించి పిల్చినన్
బూని యశోద నందను న - పూర్వ విధానమునన్ వధింతు నం
చానలు సెప్పి బృందకుఁ బ్రి - యాణ ముఖుండయి యేఁగె వీఁకపై
వ॥ అంత నా ధేనుకాసురుడు ౧౨
కం॥ గోకులము పొంత గోపా
లాకర్షక పక్వ ఫల సు - లాలిత పర్ణ
ప్రాకట తాల వనము మా
యా కల్పనఁ జేసి గార్ద - భాసుర సంజ్ఞన్ ౧౩
ఉ॥ అందుఁ గలట్టి యా ఫలము - లాఁగొని కోసిన వారి మ్రింగు చా
మందను సొంద దెంపరనొ - మ్రిందఁగఁ జేయుచుఁ గృష్ణుఁ డవ్వ డా
సందున కేఁగు దెంచి నను - జంపఁగ నందున కాఁచి వేచి యుం
దంద మెలంగు చుండెను ఖ - రాసుర నామక ధేనుకుం డటన్ ౧౪
వ॥ ఈ వృత్తాంతం బెల్ల మున్న యెఱింగియు సురాపాన మత్త చిత్తులకుఁ
గ్రొత్త పరివృత్తి హత్తింప నత్తామర సాక్షుం డుపేక్షించియుఁ దన్ను న

మ్ముల్గొన్న వారి బన్నమ్ముల మిన్నకున్న నన్నగిలవరియుఁ గన్ను మిన్ను
నెన్నక యాకన్న పన్నుఁగడఁ బన్ని తన్నె భిన్న భిన్నము లొనరింప ని
న్నాళ్ళు వెన్నంటియున్న యన్నిచు పెగ్గె నెగ్గ నేయక నుగ్గాడు మొగ్గర
మున గొగ్గియుఁ దాల ఫలప్రియుండును దాల మదిరా సక్తుండును బాలక్రీ
డా రతుండును నాభీలాసుర సంహారకుండును నగు నా హాలధరు నంబోధించి
యిట్లనియె. ౧౭

శా. అన్నా! తాలవనమ్ముఁ జూడు మది మా - యా కల్పితమ్మందు ని
న్నెన్నో పక్వ ఫలమ్ములున్ మధు సురా - హీన చ్ఛద స్కంధముల్
గన్నారం గననౌట గోపకుల నా - కర్షించె వారంద యు
త్పన్నుల్ గా క్షమియింప రాదుగద! యీ - దౌష్ట్యమ్ము వారింపవే

చ॥ ననుఁ గడ తేర్చు కోరిక మ - నమ్మునఁ జేకొని ధేనుకుండు నా
దనుజుఁడు గార్దభాకృతి స - దా విహరించు వనంబునందు నే
జన నతఁ డప్రమత్తత ని - జాద్భుత మాయఁ జరించుఁ గాన గో
పునివలెఁ బోయి నీవ మృతిఁ - బొందఁగ జేయుము వాని లావుచేన్.

ఆ॥ వె॥ అన హలాయుధుండు - "నట్ల కాకని యేఁగి
గోపకుని సమాన - రూప మొంది
తాల వనముఁ జొచ్చి - తాల ఫలమ్ములఁ
గోసి కొనుచు సురను - గ్రోలుచుండె.

క॥ ఎప్పటి యటు ధేనుకుఁ డా
చప్పుడు విని యోండ్రి వెట్టి - చకచకఁ జని త
న్నిప్పుఁ గణిక లోలుక సురన్
దప్పి న్స్మృతిన్ గ్రోలు రాముఁ దాఁకొనె నంతన్.

మ॥ అలఘూద్ధరిత బలుండు నా బలుఁడు వృ - క్షాగ్రింబు నందుండి వి
హ్వల భీభత్సక రూపుఁడై దనుజుకై - త్యాంగంబుపై నంఘ్రులన్
తలపైఁ దాఁడవ తాడనంబులును గం - త గ్రాహము చేసి దా

చ్చల దుచ్చ్వాస మడంచి చంపె ఖరద్రై - త్య ప్రఖ్యానిఁ ధేనుకున్

క॥ నేలంబడి ఖర దనుజుం
డీలిగినం దాలవన మ - దృశ్యంబై యా
భీలనిజ దనుజ రూపం
బాలోకింపఁగ ననఘ్యా - మై కనుపట్టెన్ ౨౧

వ॥ అంత ౨౨

ఉ॥ రాము, ఖరాసురున్ దునిమి - రమ్యుని గోకులమందుఁ గృష్ణుఁ డా
రాముని గారవించుటకు - రామల గోపులఁ జేర్చి దైత్య భి
ద్రాము మనోఽభి రాము సుమ- దామములం గొని తెచ్చి పోయియా
రామము నుండి వేడుక వి - రామముగా సభఁ జేసె నయ్యెడన్ ౨౩

ఉ॥ ధేనుకుఁ డంత మొందిన ధృ - తిన్ బెడవాయక మంత్రి వర్గముల్
పూని ప్రలంబ నామకు న - భూత భవిష్య దపూర్వ చిత్ర మా
యానయుఁ బ్రోత్సహించఁ జని - యాతఁడు బృందకు గోప రూపుఁడై
వేణు వినోదితావశ ని - వృత్త మనస్కులఁ జేరె గోపులన్ ౨౪

ఆ॥ వె॥ చేరి వేణు రవముఁ - జెవి యొగ్గి వినుచున్న
నతని చొప్పెఱింగి - యదు సుతుండు
కన్ను సన్న సేయఁ - గని బలరాముఁడు
దునిమె నా ప్రలంబు - దోర్బలమున ౨౫

క॥ గోపకులు రిచ్చ వడి కని
చూపోపఁగ లేసి ఘోర - సురరిపు తనువున్
రూపు బలరాముఁ బొగడిరి
"కాపాడితి దనుజ వలన - ఘనబల" యనుచున్ ౨౬

క॥ రథ చోదకుఁడు దానే
విధ హయములఁ నడిపి కార్య - విధిఁ గూరుచు నా
విధి సాధకు డగుచు రిపు

స్మ్రఘనము హరి రామ సాధ - నమున ఘటించెఁ ౨౮

## కాళియమర్దనము.

ఉ॥ అంతఁ బ్రలంబ రాక్షస దు - రంతము నం జలియించి సంభ్రమం
బెంతయు మంత్రులొంది పిలి - పించికి భృత్యులఁ బంపి బ్రహ్మ దే
శాంతర వన్యవాసియు బ్రి - శస్త్ర బలుండును మంత్ర శక్తి నా
శాంత యశో విశాలుఁడు న - రాంతకుఁ డాశ్రిత సర్ప రూపకున్
తే॥ గీ॥ అతఁడు కాళియ సంజ్ఞఁ గ - ల్పిత భుజంగ
రూపియై నిజ బహుళ భా - ర్యా పరివృతుఁ
డై వనంబుల హ్రదముల - నబ్ధు లందుఁ
బొంచి నర మృగ వనచర - ముల గ్రసించు ౨౯
వ॥ అట్లు నరహంతయైన ఘోర రూపి యగు కాళియాహ్వయుని
క॥ మును పిలువ నంపి వస్త్రా
శనమును గ్రాసంబు నొసఁగి సమ్మతిఁ గామ్యం
బును గూర్చి మంత్రి సత్తము
లని రుచి తాసన మొసంగి - యాదర మొసఁగన్ ౩౧
శా॥ ఏయే దేశము లే వనమ్ములను నే - యే భూము లందున్న నా
త్మీయుల్గా రే? సురాదు లెల్లరును బ్రి - త్యేకత్వ భేదమ్ములు
న్నే! యీ కంస నృపాలు రక్షకుఁడ వీ - వే కావె! ఘోరస్థ చూ
యా యోధుండగు కృష్ణుచేఁ బడిన కం - సాధీశుఁ గాపాడవే
తే॥ గీ॥ నీ సమర్థత వినుటఁ - బేరాస తోడ
వినువుఁ జెందియుఁ బ్రాణముల్ - బిగ్గఁ బట్టి
బ్రదుకు చున్నాము కాళియ! - పన్నగ స్వ
రూప! కరుణ నీ హితులకుఁ - బ్రాపుగా వె? ౩౩
చ॥ అనిన వచించెఁ గాళియుఁ “డ - హా! యిదియుంగడు దుష్కరంబె? నేఁ
జని యిదిగో మదీయ ఘన - సత్త్వ మహత్త్వ విచిత్ర మాయలన్

గనఁ బడఁ జేతుఁ గాక వృథ - గాఁ బలు కాడిన లాభమున్నె? యం
చును జని గోకులంబునకుఁ - జొట్టి తదీయ సకుల్ భజింపఁగన్ ౩౮

క॥ చని గోకులమ్ము పొంత య
మునా హ్రదంబునను డాఁగి - మునుకొని యటకున్
దిన వేఁకు చుండు గోపీ
జన గోపక జనుల కేఁచి - సంకట మిడఁగన్ ౩౯

శా॥ ఘోషా వాసులు బెగ్గడిల్లిఁ కటా! యీ - ఘోరాహి క్ష్వేళానలో
చ్ఛ్వాస జ్వాలలు దుస్సహంబులు ససా - ధ్యంబుల్ గదా! యంచు బెన్
ఘోషన్ దోషణ హీనులై వగవ నా - గోపాల కార్త ధ్వనుల్
రోష క్రోధ దయాంకుర ప్రదములై - పో, త్సాహముం గూర్పఁగన్

ఉ॥ శౌరి దయార్ద్ర చిత్తుఁడయి - జానపదుల్ మదమాన శక్తిఁ బ
ల్మాలు లెటిడిచియున్ దనుజ - మా మలఁ దుంగుచుఁదమ్ముఁ బ్రోవఁగన్
గోరర యిట్టి భక్తులు మ - నోవ్యథ నున్న నిమేష మేనియున్
సైరణ సేయఁ జాలనని - సాఁగె హ్రదంబున కక్షణంబునన్

సీ॥ సంభ్రమ భ్రమణ సం - చలితమై గళితమై
శిఖ నున్న నెమలి పిం - ఛెమ్ము క్రొల
రయ జాత ఘర్మాంబు - మయమై విదయమై భ
యంకరమై వద - నాబ్జ మొప్ప
అగ్రహా పరవశో - దగ్రమై యుగ్రమై
దృగ్గురిచి జ్వాల వి - స్తృతి వహింప
ప్రళయార్క రోషాగ్ని - వాలమై లోలమై
యరుణ బింబోష్ఠ వి - స్ఫురణ వెలుఁగ

తే॥ గీ॥ వల్లె వాటుగు జాళువా - రొల్లె జాఱి
మెడఁ దవిలి యున్న హారముల్ - మిట్టి పడఁగఁ
జరణ ఘట్టన ధారుణి - సంచలింపఁ

జకి కనుముడి యమునకు - సాగి వచ్చె 38

ఉ॥ వచ్చియదూద్వహుండగని గ - భాలునం గాళియుం డాహ్రదంబునన్
డెచ్చెరం బాతె నాత్మ తరు - ణీ జనముల్ పిలువంగటి రా నడిం
జొచ్చి తదీయ కృతిమ వి - షోద్గమ నోత్కట భోగపంక్తులన్
విచ్చి నటస్థలి దనర - భీకరుండై రుధిరా రుణాక్షుండై 39

ఉ॥ చకిత హతా త్రిలోకమన - సంఘట నాత్మికి సంచలించి ని
ర్వ్యకి పరాక్రమ క్రమణ - వారిజనాభు ఫున స్పనూగమ
పరిక్రమ ణాప్తికై గత వ - రాజ్ముఖుండై వర శేష భావ శే
షకియ శేష నిర్వహణ - నల్ప విశేష నిరీక్షణుండునై ౪౦

మ॥ హృదయాబ్జాంతర కర్ణికా సనము పై - శ్రీకృష్ణుం గీల్కొల్పి త
త్పద సేవా పర నిర్మలాత్ముండయి త- త్పదమ్మూర్తి శిశ్వదృగ
బ్జ దళాగ్రంబులం బాదుకొల్పి స్థిరుండై - సారూప్య సంపాద నా
భ్యుదయా కాంక్షుండయ్యెం గాళియుడు ని- ర్మోహ నహంకారుండై

ఉ॥ అంతట నంద నందనుండు - దగ్ర మహోగ్రహ ణోగ్ర విగ్రహా
స్వాంతమునన్ హ్రదంబునకు - వచ్చి హ్రదస్థ భుజంగ రూపు దు
ర్దాంత నట త్ఫణాళిగని - తత్క్షణమే నికటస్థ భూరుహో
పాంతగుండై తటాలున మ - హాహిశిరంబుల దూకె నుద్ధతిన్

క॥ దుమికి ఫణీంద్ర ద్వాదశ
వమ సుఫణా న్యస్త పూత - చరణుండై దు
ర్దమ బల కాళియ లాంగూ
లము నొడిచి గ్రహించి పట్టి - లాగి తిగుచుచున్ ౪౩

మ॥ పద సంఘట్టన ఘట్టి తోరగ ఫణ - వ్రాతా వృతుండై లయ
ప్రద భీకృ న్నటరాజ మూర్తి యన భీ - భత్సుండునై కాళియో
న్మథ నారంభకుండై తదీయ రస - నాంభః ఫేన వర్షాతి సి
క్త దళత్పాద పయోరుహుండయి యశోదాపుత్రుం డుద్రిక్తుండై

మ॥ తనగర్వాగ్ని ద్రుతిఁ బోఁగ కాళియుఁడు - తత్పాదాహతిన్ నొచ్చి హ
స్తనితాంతోద్ధత పీడన క్రియలు బాధా వేదనోద్వేలుఁడై
తను వాకంపితమై శ్రమాంబుకణ ని - స్తంపన్నుఁడై యొప్ప దృ
గ్గణముల్ బాష్ప పరీత చాలితములై కాంతిల్లక విభీతాత్ముఁడై

క॥ పడగలు దడదడ తడఁబడ
నడుఁగడుఁగునఁ గ్రుంగి యుడిగి - యొడలుడుచు వడఁకం
బొడగని కడఁక నిలువఁగఁ బడి
గడగడ మని బెగడు వడియెఁ - గడు నుడి వడుచున్ ౨౬

మ॥ రుధిరోద్గారముఁ జేసి కాళియుఁడు ని - ష్క్రోధాత్ముఁడై భీరుఁడై
హృదయాగాధ గుహాంతరస్థ చటులో - ద్రేకోగ్ర కార్పణ్య దు
ర్మద మాత్సర్యము లేని పేదవడి గ - ర్వస్ఫూర్తి శూన్యుఁడై కృష్ణప
త్పద విన్యాస మదెంత మూర్ఖులకు - సన్మార్గమ్ముఁ జేకూర్చ దే!

వ॥ అంతలో

క॥ ఇదిగని తదీయ సుదతులు
బెదరి యదరి యెదలు సెదరి - విగళిత మదలై
వదరుచు బదిఁపు నెమ్మను
లదవదలై శిథిలి కదల - ప్రాద నిర్గతలై ౨౭

సీ॥ కంపిత శీర్షలై - కచభారములు వ్రేలఁ
దుటిమిన క్రొన్ననల్ - దూలి వ్రేల
అవనత వదనలై - యాస్యాబ్జములఁ గ్రిమ్మ
చిమ్ముఁ జెమ్మటముత్తి - యమ్ము లొలయ
సంబద్ధ హస్తలై - సలుపు దండము లొగ్గి
తమ్మిమొగ్గల నిగ్గుఁ - దగ్గఁ జేయ
భయ విహ్వలాత్మలై - వడఁకు మై దీధియల్
శంపాలతల పెంపు - సొంపు వంప

తే॥ గీ॥ చలిత చేల లాలోల కు - చాగ్రి లగుచు
మఱి విభీత కంపిత మధ్య - మాంగు లగుచు
నియమితార్థ నిమీలిత - నయన లగుచు
భక్తిం బ్రణమిల్లి తలలొగ్గి - పలికి రిటుల ౫౦

ఉ॥ పాహి జగత్ప్రభో భువన - పాలక! పాప సురారి మర్దనా!
పాహి సమస్త దేవనుత - పాద సరోరుహా! పాహి పాహి! శ్రీ
పాహి శయాః! పాహి కుమానా - హీనిం గాళియు యుష్మదీయ పా
దాహతి మ్రొక్కె మా! ప్రభు! శ్రీ - తాపన! బ్రోవఁగదే దయానిధీ.

శా॥ నీపై ద్వేషము లేదు నుంతయున గా - నీ పయిం గొంచెపుం
గోపం బేనియు లేదు, కంసపతికి - మోహమోడి గ్రాసంబు లే
కే పొట్టాఁకలిం బట్టజాలక యు యి - ట్లీతెంచి యాసించెఁ గా
నీ పొలుప్పాని స్వదేశముం విడచునే నీ - శౌర్య మాలించినన్

తే॥ గీ॥ ఇతఁడు నిర్దోషి, యితని క్ష - మింపఁ దగును
కూలికై పాలుపడి గతి-మాలి వచ్చె
విత్త మాశించి విషపాన - విధిఁ తదీయ
జీవములఁ గోలుపోయెడి - చెనఁటి కరణి ౫౩

శా॥ ఆర్తత్రాణ పరాయణుం డవని మే - మాలించి యున్నాము మా
భర్తృ ప్రాణము నిల్పి మాకతని కు - ద్వాహంబు దీవించి ని
ర్వర్తింపం గదె! తిర్గి నేఁడు తొలి మా - బాంధవ్య బంధంబు మో
భూర్తి భూత మిదే వినశ్వరము ను - మ్మం భోధి కన్యా పతీ.

తే॥ గీ॥ ఇతని దుస్పృహ వాన దు - ష్కృతమ తలఁచి
తివిరి మారణ శిక్ష వి - ధింతు వేని
మున్ను మమ్మెల్లఁ గడతే-ర్చు మన్న యిపుడు
శీర్ష మాలిక చెండాడు - మార్ష వంద్య! ౫౪

క॥ అనుచు నుతించినఁ గృష్ణుం

డనురాగ వశాత్ములై, - మహాభీష్మద న
ర్తన కేళ్యుపసంహారణం
బును సలిపెడు నంత గోప - ముఖ్యులు బృందన్ ౫౭

ఉ॥ ఎందును నచ్యుతుం గను - పింపక పోవుట సంభ్రమించి యా
మందను సందుగొందులను - మార్గములందున రోసి రోసి యా
కందన తోడఁ జేరువ న - రణ్యములన్ యమునా నదీ తటీ
బృందములందు సైకత మ - హీతల తీర మహీరుహమ్ములన్ ౫౮

క॥ వెదకి వెదకి మదదనుజో
న్మథనుఁడు యమునా హ్రదంబుఁ - దరిసినటులుఁ ద
త్పద చిహ్నము లేర్పడఁగా
నెద లగులఁగ బెదరు పొదలఁ - గృష్ణా! యనుచున్ ౫౯

క॥ అఱ్చుచుఁ బ్రేమ వెలార్చుచుఁ
గార్చుచుఁ గన్నీళ్లు వేర్చి - కార్చిచ్చు వలెన్
జేర్చుచు వగ ముట్టిన నో
దార్చు కొనం జాల కెల్లా - దరిసిరి హ్రదమున్ ౬౦

చ॥ దరిసి హ్రదంబుఁ గన్గొనిరి - తాండవితాంఘ్రి యుగాంక భోగవి
స్ఫుర దురగేంద్ర కాళియ ని - జోచిత నాగ కులాంగనా మణీ
విరచిత వ్యాద్గత ప్రణుతి ప్రీత దు - రాగ్రహ కేళి కేళికో
త్కర పృథులోష్ణు, జిష్ణు, విజి - తాఖిల తృష్ణు, సహిష్ణుఁ గృష్ణునిన్

మ॥ కని యాశ్చర్య నిమగ్న మానస చలత్ - కౌతూహలాందోళులై
జనితాత్యంత నిగాఢ భక్తిరస ని - స్తంద్రాత్ములై నాగమ
ర్దన నిర్వాహక తత్పదాంబుజము హృచ్చిం - తా స్వాంతులై స్వస్తవీ
క్షణ మాలా ముదితాత్ములై తనిసి - హర్షాంభోనిధిన్ దేలుచో

ఉ॥ ఉరగ శరీరమున్ విడిచి - యొగ్గి శిరంబు నమస్కరించి బి
గ్గర నెలుఁగెత్తి బత్తిఁ బుల - కాంకిత గాత్రుఁడు కాళియుండు త

ద్వారద పదాంబుజ ద్వయిని - బట్టి గతశ్రముఁడై నిగర్వియై
శిరముల మోడ్చి నిల్వఁబడి - కంపము తోఁ వచియించె నిట్టులన్

ఉ॥ పావన కోమలాంబురుహ - పాద! భవత్పద ఘట్ట నమ్మునన్
బావన మయ్యె నాతనువు - భావము నీ కరుణార్ద్ర దృష్ట్యతిన్
బావన మయ్యె నాత్మ పరి - ణామము నొందె ద్వదీయ సన్నిధిన్
గావర మేది దాసుఁడను - గాచుటొ యేచుటొ యాచరింపవే

తే॥ గీ॥ విడిచి పుచ్చిన నీ నిత్య - భృత్యుఁడ నయి
మతిని నిను నమ్మకొని కాల - గతిని గనుదు
నీవు కృపఁ గడ తేర్చిన నేఁడె దేవ!
పరమ సంతుష్టి దివ్య సత్పదముఁ గందు ౬౪

చ॥ అనిన ముకుందుఁ డిట్లనియె "- నాసుర కాళియ నీ సతుల్ కృత
ప్రణుతుల నా కృపన్ బడయఁ - బాత్రతఁ జెందిరి వారికై నినున్
మనిచెదఁ బొమ్ము జంతు నర - మాంసము మాని ఫలాశనంబునన్
మనుము నిజేచ్ఛ శీతనగ మధ్యముఁ జేరి - సుఖంపు మచ్చటన్

క॥ అనిన నిజార్ధాంగుల తోఁ
బునః పునః ప్రణుతు లిడుచు - ముదల నడిగి కై
కొని కాళియుఁ డేగెను శీ
త నగాటవులకు స్వకీయ - తరుణీ యుతుఁడై ౬౫

మ॥ హ్రద నిర్గామి యదూద్వహుం గదిసి యా - యాభీరవర్గంబు స
మ్మద సంతోష విలాస లాలిత మనో - మార్గాను సార క్రియన్
జదలన్ బోరన నార్చి, పేర్చి, బహుళో - త్సాహంబు సంధిల్ల ను
న్మద భంగిన్ జెల రేగి పండు వొనరిం - పన్ బూనె నుప్పొంగుచున్

ఉ॥ " కాళియ నామకోరగము - గారుఁడ భీతి మునీంద్ర శాప వా
క్కీలలఁ బ్రాప్య దుష్కర ను - కీర్తిత మా యమునా హ్రదమ్మునన్
వ్రాలి తదీయ తీరజన - బా ధకమై చరియింప రోసి యా

ప్రాఖ్యాతముఁ ద్రౌణిక్రియాహ్రదముఁ - బాయఁగఁ జేసెను శౌరి క్రుద్ధుఁడై
తే॥ గీ॥ అనెడు గాథయుఁ గలదుగా - యది నిజంబ
యయిన సామాన్యుఁడైన గో - పార్భకుండు
ప్రాణములఁ దెగించి భుజంగ - భయము వావఁ
గలఁడె? యిది యతిమానుష - కర్మ గాదె? ౬౯

ఉ॥ కాళియు గర్వ భంజనము - కర్ణపుటమ్ములు సోఁకఁ గూలి యాం
దోళన మంది కంసుఁడును - దుస్సచివుల్ పరితాప కంపితో
ద్వేల మనస్కులై వగచి - వీఁక నదృశ్య కళావిహీనులై
త్వాళిని జేరి కృష్ణ సహి - తాటవిఁ గాల్పఁగ నాజ్ఞ యిచ్చినన్

వ॥ ఆ సమయంబున

క॥ దుస్సహము సఖిల భూతమ
న స్సంతాపక దురంత - నవోష్మమ్ము తే
జస్సాధి తోరుబాష్పము
నిస్సత్వక గ్రీష్మ మడరి - నిగిడెఁ బుడమిపై ౭౦

శా॥ ప్రాలేయాంశు విహార రాగము పటీ - రాలేప నాకాంక్ష స
చ్ఛైలా రోహణ రక్తి యంబు గృహవా - సాసక్తి శీతాని లా
లోల ప్రాంతి రసాల భుక్తి ఝురక - ల్లోలావగాహార్తి యై
గ్రాలెన్ దీప్తనిదాఘ మయ్యెడల శు - ష్కాంగంబు వారంబునై

క॥ ఆతప తప్తుండై శ్రీ
తాతత మారుత సుఖమ్ము - నచ్ఛాంబు సుఖో
పేత మని యెంచి కానన
శీతల నిర్ఝరుల శౌరి - చేరెఁ బ్రియులతో ౭౧

సీ॥ క్రొన్ననల్ దలిరులం - గూర్చి సెజ్జ యొనర్చి
కమ్మని యలరుల - నిమ్మఁ జిమ్మి
సలలిత సలిల సే - చన విధిఁ దీర్చి

కొ్త్త పానుపుపైఁ బ - రుండఁ బెట్టి
నవరసాలము లిచ్చి - నవరసాల యొసంగి
నవ రసోక్తుల మహా - నందము నిడి
వినయమా వత్రింప్రు - వీవనల్ విసరి పా
దాంబుజ సంవాహ - నంబొనర్చి
తే॥ గీ॥ ఛత్త్రములఁ బట్టి యాతప - చ్ఛాయఁ దఱిమి
చుట్టుఁ గూర్చుండి గాథ ను - షుప్తి దేల్చి
యుప చరించిరి గోపాలు - రుత్సహించి
కృష్ణ పరమాత్మ నాగ్రీష్మ - ఋతువు నందు ౭౨
ఉ॥ శౌరి దయార్ద్ర భావమున - సంగడికాండ్ర ననుగ్రహించి దు
ర్వార నిదాఘ తాప విని - వారణఁ జేసెఁ గృపార్ద్రకీత దృ
క్ప్రారణల్ నిజాస్య శశి - చంద్రికలన్ మృదు మేఘ నిర్గత
స్ఫార మనోహరానిల న - వామృత వాఙ్మధుర స్రవ తుషార్ ౭౩

వ॥ ఇట్లు నిర్వ్యాజన్య సాహాయ్యంబుల నాతప బాధితులయ్యును నిశ్చింతులై సౌఖ్యాబ్ధి డోలికా మాలికలఁ దూఁగుచున్న గోప గోపాలుర నుపలక్షించి కంస నియమితులై

క॥ "ఇదియే హరి వంచింపఁగ
నదన" యని తలపోసి దనుజు - లతి గూఢముగాఁ
గదలి యరుదెంచి యనలా
స్పద బృందాటవి నొనర్చి - చనిరి మధురకున్ ౭౪

వ॥ అంతఁ గతిపయ కంస నియమితాసుర ప్రేరిత ఘోర సామీర వార కారణాఖిల కకుబంతోద్వ్యాప్తి తాడంబరా సహ్యోష్ణాత్మటోప ధగ ధగ ద్ధగిత దందహ్యమాన చండాగ్ని కీలలును, అగ్ని కీలోపరి భాగావృత ప్రళయ కాల కాలమేఘ నీకాశ భూరినీరంధ్ర సాంద్ర ధూమ మాలికా జాలంబులును, ధూమ మాలికా జాలాక్రమిత దిగ్భ్రమిత సంభ్రమ దుద్ధం

డ భయానక క్రూరవన్యమృగ సంచయ కోలాహలంబులును, క్రూర వన్యమృగ సంచయ కోలాహలాం దోళితోద్ధూత నితాంత శకుంత సంతాన సంతాపంబులును, సంతాపిత శకుంత సంతానాశ్రయ విదగ్ధ మహా మహీరుహ పతన సూచక నిష్ఠుర కఠోర విస్ఫోటనంబులును, కఠోర విస్ఫోటన భీత పలాయిత కంపిత పశు సముదయప్రాప్య విశాల దీర్ఘికా ప్రవాహంబులును, దీర్ఘికా ప్రవాహాద్యుదక నిపాతాభంగ రంగ దుత్తుంగ కన ద్విస్ఫులింగా ఖండ దుస్సహ ఘూఘూత్కార శబ్ద బాహుళ్యంబును, ఘూత్కారశబ్ద బాహుళ్య నిర్గమణాకులిత చలిత నానావిధ జలచరనివహోర్భటంబులును, ఆకులిత చలిత జలచర నివహోర్భటీ రావ నిర్ఘాంత దోదూయమాన గోపికా గోప స ఘాత కలకల నినాద సంకులంబునునై మహారావ మహోదధిం బోలి ప్రతిధ్వనించుచు సమయ శంకర సంవర్తకాల మహాప్రళయ తాండవ క్రీడారంగంబు బలె భీభత్సంబై యా బృందారణ్యంబు నూపట్టినఁ జక్రి) ౭౫

క॥ ఇది దనుజ మాయఁ గాదని మది నెఱిఁగి యకారణముగ దావాజంతూ
న్మథన వ్యథలను, గాంతార దహనము సహింప లేక పరిచలిత మతిన్

శా॥ బాలార్క ప్రతిబింబమై వదన బిం-బం బొప్పఁ గెందామరల్
వాలుం గన్నులుగాఁ జర ద్భ్రమర మా-లా భ్రాంతిమై ముంగురుల్
క్రాలన్ సంచల దంబుదమ్ము పగిదిన్-గంపింప నెమ్మేను శుం
డా లోచ్చాలిత శస్త్ర హస్త భుజ దం-డంబుల్ బ్రకాశింపఁగన్

చ॥ నిలిచె విరామ సౌఖ్యముఁ దృ-ణీకృతముం బొనరించి కాననా
నల విశిఖా విరామముఁ బొ-నర్ప దృఢవ్రత నిష్ఠఁబూని ని
ర్గళిత హిరణ్య చేలము శి-ఖాచ్యుత చంపకమాల సంస్రవ
ద్విల సదనూన ఘర్మజల-వీచికలన్ దలపోయ కెంతయున్

మ॥ ఉపలక్షించి దవానలద్యుతి నితాం-తోచ్చాఘ్రాన ఘోరాట్టహా

న పరీతానవఁ డై మణిస్థగిత భూ - షా మంజుల క్వాణ సా
ర పయోజాతత కాండ సన్నిభ కర - ప్రాగల్భ్య మేపార సాఁ
చి పయోజాక్షుఁడు స్పర్శఁ జేసె స్ఫురద - ర్చిః ప్రజ్వలజ్జ్వాలలన్

క॥ ఈ క్రమమునఁ గరయుగమున
నిక్రి దవానలము స్పర్శ - నలిపిన శిఖి కీ
లా క్రమి తాటవి కనఁ బూ
ర్వ క్రియ శీతలము నొందె - పల్లవు లార్వన్ ౮౪

సీ॥ దగ్ధ భూజములు క్రొం - దలిరులం దొడిగె వి
గత జీవరాసులు - గదలఁ దొడఁగె
అస్పృశ ధూమంబు లంభోద మాలలై
కుంభ ధారావృష్టిఁ - గురిసి మెఱసె
కొలఁకుల కొలఁకుల - జల చరమ్ములు పొంగి
శీవి సప్పొంగి క్రీ - డింప సాఁగె
మంజుల కలనాద - మాధుర్య మొప్పారఁ
దరుశాఖలను శకుం - తమ్ము లరచె

తే. గీ॥ మృగయు వల్లవా ట్యాటవి - కేభ సింహ
పుండరీకాది మృగరావ - ములు సెలంగె
వాసుదేవ కర స్పర్శ - వలన మగిడి
బృంద చిగురించి ననలెత్తి - విస్తరింప ౮౫

మ॥ అది యే చిత్రమొ కాని కాననము ని - ష్పంటించి ఘోరానలా
స్పదముం జేసిన రక్కసుల్ పిదప ప - శ్చాత్తాప సంతాపితో
న్మద చిత్త భ్రమణంబులన్ గదలి - "కృష్ణా! ప్రోవవే" యంచుఁ ద
త్పద పద్మంబుల వ్రాలి రాసురతమో - దార్ఢ్యా బహ్మశ్యంబు గాన్

ఉ॥ శౌరి కృపామతిన్ దనుజ - సంచయముం దిలకించి పల్కె "మీ
ఘోర తమోంధ కారములు - గూలె" మనః పరివర్తన క్రియన్

చేరఁగ నచ్చు నన్ను జన - సేవ స్వదేశరతిన్ ననుఁ దా మదిం
గోరిన సంచుఁ బుచ్చె నతి - ఘోర నిశాటులు నేని మాధవుం
జేరి నమస్కరింపఁ గరు - ణించి యఘంబులఁ బాపెఁ దోలఁడే!

ఉ॥ వేసవిఁ గృష్ణ గోపకు ల - భీతి నరణ్యములం జరించుచో
మూసి దవాగ్ని ధూమములు - ముట్టిన గోపకు లార్తిఁ జేరి సం
త్రాసముఁ నొంది యార్చినఁ గ - రమ్మవలీల దవాగ్ని మ్రింగి గో
ఘోషములఁ గాచెఁ గృష్ణుఁ డని - కొందరు వల్కిరి తొల్లి యాకథల్

చ॥ ఎది నిజగాథ యైనను న - హీన దవానలమున్ గ్రసించి యా
పదఁ దొలఁగు పురుషోత్తముఁడు - స్వప్నన గ్రాసముచేసినో మహా
భ్యుదయముఁ గూర్చె బృందకు ద - వోజ్జ్వల కీలల మ్రింగెనో యికే
యిది యతి మానుషంబయిన - కృత్యముగాదె మనుష్య కోటికిన్

వృ ష భా సు ర వ ధ

ఉ॥ మాఘునఁ గంసు డమ్మధుర - మంత్రులు నిష్ఫల దైత్య యత్నముల్
వేధ రొనర్చు పీకలుగు - వీఁగి ధృతిన్ వృషభాసురాఖ్య దు
ర్బోధను జేసి మందకు న - రోక్తులఁ బంపిరి యొట్టులేని యుక్తిన్
మా ధవు రూపు మాపి నర - నాథుని గంసుని భీతిఁ బాపఁగన్

మ॥ వృషభాఖ్యాత సురారి పెన్ వృషభమై - బృందాటవిం జేరి శ
ల్యపపోషాప్తిత మత్త చిత్తుఁడయి యా - బృందాటవీ వాసులన్
విష లిప్తోద్ధత శృంగ ఫలకుల పడిన్ - బీడించి క్రీడింప న
వ్విషయం బా మధుసూదనుం డెఱిఁగి యా - భీరావనోద్యుక్తుఁడై

చ॥ బిరబిరఁ జక్కి హస్తముల - భేవ్య వినూతన లోహవర్మముల్
గఱికి వాఁడి వట్టినటుల - గల్పిత శాత నఖాగ్ర మాలికల్
మెఱయు, మదేభ సంహనన - మేదుర కాంతుఁ జయించు సింహ వి
స్ఫురణఁ బరాక్రమ క్రమణ - శూరకులుం డెదిరించె గోవిభున్

శా॥ బాహాదండ పరాక్రమ ప్రథితస - త్త్వం బేర్పడన్ శృంగముల్
సాహంబున్ను ఱుమాడి పట్టి నముతో లీలన్ శ్రవో ద్వంద్వముల్
గ్రాహంబున్ బొనరించి కంఠమునఁ గూరన్ హస్తముల్ ప్రేల కం
డై హాహాధ్వనితోడ నవ్వృషభ కా - యం బాసురా కారమై

క॥ గోపక గోపీ జనములు
గోపాలుని గుములుగట్టి - కొలిచిరి సాత్వా
ద్గోపాలుఁ డనుచు నాఁటికి
గోపాలన మాని వివశ - గో సంతయుతై ౯౪

శా॥ ఆఁబోతుం బొలదించి చావు వినుటన్ - వ్యాలోలుఁడై కొంత సే
పబ్ధావన తాన్యుఁడై వివశుఁడై - యాకంస భూపాలకుం
డా బాలా బల వృద్ధులన్ జెదిమిరా - నాజ్ఞాపితుం జేసె ఘో
షాభిఖ్యాత మహాఽరుణ ధృత మహా - శ్వాకారు హేషాకరున్

తే॥ గీ॥ దీర్ఘ కేశ పాశోత్కరో - దీర్ణుఁ డగుచుఁ
గేశి యను నామమునను ప్ర - కీర్తితుఁ డగు
నతని పైఁ గంసునకును బూ - ర్ణాభి మాన
హేతువున నింత దనుకఁ బం - పింపఁడయ్యె. ౯౫

ఉ॥ కేశియుఁ గంస భూమిపతికిన్ గడుఁ గూర్చు నతండు గాన నా
యానము తేనికిం గొలువు - నంచుఁ దలంపక పూని తెంపునన్
జేసి వచించె నీపగిదిఁ - జిత్తము మూర్ఛఁగ వచ్చు నన్ను పె
ల్లాన వినమ్ర శీర్షుఁడు కృతాంజలియై పదయుగ్మ ముంటుచున్

శా॥ దేవా! నా యసుధారణా ఫలము నీ దేహావనార్థంబె? నీ
జీవంబుల్ గలవేని మాదృశుల తోల్ - జేజేల వేవేలకున్
కావుల్ గావె? భవత్సురక్షణకుఁ బ్రా - ణత్యాగము౯ జేయనే
నే వెన్కాడుదునే? హితమ్మెఱిఁగి భా - షింతున్ నయమ్మొప్పఁగన్

శా॥ గొల్లం డర్భకుఁ డాతఁ డాయుమని మీ - కుందోఁచుఁగా? [illegible]

నల్లుండై జనియించినట్టి హరి దై - త్యానీక దుస్సాధ్యమౌ
యోల్లేఖ ప్రతిభంజనం బతఁడు మర్త్యుండే? యసామాన్య భా
స్వల్లీలా పురుషుఁడు గాని యతనిన్ - భంజింపఁగా శక్యమే? ౧౦౧

తే॥ గీ॥ చిన్ననాఁడె రక్కసిదఁడు - పీఁచ మడఁచి
ఘోర సర్పమ్ముఁ ద్రొక్కి యా - భీకరములు
నాధి భౌతిక పీడన - మంటకుండఁ
బ్రోవఁ జాలుట మతి యాశ్చ - ర్యంబు గాఁడె?

ఉ॥ అతఁడు బృందఁ గాల్చిన ఘ - నాసుర కాళియ ముఖ్యులన్ మహా
పాతకులైనఁ "పాహి" యని పాదములం బడఁ బ్రోచి మెచ్చఁడే?
చేతము సంబళించుకొని - శ్రీకృష్ణుని యాతని పాలికేఁగ మీ
కౌ తరళాబ్జ నేత్రుఁడు ద - యా మతితో [illegible] వంగఁడే?

తే॥ గీ॥ ఈ నుడులు ప్రాణభీతిచే నేను బలుక
ఈ హితోక్తుల మీరు మ - న్నింపరేని
యిదిగో మీ ప్రాణలనే బలి - యిచ్చువాఁడ
నా యసువు లేడ్తెఱను నన్ను - నమ్ముఁడయ్య ౧౦౨

చ॥ అనవిని కంస ధాత్రిపరుఁ - డుల్లనఁ జల్లనవోయి యేఁకులై
కనుఁగను బాఱ బాష్పములు - కంపితుఁడై శ్రియతో జాలమౌ
ననమునఁ ద్రోఁప ఱిచ్చవడి - నగ్ర శిరస్కుఁడు సంచలన్మనో
జనిత భయాతిరేక వివశాత్ముఁడునై వచియించె నీగతిన్ ౧౦౩

శా॥ కేళీ కేశవుఁ డా వ్రజార్భకుఁడు లో - కేశుండె శ్రీకృష్ణుఁడై
నై శాటోత్కర నాశనార్థమయి జ - న్మంబందు టాకాశ వా
ణీ శస్తోక్తుల సమ్మియుంటిని గదా? నీ భావిలో నూతనో
ద్దేశంబేమి? యడంగి డిందిన భయో - ద్రేకంబుఁ బ్రేరేచుటో?

మ॥ అదియే కర్మము కాని యంబర నినా - దాశ్లిష్ట వాగ్జాలముల్
హృదికిన్ శూలములై నిరంతరము గాఁ డింపంగ రేయుంబవల్

యేగు పుత్రుం డెటుతుగించునో యనుచు సవ్యాజవృథా వ్యాకులో
న్మద చిత్త భ్రమణంబుఁ గూర్చె జయమో నాశమ్మొ కర్తవ్యమా
ఇన్న దినాలనుండి మును - కృష్ణునిఁ జంపుదు నంచు బీరముల్
గొన్ని వచించి మిత్రులను - గోల్పడి యర్థము రాష్ట్రి సైన్యముల్
మన్నొ నరించి "కంసుఁ డభి - మానము క్షాత్రము వీడి పారిభీ
తి న్నత శీర్షుఁడయ్యె" నను - ధీసల కాజుల సైప నోర్తునే!

తే॥ గీ॥ దుర్భరంబగు భీతి ని - ద్దురయుఁ దింకి
లేక జీవించు కంటెను - లెస్స మరణ
మతఁడె హరిచైన సాయుజ్య - మసరు నాకుఁ
బగను సాధించులే శుభ - ప్రదము గాదె! ౧౦౭

క॥ భావలుఁడిగి కేశీహాయ
వేషముతో ఘోషకరిగి - వేవేగ భవ
ద్దేషా సామర్థ్యంబుల
ఘోషా వాసులను గృష్ణుఁ - గూల్చఁ గడఁగు మీా ౧౦౮

చ॥ అన విని కేశి మార్పాలుక - కాసలు గ్రమ్మంగి పరాక్రమ ప్రశ
ర్షను భట ధర్మ పాలనను - స్వామి ఋణంబును దీర్చ మాధవుక్
జెనకి గతించి సత్పథముఁ జెందఁ దలంచి తురంగరూపియై
చనె మధురాపురంబునకు స్వస్తి పచించి యరణ్యసీమకున్

వ॥ అంత నబ్బృందారణ్యంబునఁ గేశి యశ్వరూపియై ౧౧౦

సీ॥ ఘనఘోద్దీప్త సువర్ణ శోభి విలస - త్కాంచనంబు నాకర్షక
శ్రవణ ద్వంద్వము హ్రస్వ వాలము ను దీర్ఘాక్షుల్ ఖురాచ్ఛద్యుతుల్
పవమాన ప్రతిమాన వేగ మలరన్ - లంఘించు చత్యుద్ధతిన్
సవ నాశ్వంబు బలెన్ సురారి మెలఁగెన్ - నవ్యాశ్వమై మందలోన్

క॥ కొందఱ కాశర్షకమై
కొందఱ కుత్సాహ కరముఁ - గొందఱ కత్యం
తాందోళకమై కొందఱ

కుం దతి క్షిప్రదము నగుచు ఘోటక మొప్పెన్ ౧౧౨

ఉ॥ దాని స్పృశించు గోపకులు - దాని కెదుర్చు పౌరకోటి య
ద్దానిని జూచు గోపికలు దాని పిలుందను బాలు బాలురున్
బ్రాణము పీడిరో వికల భావముఁ జెందిరొ శక్తిఁదూలిరో
వేనకువేలు దూల విని - వేఁజని ఖాంచెఁ బరోపహాక్షుఁడున్

మ॥ కని సర్వమ్ము గ్రహించి నంద సుతుఁడా - కఁక్షాణ రాజంబు మా
దను నిర్భీతి నిమేష మాత్రమునఁ బ్రో - ద్యత్సార సామర్థ్య జృం
భణ మొప్పారఁగ నెక్కి నాహయము ది - గ్భ్రాంతో ద్ధతిన్ నింగికిం
జనె శ్రీకృష్ణుఁడు మూఁపుపైఁ దనర బృందా వాసు లల్లాడఁగన్

మ॥ హయ దైత్యుండిటు లేఁగి యేఁగి తనపై - నారూఢుఁడౌ కృష్ణు ని
ర్భయ లీలం బడఁదోయఁ బూన హరి దు - ర్వార పరితాప ప్రభా
వ్యయుఁడై, దుర్భరుఁడై యమేయుఁ డయి క - న్పట్టంగ నా కేశి సం
క్షయ ధైర్యంబున నేలఁగూలె హృదయ - స్పందంబు మందంబుగాన్

ఉ॥ కేశి మనస్థ కామ్యమును - గేశవుఁ డాత్మ నెఱింగి జ్ఞాన వి
న్యాసముఁ జేయ నా దనుజుఁ - డాత్మ ముకుందుని గెల్చికొల్పి పీ
తాసుఁడునై విశుద్ధ పద - మాక్రమణం బొనరించి నెగ్గె నో
కేశ పదాబ్జ సంశ్రయ మ - దెంతటి మూర్ఖుల నుద్ధరింపదే! ౧౧౩

ఉ॥ కేశి గతాసుఁడై పడుటఁ - గేశవుఁడే జయ తోషి యౌట ధా
త్రీశుఁడు రోసి గాసిపడి - శ్రీశునిచే సుర పోషణంబు దై
త్యేశ వినాశనంబు విబుధేశ మహీసుర తోషణంబు మాం
సాశి విశోషణంబు నిజ - మంచు నిరాశను బాసె నాసలన్ ౧౧౪

చ॥ సచివులఁ జీరి పల్కె మన - శత్రు వజేయుఁడు రిక్త యత్నవృ
న్నిచయము మానుకోఁ దగును నిచ్చలునన్ బెఱుదంటి వచ్చు ఘో
ర చటుల మృత్యు దంష్ట్రికల పర్యయలుగా స్థిరమయ్యెఁగా భవ
ద్గ్రధిత సహాయమున్ మఱువ రానిది తీర్తుఁ బునర్భవంబునన్

చ॥ అనిన సమస్తు లెల్లరు భ - యంపడి గుండెలు ప్రీలి వ్రాల్చి యా
ననములు ధూళి క్రాలి వద - నంబుల స్వేద జలంబు తోడ బా
ష్పనిచయ ధారలోలి జడి - వానవలెన్ వడి జాల సోలి యి
ట్లనిరి "ప్రభూ! మిముం విడుతుమా? మిముఁ బాసి మనంగ నేర్తుమా

తే॥ గీ॥ "చింత నుడిగి రవ్వంత వి - శ్రాంతిఁ గొనుచు
కార్యభరము వహింతుము - కడకు తోడ
గట్టకడదాఁక నెల్లెడఁ బట్టు బట్టి"
యనుచు నొప్పించి నాఁటికిం జనిరి కదలి ౧౨౧

వ॥ అంత ౧౨౨

చ॥ నయనుతు వ్యోమకాసురు నమాత్యులు వే పిలిపించి ప్రీతితో
నయమున రాగముం బ్రియమునారఁగ గౌరవ ముల్లసిల్ల న
మ్మయ సుతుతో వచించిరి యమానుష శౌర్య! తదీయ గౌరవా
న్వయ ఘనకీర్తి వల్లికలు ప్రాఁకెను సర్వ దిగంత కాంతమై

చ॥ మయుఁడు జగద్వశీకరణ - మంత్ర మనః పరికల్పనాద్భుత
క్రియలకు మేటి నీకుఁ బిత, సృష్టి కరుండు విధాత తాత, దు
ర్జయ సురభీమణోర్జిత ప - రాక్రమ విస్ఫురణంపు భావ, ని
ర్భయ మయపుత్రి! నీకు సరివారెవరయ్య సురాసురాదులన్? ౧౨౪

ఉ॥ నీ కుశలైక బుద్ధి మఱి - నీ మహనీయ కళాభిమానమున్
నీ కృత విస్మయాతిగణ - నీయ విచిత్రము లెన్నొ? నీవలన్
పోఁకిన జీరియుంటిమి యశోధన! యర్ప్యుఁడ వీవటంచు న
త్యాకులితున్ నృపాలునిఁ గు - లాధిపుఁ గంసుని రక్షసేయఁగన్

తే॥ గీ॥ ఎవఁడు మీ బావయగు రావణేశ్వరుని వ
ధించె నా హరి నేఁడు శ్రీ - కృష్ణుఁ డగుచు
నృపతిఁ గంసునిఁ గూల్ప జ - న్మించినాఁడు
శక్తిఁ బ్రకటించి చేసికి - సాయ పడుము ౧[illegible]

చ॥ ఇటువిని వ్యోమకాసురుఁ డిదే చని మంటకుఁ గృష్ణుఁ గిష్టుఁడు
ర్మధ వడఁగించి కంస నృప - నాథుని భీతి హరించి మీకుఁ దె
చ్చెద ఘనకీర్తి సన్నిధిని - జీవనమిప్పుడ నన నెవ్వఁడోపు? మీ
ముదల నొసంగుడీ యనుచుఁ - బోయెను బృందకు వ్యోమదైత్యుఁడున్

ఉ॥ చేతను గోల, పాగయును - శీర్షమునన్, జెవి జంపు, మీసలున్
మూతిపయిం దిరుపుండ్రములు - మోమున, గంటె గళాన, మూఁపుపై
ప్రాతది దుప్పటమ్మును, మొలన్ త్రాటను గట్టిన గోను ముల్లు, డా
చేతను గొమ్ముఁ గాళ్ళఁ దోగెలు చెప్పుల నొక్క గొల్లకట్టడై

ఉ॥ వేకల మందఁ గొండొకటి - మేఁపుచుఁ గాఁపరియై యదల్చుచున్
మేఁకలు గట్టి యాడుకొను - మోస మెఱుంగని గోప బాలురన్
డేకువ డాసి కూలఁబడి - దీనత నార్చెస నంత గోపకుల్
శోకముఁ బొందనేల? యని చుట్టును మూఁగిరి యాఁపి యాటలన్

క॥ వ్యోమాసురుఁ డంతట "నా
గోమాహాత్మ్యంబు లొక్క గుహఁ జొఱ భీతిన్
బోసాని మాయమునకై
యీ మందకు వచ్చి యుంటి - నేమనియెదరో? ౧౩౦

క॥ అని వచ్చినట్లు చెప్పిన
విని కృష్ణుఁడు లేమి నచట - వెఱచియుఁ దుదకా
తనితో గుహకడ కెల్లరుఁ
జని గోరక్షణ మొనర్చి సాయపడుటకై ౧౩౧

తే॥ గీ॥ నిశ్చయముఁ జేసి మొదవుల నీడ నిలిపి
కదలి దనుజునితో గుహ - కడకుఁ జనిరి
అతఁడు బిలమును జూప గో - పార్భకాళి
చొచ్చి రొక్కొక్క రందు వి- శుద్ధ మతిని ౧౩౨

ఉ॥ వారు బిలంబు సొచ్చిన ద - భ్రాలున నగ్గుహ నొక్క రాతితోఁ

ఘోర నిశాచరుండు తన - గొల్లని వేషము మార్చి వేషమై
దారినిఁ గాచుచుండె నొక- దారి వెలెం బెడదారిఁ బోక యా
దారిని తమోవిదారి విజి - తారి శౌరిని గోరి పేరిమిన్ ౧౩౩

వ॥ శ్రీకృష్ణునితో నాఁడు తానేడి పోఁడిమి పూఁపోఁడి రాధిక బ్రతిమలా
డ వీడుకొనలేక యాతడు జోడుగ నిరువురుఁ గూడి యాడుచుఁ బాడుచుఁ
గూడుచు వీడుచు బహుళ క్రీడా సముపేతులై బృందాటవిందరిసి యందు
మంద సంకడి కింది కుందుపడుటకై డెందమ్మునం గొందలపడి యుం దంద
మంవశాపరుల యాక్రందన మెందైన వీనులం బొందు వడు నేమో యను
సందియంబున నాలకించుచు గోపాలుండు నబ్బాలారత్నమగు రాధికయు
డోలాందోళిత మానసులై నివ్వెఱవడి యవ్వనజాక్షి రాధిక యువ్వల్లవు
ఁడు మవ్వంపు బున్నవ్వు నివ్వెయుఁ జెదరక నవ్వాడి వినగాకుండుటకు నెవ్వగఁ
జెందు నవ్వనమాలి నవ్వి యాక్రొవ్విరిబోణి దువ్వి

క॥ ఇది దనుజ మాయ సుమ్మీ
సుదతీ! యిపుడరిగి వాని చొప్పెఱిఁగెద నీ
పొద చాటునఁ గూర్చుండుము
పదిలమ్ముగ ననుచు గోప బాలుఁడు సనియెన్ ౧౩౪

చ॥ చని తనకై ప్రతీక్షణముఁ జాయలు చూచెడి మేషపూషిది
తుక్కున కరుగంగ నాతఁడు ము - కుందుఁడుఁగాఁ దలపోసి డాసినన్
గని వనజాక్షుఁ డాతని ప్రకారము నెల్ల గ్రహించి క్రుద్ధుఁడై
చెనకి సురారి కంఠమును - శీఘ్రము పట్టె నతఁడు గొల్లయై

చ॥ "నను వధియింపఁ జూచుటిది - న్యాయమె? నీకు హితుండ నందనం
దన! నిను నమ్మినందులకుఁ - దారొకని చంపఁ దలంచినావె? నన్
జెనకకు "మన్న" యన్న వనజేక్షణుఁ "డో ప్రియ! నీకు నేహితం
బును ఘటియింతు" నంచు గళ - మ్ముం బిగియించెఁ గరాంబుజంబులన్

చ॥ దనుజుఁడు తూలియున్ బడక - దానవ ఖేది నెదిర్చి నింగికిన్

జని వనమాలిపైఁ బడినఁ - జయ్యన గృష్ణుఁ డదృశ్యుఁడై సుగా
రినిఁ బడఁద్రోసి వక్షమును - వ్రీలఁగ ద్రొక్కిన నోట నెత్తురుల్
జనఁగ గతాసుఁడయ్యెఁ బ్రియ - దంబున రాధిక సూచి పొంగఁగన్

ఉ॥ అంత యదూద్వహుండు సుహ - కర్ణుగమున్న శిలా కవాటముల్
వంతలు దొంకలై తనక - వైచి కరాబ్జమునందు వేణువా
క్రాంత దగిల్చి దివ్యతృషు - లేశ్య మనోహర మోహనాద్భు తా
త్యంత మనోజ్ఞ నిస్వనము - లల్లన రాల్చి కదల్చె జీవులన్

శా॥ ఆ వేణూత్క్రియమాణోచ్చలచ్చల దభం - గా రావ భంగాంబుధి
ప్రావిర్భూత లఁరన్నట జ్జలచర - ప్రాయు వ్రజాసీకన
ద్భావోత్సాహ రవ ప్రతిధ్వనిత బృం - దారణ్యా మొప్పారె రా
ధా కృష్ణా త్తమ హావ భావ మిళితో - ద్యత్తుంగ రంగమ్ముగన్ ౧౪౦

క॥ ఈ రీతిన్ గోపాలురఁ
గూరిమి రక్షించి వచ్చి - గో బృందముతో
నా రాధామణితో బృం
దారణ్యము దాఁటి ఘోషకరిగెఁ బ్రియముగన్ ౧౪౧

వ॥ అంత.

క॥ గ్రీష్మాంతమైన సంతా
పోష్మాంతము గాక వర్ష - ములు లేమికినై
విస్మయము నొంది రవి యా
కస్మిక కిరణముల వేఁడిఁ - గని వ్రజ వృద్ధుల్ ౧౪౩

క॥ చనుదెంచి నందు నొద్దకు
ఘనాఘనాధిపుఁడు వజ్రి కలఁ గెను మనపై
మన మింద్రియాగ మిత్తటి
మునుకొని పొనరింప వర్ష - ములు గురియు ననన్ ౧౪౪

చ॥ అనవుడు నందుఁ డీయకొని - యట్టులెనా సటనున్న నందనం

జనుఁడు బిరాన లేచి నగి - "నాపంబు నాదరమున్న మీకు నా
మానవి యొకింత కష్టు తృటి - మాత్రము శ్రద్ధ వహించి యాలకిం
చిన నవిచాలుఁ బోకు" డని - చేయి దొడంగె హితప్రబోధముల్ -

క॥ ఇంద్రుఁ డొక దేవుఁడే? ప
ర్వేంద్రియ సకలాండ కోటి కీశ్వరుఁ డొకఁడే
యింద్రుల కింద్రను విడిచి లో
తేంద్రియులై యింద్రుఁ గొలుచు - టిది హేయముగన్ ౧౪౬

మ॥ స్తుతఖద్యోత మహత్త్వమేది లవఖద్యోతంబు శ్లాఘించుటా
తత రాకాశశి శోభఁ గేఁపడి క్షు - ద్ర జ్యోతిఁ గాశించు టీ
షిత గంగాలహరిన్ దృశించి సెలయేటిన్ జేరి సేవించు టూ
ర్జిత సర్వేశ్వర పూజనమ్విడిచి ఖ - ర్వేంద్రుల్ సమర్పించుటల్ ౧౪౭

ఉ॥ మానవ జీవుఁడే నుకల - మేటియు నిర్జర నాయకత్వపున్
వాసి ఘటిల్లె నాతనికిఁ - బ్రాక్తన పుణ్య ఫలాను సారమై
చేసిన యాగముల్ ప్రజలు - చేయుకయున్న స్వధర్మ పాలనా
భ్యాసకుఁ డేని భూప్రజకు - బాధకుఁడై చరియింప నోపునే? ౧౪౮

క॥ విధ్యుక్త ధర్మ నిర్వహ
ణోద్యుక్తుఁడు గాని బ్రహ్మ - యును దండ్యుండే
యాద్యుఁడు స్వధర్మ నిర్వహ
ణోద్యోగుల నరసి యొసగు - నుచిత పదంబున్ ౧౪౯

ఉ॥ నిర్ణయ ధర్మ బద్ధులయి - నిర్జరు లుర్విజనావన క్రియా
దీర్ణత సూచించుట య - థేచ్ఛ ప్రతిగ్రహ కాంక్షమాని పం
పూర్ణ కృతజ్ఞులై ప్రజలు - పూజల జన్నములన్ సురాళి హ
ర్షార్ణవ మగ్నతన్ నిలుపు - టర్హము యేల వృథాప్రయాసముల్

తే॥ గీ॥ సవన పశుకాంక్ష నేఁడు వ - ర్షములు గురిసి
వెల్లి లంచము లేమి వ - ర్షింప కున్న

సతేఁడు దేవేంద్రుఁ డగునె? నీచాతి నీచ
జీవి యగుఁ గాని వానిఁ బూ - జింప జనునె ౧౫౧

చ॥ పసు బలియిచ్చి లంచముగ - వర్షములొందఁ దలంచు మీరు మా
నిసి బలికోర కేపదియు - నెయ్యముతో నొసఁగంగ సిద్ధుఁడే?
పసరము నందు మీకుఁ బలెఁ - బ్రాణము లేదె? స్వలాభ కాంక్ష న
ప్పసువు వధింప రాకృతిఁ - బాల్పడి సల్పుట మోక్ష హేతువే

చ॥ సతము సధర్మమై ప్రకృతి - సంచరణంబు ఘటించునేని ని
ర్మిత విధిఁ గాలచక్రగతి - నిశ్చలమై చను సక్రమంబులై
ఋతువులు హాయనమ్ములను - నేఁగు సుఖమ్ముగ భూతకోటికిన్
హితముగ వర్షముల్ గురియు - నే రుజయుం బొడసూప దెన్నఁడున్

చ॥ ప్రకృతి విపర్యయైకపథ - వర్తిని యైనఁ బ్రచాలితమ్ములై
వికృతము లై ఋతు ప్రచయ - విభ్రమ కాలము లేఁగు రోగ బా
ధకము ను దుస్సహంబు నిక - తమ్ముగ మారు సమస్త ధాత్రి యీ
ప్రకృతి హితాహితంబులకుఁ - బ్రాధమికంబగు హేతువారయన్

ఉ॥ వానలు లేమికై యడలి వాసవుఁ గొల్చుట కంటె నుత్తమం
బౌ నియతాత్ములై పరు నిరంజను విష్ణువు నర్చ సేయుటల్
దాన నభీష్ట సిద్ధియగు లంపటఁ గూర్చు మఖ ప్రయత్నముల్
మానుడు లాలకించి మఘనాథు హరిం భజియించుటొప్పగున్ ౧౫౪

చ॥ ఖరకర తప్తమై వసధి - కాండము బాష్పవికారమై ధరో
పరి చలితానిలాశ్రిత న - భమ్మునఁ బ్రాకి చరించుచున్న భూ
ధర గత భూజ శీతల ని - తాంత మరుద్గతి వర్షరూపమై
కురియుఁ బ్రజోప యోగముగఁ గూడి నిసర్గ విధాన మేర్పడన్

ఆ॥ వె॥ ఘోష ప్రాంతమున్న - గోవర్ధనాద్రిపైఁ
గలుగు తరువు లెన్నొ - గాలి పోయె
నింధనమ్ములుగ వ - ధించిరి పెక్కింటి

నట్లు జలదములు ప్ర - వించి కురియు॥ ౧౫౨

చ॥ కావున గోకులాచలముఁ - గానన యుక్తముఁ జేయు పూన్కి గో
పావళి తోడఁ గొంకోక శు - భాహము నం జని భూవరాంకురుఁ
భావనఁ జేసి నాఁడు జరు - పఁగ దగుఁ బండువు గల్గు వర్షముల్
వావిరి భక్తి శైలగతు - భావనఁ జేసిన వాసి యబ్బెడుఁ

తే॥ గీ॥ ఇంద్ర యాగము కొఱకు మీ - రెంత ధనము
వ్యయము చేయుదురో యంత పైకమిప్పుడు
పర్వతాత్మ పూజకు వెచ్చ - పరువ వలయు
దాన నిహపర సౌఖ్యముల్ - దాను గొనును ౧౫౩

సీ॥ మునిపుంగవుల గొల్చి - పూజించి శిష్ట ధా
త్రీ దేవ వరులను - దృప్తి పఱచి
క్షత్రియ శౌర్య ప్ర - కర్షణ గల్పించి
వైశ్య విచిత్ర వి - భవములఁ గూర్చి
పాలికాధిక్యంబు - నారసి వీర ని
షాద ధనః ప్రద - ర్శనము జరిపి
నర్తక గాయక - నటకులఁ బిల్చి వి
విధ వాద్య నిపుణుల - వెదకి తెచ్చి

తే॥ గీ॥ లాలితంబుగఁ బసుల న - లంకరించి
సర్వ శాస్త్రార్థి కాముల - సత్కరించి
సకల భిక్షు కార్తులకు నా - శ్రయము నొసంగి
పండు వొనరించుటయ సూశు - భావహంబు ౧౫౪

మ॥ వనరాజింబులు నాఁ బ్రసిద్ధిఁ గను శుం - భ ద్గుల్మ భూజంబులన్
గొని తేఁ బంపుఁడు వల్లవ ప్రవరులన్ - గోవర్ధన క్ష్మాధరం
బున సంస్థాపన సల్పి బోధించుటకు స - మ్మోదంబుతోఁ జిత్ర వ
ర్ణ నికేతాంబర పుష్పమాలికలఁ దే - రం బంపుఁ డర్ఘ్యార్థమై

మ॥ ఉపవాస క్రమ శిష్ఠుల ప్రముఖులన్ - యోగ్యంబుగా నాశ్రమా
ళి ఫలాహారుల సత్ఫలంబుల బరో - లేహ వ్రతాఖ్యాతులన్
విపులక్షీరములన్ శిరోంఛ పకల - నీవార నిష్ఠాత్ములన్
గృపణత్వంబును మాని తన్వీసు మీ - కృత్యేశు సార్థంబగన్

ఉ॥ ఈ నవ పర్వతోత్సవ మ - హీన జనాళికిఁ బ్రస్ఫుటంబుగా
నూని సమస్త రాష్ట్రముల - కుత్తమ చారులఁ జాటఁబంచి యా
వ్యాసముఁ జేసి నర్తకులఁ - బండితులన్ గవిరాజ సర్వ వి
ద్యానిధులన్ గళావిదుల - ఖ్యాతిగ వారల సత్కరింపుఁడీ ౧౬౩

చ॥ ఇటు వచియింపఁ గృష్ణుఁడు సు - రేంద్రుని యాగము మాని భూధర
స్ఫుట పరిపూజనల్ సలుప - భూతి లభించు నటంచు నమ్మి యు
త్కట పరితోషమై వ్రజని - కాయము మెచ్చె యశోద పుత్రు ప్రా
కట శ్రుతిశీర్ష దివ్య మత - గాథయె భూత హితార్థ మంచెదన్

ఉ॥ మాధవ సూక్తులం దనిసి - మన్ననఁ జేసి వ్రజాధినేత ల
త్యాదర మొప్ప భూమిధర - యాగ దినంబును నిర్ణయించి సం
బోధన సల్పి వ్రాసిరి వ - భూత్కర పండిత గాయకాళికిన్
భూధర నూతనోత్సవ మ - నూనముగా జరిపింతు మంచొగిన్

క॥ నిర్ణీత దినము నాఁటికి
నర్ణవ వేష్టిత ధరా ప్ర - జాసీకంబుల్
కర్ణాకర్ణి విషయ మా
కర్ణించుట గుములుగట్టి - కదలెం గనఁగన్ ౧౬౪

వ॥ అంత నా బృందావాసులు ౧౬౫

క॥ ఆబాల వృద్ధు లెల్లరు
లేఁ బఙ్ఙులఁ జక్క బరచి - గృహములఁ గడఁకన్
బోఁ బోసిరి గిరి ముఖులై
యొంబృందను బనులఁ దగిలి - యవసరము లతోన్ ౧౬౬

కొందఱు బండ్లపైని మఱి - కొందఱు స్యందనరాజి యందు గో
బృందము పైని గొందఱు మ-దేభ హయోష్ట్రవరాదు లెక్కుచున్
గొందఱు డోలలందు మఱి - కొందఱు దో్య చతురంత యానముల్
కొందఱు పొంది వెళ్ళిరి - ఘోష నగోత్సవ దర్శనార్థమై

సీ॥ గీము వెడలి వచ్చి - క్రీడ స్మృతికి రాఁ
దేరఁ దిరిగి పోవు - నీరజాక్షిఁ
బల్లె వెళ్ళఁజని - యొల్లె కప్పడ కున్న
వెన్కకు నేఁగు నా - భీర యువకు
సభ్యాంతరమున భ - ర్త్యాదుల మఱచుట
మగని గీమున కంపు - మచ్చె కంటి
నగము చేరువ కేఁగి - నగలక్కై వగచు ని
ల్లాలిఁ బైఁ గినియు వ - ల్లవుల మేటి

తే॥ గీ॥ వసతిఁ జేరియు పైకపుం - బరణిలేమి
మగిడి నివ్వెఱఁ బారు దం - పతుల జంట
నరయఁ దగు నాఁటి భూరి భూ - ధర మహోత్స
వావశ భ్రాంత గోకులా - వాసు లందు ౧౭౮

ఉ॥ పాటలఁ బాడుకొంచు సరి - బాటలఁ బోక తలంగి యాడుచున్
మాటలఁ జెప్పికొంచు నిసి - మాటఁ దలంపక ప్రొద్దుఁ బుచ్చుచున్
బేటల గోటలన్ గడచి - నీటగు మూటలఁ జేఁదగిల్చి చె
ల్లాటము లాడుచున్ దరిసి - రా నగమున్ యువ గోప గోపికల్

సీ॥ చెట్ట వట్టి మెలంగి - చెలఁగి ప్రేయసులతో
నర్మోక్తు లాడుచు - నడచు వారు
ఒడి బిడ్డ మూఁపుపై - నెడ బిడ్డఁ జంకలో
గుదియించి కొలుచుం - గదలు వారు
బిడ్డల నార్చుచు - బీరము ల్వల్కుచు

సందడి దండడి - సాగు వారు
దువ్వలువలఁ గమ్మ క్రొ - వ్విరుల్ దాల్చి రయ
య్యాగమ్ముకు నడ - యాడు వారు
తే॥ గీ॥ కృష్ణ మాహాత్మ్యమెల్ల స్మ - రించు కొనుచుఁ
దోఁగి భక్తి రసంబునఁ - దూఁగు వారు
నగుచు గోకులావాసు లా - యద్రి మాని
తోత్సవము నాఁడు దేలిరి - తోష వార్ధి ౧౭౨
ఉ॥ ఈవం భూధరోత్సవము - బృంద ఘటిల్లు నటన్న వార్త న
ర్వావని వ్యాప్తిఁ జెంద విష - యాంతర వాసులు విస్మయాత్ములై
యావఁజాత్తు దర్శనము - నద్రి మహోత్సవ మబ్బుఁగాంచు బృం
దావన సీమకుఁ గదలి - తద్దయు మక్కువ జేసి రెల్లరున్
సీ॥ వివిధ వర్ణ కుటీర - విటప నానావిధ
పట గృహ పటల మే - ర్పాటు చేసి
ఆరోగ్య శాలా మ - య నివారకా గార
ములు పశువైద్య శా - లలు రచించి
దీన శరణ్యా విదేశీ య - రక్షణ
భవన గోశాలలు - బాదు కొలిపి
విపణి మార్గంబులు - వీధులుఁ బాచక
సదనముల్ భోజన - శాల లునిచి
తే॥ గీ॥ మల్ల రంగముల్ నాటక - మందిరములు
గాన శాల లుత్తమ సురాం - గణము లెలమి
గల్పనముఁ జేసి గోపాల - గణము నాఁటి
పర్వతోత్సవ మత్యు ప - ర్వం బొనర్చె ౧౭౪
తే॥ గీ॥ నలుఁగడల నూడిపించి గో - మయముఁ బసవుఁ
గలిపి కలయంపిఁ జల్లి ముగ్గు - ల్గులనుఁ బెట్టి

యఁగరు సాంబ్రాణి గంధంపుఁ - బొగలఁ దీర్చి
పడఁతుకలుఁ బండువు ది - నాలఁ బాలు గొనిరి ౧౭౬

ఉ॥ పచ్చని తోరణంబులు స - భా సదనంబులు మేలు కట్లు పూఁ
గుచ్చులు రంగు గంబములు - గోళము లిద్ధ నికేతనంబులున్
ముచ్చటఁ గొల్పు దీపిక ల - నూనముతో ప్రభ లగ్ని చిత్రముల్
గ్రుచ్చర నా నగోత్సవము - కాలమునన్ సమకూర్చి రా ప్రజల్

సీ॥ పటహా దుందుభి తూర్య - వాద్యంబు లొకచోట
నాగ స్వరాదిక - నాద మొకట
నర్తక గాయక - నటకాళి యొకచోట
భజన పరులు భక్త - వరులు నొకట
కథక పౌరాణిక - కవి బృంద మొకచోట
శాస్త్రి వాదుల పరి - షత్తు లొకట
యోగ విద్యాది ప్ర - యోగంబు లొకచోట
శస్త్ర ధనుః ప్రదర్శ - నము లొకట

తే॥ గీ॥ పంబ జోళ్లను మల్ల రం - గంబు లొకట
బుఱ్ఱ కతలును వింత కీ - ల్బొమ్మ లొకటఁ
బకు ప్రదర్శనములు సంత - బాఱు లొకటఁ
బరఁగి యానాఁటి యచలోత్స - వంబు వెలిఁగె ౧౭౭

ఉ॥ "హా" యనునార్తిఁ "డీ ఘటన - హాయిగ లే"దను మానవుండు "చాల్
సీ" యని త్రోయు పౌరుఁడును - లేమిడి "నన్నము మాకు రామచం
ద్రా" యనుదీనుఁ "డామయము - డార్కొనెఁగా"యనురోగియొండు లేఁ
డా యచలోత్సవంపు సమ - యమ్మున నందునకైన రోయఁగన్

సీ॥ సోపానములు దీర్చి - సుఖముగ విశ్రాంతి
మంటపంబులు - మధ్య మధ్య నిలిపి
అచ్చు టచ్చుటను దే - వాలయంబులు గట్టి

దేవ మూర్తులను బ్రతిష్ఠ జేసి
శిల్ప కారులఁ జేర్చి - శిలలఁ బౌరాణిక
దృశ్య చిత్రముల జి - త్రింపఁ జేసి
ఫల పుష్ప గుల్మ జా - తులు వివిధోర్వీజ
కుంజ నికుంజముల్ - కుదురు పరచి
తే॥ గీ॥ బావులు సరోవరమ్ములఁ - బాదుకొల్పి
ఘన జలాపాతములకు సం - స్కరణ మిచ్చి
యింపుగను శిఖరమ్ముఁ జి - త్రించి మించి
నాటకం బయినేసి భా - సగను బ్రజలు ౧౬౯

క॥ సప్తాహ దీక్షతో ని
ర్లిప్త విపుల కార్య సరణిఁ - గృష్ణానుమతిన్
లుప్త పడకుండ నడపి స
మాప్తి యొనర్పఁగ సుషుప్తి - మానిరి గోపుల్ ౧౭౦

వ॥ ఈ యదనున యనుకుందురు "పదియుండ్రై మహాతిరేకంబున నాభీ దురపాణి మదిరానక్తులగు నాభీర సముదయము మునుమూరు మొదవుఁ బిండు నెవ లగుల సదవగలుగఁ జెపిరఁ గొట్టు విధి నెనకు నని మది నాటింగి శేముషీ మతులగు జ్ఞాఁ బనికాండ్రఁ జితించి నియమింపించి వింత వింతలగు గుంతల నా నగంబు కొంత దొంతలు దొంతలుగా నావంత విశ్రాంతిఁ గొనక యఖండ పొందు పరచియు మందల మందల మంది కిందగు సందు కలిగియు గోబృందము దలచి సంపడి తొందరఁ గొందల వడక మందలు మందలుగా డాఁగందగు భూభూధర కందరంబులం దశేష తాపీకంబులం దవిలి యుం దమర్చించి యీచంద మెందులకో యని సందియపడు మందకాపుల యాక్రందనము వీనుల విందైనను డెందమునం గల మూలా కందమ్ము గుప్తముగ నిక్షిప్తము నొనరించి యాప్తగోగోపాలక ప్రాప్య ఫలాప్తికై సప్తాహ దీక్షా సమాప్తికై సుషుప్తియు విడిచి కడఁక జడి

పాపి [illegible] గట్టుటొడయని పంపున వడివడి నసపుచుండెఁ దుది
దివసంబున. ౧౫౧

తే॥ గీ॥ నాఁడు పూర్ణాహుతి నొసర్చి - నగము నకును
గప్పురపు టారతుల నిచ్చి - కదలి యద్రిఁ
జుట్టి వార్వోసి మేకముల్ - సొదలు చదలు
మిట్టు నుత్సవపుందుది - ముట్టె ప్రజలు ౧౫౨

సీ॥ ఈ గిరిరాణ్మహోత్సవము - నే మహితాత్ముఁడు నిర్వహించె నేఁ
డా గురునాథు సత్కరణ - న్యాయమటంచు మనస్కరింప గో
పీ గణ గోపకాళి గురు - వీథి యమూద్యవాహి నిల్పి సక్రమతన్
మూఁకి నమస్కరించి గురు - పూజల సల్పె నిగాఢ భక్తిమై ౧౫౩

శా॥ ఆలో వజ్రి ప్రజాధి నాయకుల య - త్యాచార దుర్బుద్ధికిన్
వ్యాలోలుండయి నక్తదలంపకయ యీ - యాభీర లీయాగ మి
ట్లీలా చేయుట యెట్టి దుంపగము ప్రై - రింపంగ రాఁబోలునే
నాలావుల్ ప్రకటించి వారి జనమున్ - సర్వంబు శోధించెదన్ ౧౫౪

ఆ॥ వె॥ దుండగులకు నవజ్ఞ - దుర్బోధ లాలించి
నాకు సవకృతిని నో - నర్సఁ దగునె?
నాకుఁ గినుక వొడమ - నంద నందనుఁ డెట్టు
లుద్ధరింపఁ గలఁడొ - యనాని నేఁడు? ౧౫౫

మ॥ అని రోషావశుఁడై ఘనాఘన నికా - యంబున్ నియోగించె ఘో
ర నితాంతాశనిపాత దిగ్భ్రమిత ధా - రాపాత నీరంధ్ర సాం
ద్ర నిరాఘాట నిరంతరాయ నిరయ - ప్రాఢోరు పాషాణ కాం
డ నిబద్ధోద్ధత వర్ష ధార గురియున్ - మంద న్నిగాఢంబుగన్ ౧౫౬

ఉ॥ ఈ విపరీత వర్షమున - కేమియు దోఁచక భీతులైన బృం
దావన వాసులున్ బసులు - దద్దయు నుత్సవ దర్శనార్థమై
మావన భూమిఁ జేరిన ఘ - నాళిని నొక్కఁడను పెక్కురూపులై
వావిరి దాఁచె భాగువాలఁ - బర్వత కందర పాళి గుంతలన్ ౧౫౭

క॥ నగభేదియు నెడ తెగక
పగిదిన్ దిన సప్తకంబు పాషాణాంభో
ద్విగుణిత ధారాపాతము
మిగుల మిగుల గురిసి కురిసి - మితిమీఱుచు వగన్ ౧౨౮

ఉ॥ ఏడు దినాలు ఱాలు గురి - పించితి మందను బ్రుందకు డు -
డేడి? వరజాభ్య కోక్తులకు - నీయకొనం దగు శాస్తి గల్గె నూ
హూడం చటుచు నాకలకుం జూపు మహేంద్రుడు తెల్లవోయి నో
రాడక నిల్చె వాన జడి - నాపి సుఖస్థిత గోపులంగనన్ ౧౨౯

క॥ అచలేంద్ర సురక్షితులై
యచలితు లయి వీకం జెడని - యాభీరుల గో
నిచయ స్థితిం గని విభ్రాం
త చకిత చేతస్కుండై మ - ద వర్జితుండై ౧౩౦

తే॥ గీ॥ అంత నాగ్రహ పరవశో - దగ్రుం డగుచుం
జేత వజ్రాయుధమ్ము దా - ల్చి నగ భేది
"నాకు లక్ష్యంబె? యిపుడ యీ - నగము పగిలి
పిగులదే" యని వజ్రంబు - విసరి వైచె ౧౩౧

చ॥ ఇది సకల మ్మెఱింగి కమ - లేక్షణుడా నగరాజమున్ జయ
ప్రద మొనరింపం బూని నిజ- బాహుల సాంచి గ్రహించి యుండినన్
వదలక దేవతాధిపుని - వజ్రము వీగి వికా వికల్గనన్
చెదరి విభీతుండై కదలె - నివ్వెఱ వజ్రి కలంగి తద్దయున్ ౧౩౨

క॥ మ్రానుపడి కొంతతడ వవ
మానమ్మునం దూలి యెరియ మానస మెంతో
యానవము వాల్చి తనయ
జ్ఞాన మెఱుంగం దమము వదల సాంగెం గ్రమముగన్ ౧౩౩

క॥ యోజింపం గొంత సేపు వ

మోజాసను పరిభవ మను - రోన్మథనము నం
భోజాక్షు నవతగణ ము
వ్యాజముగ స్ఫురించె నతని భావమ్మునకున్ ౧౫౪

సీ॥ అంతట సాత్త్వికోదయ మ - హా త్త్వము నంది సురాధినేత ని
ర్ఘాంత మనస్కుండై కొలంది - కాలము వేదురు నొంది నట్లు దు
ర్దాంత విచార మొందఁ నిజ త - త్త్వ మెఱింగి పరిభ్రమించి య
త్యంత విషాదముం గనె యథాస్థితి గోచరమైన నాత్మలోన్ ౧౫౫

తే॥ గీ॥ వ్యోమ యానము నడచుచో - యుంచి యొక్కఁడ
యమర బృందమ్ము వీక్షించి - యవతరించెఁ
బుడమిపై నొక్కరుఁడ తోడి - యుడు గణమ్ము
వదలి రేరేఁడు పుడమిపై - వ్రాలి నట్లు ౧౫౬

మ॥ దిగి గోవర్ధన శైల భూముల మద - ద్వేషాతి మాత్సర్యముల్
దిగి పోఁ గాల్నడతో నెగాదిగ వనుల్ - వేఁగన్నులన్ రోసి యా
నగ సామీప్యముఁ జేరబోయిఁ గనియెన్ - సంతోష వర్ధిష్ణుడై
త్య గణోన్మాద జయిష్ణు విష్ణు రిపు సం - ఘా కృష్ణు రోచిష్ణునిన్

క॥ వినమిత వదనుండై సం
జనిత భయోద్రేకుఁ డగుచు సరభ సగతులన్
వినయము సంభ్రమమును నా
ననమున రేకెత్త డాసె నగధరు పదముల్ ౧౫౭

ఉ॥ చేరి గళద్ధృగంబు కణ సిక్త కపోలముఁతోఁ జల ల్లస
ద్ధార కిరీట భూషణ వి - తానముతో నరుణోద యు ప్రభో
దార ముఖాంబుజ శ్రవణ - దారుణ పాదకరోష్ఠ రాజితో
శౌరి పదాంబుజద్వయి వి- చారముఁనం బడి వ్రజి యిట్లనెన్ ౧౫౮

ఉ॥ గాఢ తమ స్తమోఽధిక వి - కార పరీవృత మానసుండనై
మూఢుఁడనై రజః పటల - మోహిత దుర్దమ గర్వ మత్సరా
రూఢుఁడనై భవద్విషయ - రూఢి స్మరింప ఖగేంద్ర వాహనా.

క॥ ఏ గో, గోపావనమున
కై గాసి వహించి సతము - గడగెదవో నీ
వా గో గోపకు లే యి
చ్చో గానం బడెడి గోప - సురభులు సుమ్మీ! ౨౦౭

క॥ ఇకనైన దమోరాజస
వికలితమతి సఘము బొచ్చి వేసరు గనకే
సకల మొటిలగి విధ్యుక్త
ప్రకటిత ధర్మాను మతిని - బరగుము తండ్రీ! ౨౦౮

సీ॥ పాత్రిక్తన పుణ్యభాగ్యమున - వచ్చిన యీ యధికారయుక్తి నీ
శక్తి మహత్త్వమే ? యిదియు - శాశ్వతమే? క్షణభంగురమ్మనై
రిక్తయు నైన యీపదవి రీతి నెఱుంగని గర్వితోద్యమా
సక్తి విముక్తి భాజనమె? - సద్గతి కారణమే? సురాధిపా! ౨౦౯

తే॥ గీ॥ ఎంత యధికార బలమున్న - నంత కేను
మడుగు లడగి యుండు నతండు - మాన్య జీవి
యతడె నాకు ప్రియుండు గ - ర్వాంధు నొక్క
నిముసమేని సైరింప దృ - ణీకరింతు ౨౧౦

మ॥ అన సద్బోధితుడై సురేంద్రుడు ప్రణా - మానీకము ల్సల్పి వీ
డ్కొనె నాబద్ధ కరాబ్జుడై నత శిర - స్కుండై ముదోత్పన్నుడై
మన మారం బరిరంభణ క్రియల సం - భావించి దీవించి వీ
డ్కొనె వెన్నంటి యొకింత దవ్వరిగి యా - గోపాలుడున్ వజ్రిగో ౨౧౧

తే॥ గీ॥ నాటి గోపక గీతికా - నాదములకు
నాటి గోపికా వనితల - నాట్యములకు
నాటి ప్రేక్షక స్తుతి వచో - స్వాదములకు
నేటి దనుక నే నాటను - సాటి లేదు ౨౧౨

ఉ॥ శౌరి ప్రబోధచే ప్రజలు - శక్రుని యాగము మాని దానికి

మారు నగాధ్వరంబును బా - న్పను శీఘ్రముఁ డుగ్రుఁడై శిలా
ధార ప్రజావళిపైఁ గురియఁ - డాళ్చి ధరాధరమున్ గరంబుపై
వారిజ నాభుఁ డెల్లరను - బాలనఁ జేసె నటంచు నీకథ
వేడుగఁ గొన్ని చోట్ల వినిపింత్రు నిజంబెట్లైన యుక్తమే. ౧౧౩

ఉ॥ ఏకథ సత్యమైనఁ గురి - పింప శిలాంబువులి ద్రుమ [illegible]మై
వీఁక నగంబు నెత్తియొ యు - ఛేద్య శిలా రచన ప్రయుక్తినో
వ్యాకుల వల్లవావనముఁ - బొల్పడి కృష్ణుఁడు నిర్వహించె న
స్తోక మహీష్టిరైయె బహు హి - తోదయ మా నతి [illegible]మానుషకీ యు॥

ఉ॥ అంతియు కాక శత్రువు వి - యచ్చరుఁడై చ[illegible]స్త్ర [illegible]
పంతిమహాత్మ్యో ధర్మ గుణియు - ప్పటిన నేవిధి భూజనా[illegible]
గుంతల దాఁగి లోఁబడక - గూఢముగాఁ జరియింప వచ్చునో
వంతలఁ బొంద కట్టి నిర - పాయక మార్గము నేర్పనొజ్జయై ౧౧౫

తో ట క ము.

సారస లోచన! చక్రవిహారీ! - దారుణ దుష్కృత! దైత్యవిదారీ!
భార తమోమయ పాప నివారీ! - స్ఫార మనోహర సన్మయ శౌరీ!

గద్య

ఇది శ్రీమదిందిరానాథ ప్రసాద లబ్ధ సహజ కవితా
విరాజమాన శ్రీమద్గౌతమ సగోత్ర దివి
వంశోద్భవ నరసింహాచార్య పౌత్ర వేం
క టా చా ర్య ర ం గ మాం బి కా
తనూజ ర ం గా చా ర్య ప్రణీత
శ్రీ కృష్ణాతిమానుషతత్త్వ
ప్రథమఖండాంతర్గత
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

# శ్రీకృష్ణాతిమానుషతత్త్వము.

## చతుర్థాశ్వాసము.



క॥ కమలాసన నుత! కమలా
రమణీ హృత్కమల భృంగ - రాడ్వర! ధృత స
త్కమనీయ చారు వేణూ
త్తమ కరకమలా! ప్రఫుల్ల కమల దళాక్షా ౧

వ॥ అవధరింపుము

ఉ॥ ఇందుఁ బరాభవంబును సు - హేందుఁ బరాప్రభవంబుఁ గంసధా
త్రిందుఁ దమాగతంబు భుజ - గేంద్రుఁ బరిష్కరణమ్ము నస్య హై
త్యేంద్రు వికల్ప నంబుఁ ది - గింద్రులకుం జెవిసోఁకి నంత నీ
రేంద్రుఁడు పశ్చిమేంద్రుఁడుఁ బ్ర - జేంద్రునిఁ గృష్ణునిఁ జూచు వేడుకన్

వ॥ వేచి యుండ నంత నొక్కనాఁడేకాదశి యగుటచే నందుఁడు ౪

తే॥ గీ॥ వర్తి కర్మ నిర్వర్తించి - వారిఁ గ్రుంకి
బాహ్య పరిశుద్ధికై యుప - వాస దీక్ష
నాత్మ జగదీశుఁ గీలించి - యాత్మ శుద్ధిఁ
జెంది వేఁగించె నిద్దురఁ - జెందకుండ ౫

వ॥ ఇట్లేకాదశీవ్రత సమాప్తిఁ గావించి యుఱునాఁడు ద్వాదశి యగుట నేకాదశ స్నానకృత్యంబుఁ దీర్ప యమునా హ్రదంబున కేఁగి క్రుంకులిడ సమకట్టు నవసరంబున. ౭

చ॥ ఇది సమయంబటంచు నని లేశ్వరుఁడౌ వరుణుండు భృత్యులన్
బాదివి నదీ నిమజ్జనము మాసమునన్ బొనరించు నందు నిన్
నసయుతేఁ దేరఁ బంపఁ జని - చారులు తోడ్కొని పోవఁ జూచె
యుపక విభూత్రమాలయము - నాని కృపాజ్ఞను దాల్చియాదలన్

ఉ॥ నందుఁడు వారిఁ గ్రుంకియుఁ గ - నంబడకుండుట రోసిరోసి యా
క్రందముతోడ గోపులు బి - రాన ముకుందుని పాలికేఁగి చే
ష్టాదన చిత్తవృత్తి నిజ - వార్త నెఱింగియుఁ దత్తరించి పా
తెం దరియన్ హ్రదంబును బ - రీక్షితులై వ్రజ మెల్ల రేఁగగన్ ౮

వ॥ ఇట్టుల నా యమునా హ్రదంబు దరిసి ౯

సీ॥ దరహాస చంద్రికా - కర కరద్యుతులఁ బొ
ల్పడి మోము జాబిల్లి - కేవ్రుదివ
కమనీయ ఫుల్ల వి - కసితంబులైన వా
ల్గనుఁ దోవల్ ముదిపడి కుందఁ బార
దిక్ప్రీతి ఫలకాచ్ఛ - దీప్తంబులైన పోఁ
డిమి బుగ్గ నిగ్గుట - ద్దములు గిమల
కాంత పరివాళ శ - కల మైన మిసిమి వా
తెఱనుండి పల్లవ ము - త్తెమ్ము లురల

తే॥ గీ॥ నలికి ముంగురుల్ నుదుట జి - ప్డులను వేయు
గులికి కలికి తురాయి ము - ద్దులను గొలుప
నొలికి నును బొజ్జ ముజ్జగంబులు వఢంకఁ
దలఁక కానది నంచవం - దన్నను దుమికె ౧౦

క॥ దుమికి తటాలున మునిఁగెను
యమునాహ్రాద జలములందు - నయ్యెడఁ గృష్ణున్ సం
భ్రమమున దరిసిన గోపులు
భ్రమపడి నివ్వెఱఁగు నంది - ప్రార్థించి యార్తిన్ ౧౧

చ॥ అట వరుణాలయంబున వ్ర - జాధిపు నందుని హేమపీఠ సం
ఘటితు నొనర్చి నీరపతి - గౌరవమిచ్చి మహానుభావ తో
ల్లిటి భవదీయ సత్తపము - లెన్నఁగ నెట్టివొ కాని పెంపఁ గల్గె నె
క్కటి పెనువేల్పుపై రయిరులు - గానఁగ లేని నిరంజనున్ బరున్

తే॥ గీ॥ సీకృతంబున నేని యా - లోక నాథు
దరిసెనముఁ జేయఁ గలఁ గను - తలఁపు నొంది
భృత్యులను బంపి మిమ్ము ర - క్షించు కొంటి
దీనఁ గిల్బిషక యాశీర్వ - దింపు మయ్య ౧౩

మ॥ అనునంతన్ నగు మోము వెన్నెలలు గా - యన్ గందొవల్ తేనియల్
దనుకం జిక్కని చుక్కలై నఖము లు - ల్లాసమ్ముగంగాలి మో
ముసఁ గాంతుల్ దెసలెల్ల నల్లుకొనఁగ - మోమ్మోగిన్ వినోద క్రియన్
దనరారన్ నవ వేణువు ళ మెుదటన్ - గన్పట్టె గోపాలుఁడే ౧౪

వ॥ అంత. ౧౫

ఉ॥ దిగ్గునలేచి యుల్కిపడి - దిక్కతి దెల్లనవోయి కాళ్ళపై
నొగ్గి నమస్కరించి మొగ - మోడి శిరమ్ము వాల్చి మెల్లఁగా
సిగ్గునఁ బెగ్గ తగ్గి నుతిఁ - జేసెఁ గరమ్ములు మోడ్చి కంటనీ
రగ్గలమై ప్రవాహమయి - యంబుధియై చదలంటి పొంగఁగన్ ౧౬

మ॥ త్రిజగన్మోహన! నంద నందన! ధరి - త్రీభార సంపోషణా!
విజితానేక రణాంగణా! యసుర - రాడ్విద్రావణా! తోషణా
వ్రజ సంరక్షణ! ధర్మపాలన! మహేం - ద్ర బ్రాహ్మణా రాధనా!
యుజి సంశోధన! భోగి మర్దన! యవి - ద్యా చ్ఛేదనా! పావనా! ౧౭

చ॥ ఎఱుఁగవె? యేల యీపగిది - గృత్రిమ లీలఁ జరించి యుంటివో
నెఱసులు గల్గునేని కరు - ణించెడి భారము నీదెకా? మఱిన్
నెఱఁ దలపోయు వారి గమ - నించి క్షమింతువు గాదె? దేవ! నీ
యెఱుఁగని దేది? నన్ను నయి - రింతువొ? దండనమున్ విధింతువో

మ॥ తొలి జన్మంబున నే తపఃక్రియలఁ బ్రీ - తుం జేసిరో నిన్ను గో
వులు గోపీ జనముల్ వ్రజార్భకులు శం - భు బ్రహ్మ ముఖ్యామరేం
ద్రులు వీక్షింపఁగ లేని నీ విమల స - న్మూర్తిన్ బ్రియంబాఱ ని
చ్చలు దర్శించి స్పృశించి జన్మ తరియిం - చన్ గాంచిరో మాధవా

చ॥ నియమిత ధర్మమున్ విడిచి - నీతి విహీన గతిన్ జరించుట
ప్రియమని యెంచి భక్తజన - హృత్ప్రియు సత్యవిదున్ ముకుందు స
ఖ్యయు నిను నొక్క వ్యాజమున - నజ్ఞతఁ దెచ్చిన ద్రోహిఁ బాపి ని
శ్చయముగ దండ్యుడన్ సరసి - జాక్ష క్షమింతువొ? సంహరింతువో?

చ॥ అనవిని వాసుదేవుఁడు ది - శాధిపు భీతిని బాపి కౌఁగిటం
జొనిపి "యపాంపతీ! హృదయ - శుద్ధిఁ బ్రొసర్చిన నీకృతంబు మ
న్ననమునఁ గాంచితిన్ నినుఁ గ - నం జను దెంచితి లెమ్ము ధర్మ పా
లనమున నన్నుఁ జేరఁగఁ గలాఁడ" వటంచని యానతిచ్చినన్ ౨౧

క॥ వరుణుండు వినమితుండై
నిరుపమ భయ భక్తి లోలుఁడ - నీరజ నాభున్
దరిసి పదమంటి పూజలఁ
బరితుష్టు నొనర్చి చూపి - వల్లవ నాథున్ ౨౨

మ॥ అదిగో నందుఁడు పుణ్యమూర్తి భవద - త్యంతాను రాగాప్తుఁడ
భ్యుదయ శ్రీయుతుఁ డప్రమేయ సుయశో - భూత్యుజ్జ్వల స్ఫూర్తి స
ద్వ్యాసమార్గన్ గొని పోఁగదే యితని సం - భావించి రప్పించి నె
మ్మదిఁ బూజించితి నిన్నుఁ గోరి హృది నీ - మహాన్వేద్ధ చారిత్రమున్

తే॥ గీ॥ ఈయుదంతము నెల్ల వీ - క్షించి బహుళ

సంభ్రమ స్వాంతుఁడైన వ్ర - జాధినేతఁ
గ్రుచ్చి కౌఁగిట యదు కు - మారుండు చేర్చ
స్వస్థుఁడయ్యె యథావిధి - సకల మెఱిఁగి ౨౫

తే॥ గీ॥ అంత వరుణుఁడు నంద గోపార్భకులకుఁ
బ్రణుతు లర్పించి పిలిపించి - భటుల వారిఁ
దిరిగి స్వస్థానమును జేర్చి - తిరిగిరా వ
చింప సత్కారించిరి శీఘ్రు గతిని ౨౬

మ॥ యమునా తీరము నందు గోపకులు ఘోషా వాస గోపీ సమూ
హము లత్యంత విషాద మగ్నులయి డో - లాందోళులై చిత్త వి
భ్రములై యున్న వ్రజాధి నేతయును నా - పద్మాక్షుఁడుఁ గాన రా
నమితో త్సాహ పయోధి నీఁదిరి యమం - దానంద సంధానులై

వ॥ మఱి కొంత కాలమునకు సరస్వతీ తీరమునఁ గల యంబికా వనమున
జరుగు మహేశ్వరోత్సవమునకు గోకుల మండలి గోపీ గోపకు లందఱుఁ
జనిన. ౨౭

ఉ॥ నందుఁడు శ్రీ యశోద యదు - నందనుఁడుఁ బలరామ రోహిణీ
సుందరు లమ్మహోత్సవముఁ - జూచుటకై శకటాధి రూఢులై
బృందఁ దరించి యరాయటవి - కేఁగి సమీప సరస్వతీ నదీ
సుందర భూములం దరిసి - చొచ్చిరి వారిని గ్రుంకు లాడఁగన్ ౨౮

ఉ॥ నందుఁడు వారిఁ గ్రుంకిడి మ - నంబున భక్తిని జేర్చి యంబికా
సుందర దివ్యమూర్తినిఁ ద్రి - శుద్ధి జపం బొనరించి ధ్యాన యు
క్తిం దనరారి సర్వ జగ - తీవలయంబును విస్మరించి యా
నంద వశాత్ముఁడై కడపి - స్నాన జపమ్ములఁ బెద్దకాలమున్ ౨౯

వ॥ నదీ తీరమును సమీపించు నెడ 30

చ॥ అజగర మొండు చుట్టి ముఖ - మట్టె గబాలున విచ్చి పైఁ బడన్
గజగజ లాడి "హా! శరణు - కఁజ దళాక్ష! ముకుంద! కృష్ణ! హా!

ప్రజ పరిపాలకా! భువన - రక్షణ! ప్రోవఁగదే" యటన్న నం
బుజ నయనుండు ప్రుల్కిపడి - పోయి కనుంగొని సర్వ వృత్తమున్

మ॥ పద సంఘట్టన నమ్మహోరగము ని - ర్బాధించి హస్త ద్వయిన్
వదనంబుం బిగఁబట్టి నొక్కినను "కృ - ష్ణా! నీపదస్పర్శ న
భ్యుదయంబై సఫలత్వముం గనియె నా - యుత్పన్న దేహంబు దు
ర్మద మాత్సర్యము లేది వేదవదుటన్ - ప్రాప్తించె సౌభాగ్యముల్

మ॥ అని విద్యాధర రూపమై యురగ మ - త్యాశ్చర్యముం గొల్పి శ్రీ
శునకున్ మ్రొక్కి నితాంత భక్తి కలనన్ - స్తోత్రంబుఁ గావించి యం
త నిజోదంతముఁ జెప్పసాఁగెను వినన్గా నెల్ల రీరీతి సాం
త్వన మాధుర్యవినమ్ర సూక్తులను సం - భావించి యమ్మాధవున్ 33

వ॥ దేవా! నేను సుదర్శనుండను విద్యాధరుండఁ గొంతకాల దివసంబున విమానారూఢుండనై వియద్గమనంబుఁ జేయుతఱి నంగిరస్సంయమి యాకాశ గమనంబున దిగంబరుఁడై చనుటఁజూచి మదోన్మత్తుండనై పరిహసించిన నమ్మౌని తల్లజుండు సర్వమెఱింగి నన్నజగరంబవు గమ్మని శపింప నాతనికిఁ బ్రణమిల్లి శాపము మరల్ప వేడుకొనిన నతండుఁ గరుణించి శ్రీకృష్ణ పదహతి నీ శాపంబు వోయి యథాస్వరూపంబు కలుఁగునని వచించి తిరోహితుఁడయ్యెనని వక్కాణించి యా సుదర్శనుం డిట్లనియెను 34

సీ॥ గత జీవయై శిలా - గతి నున్న నాతి స
        ద్గతి గాంచె నీ నఖ - తాడనమున
చైతన్య శూన్య నిశ్చల - దర్శనములు సి
        ద్ధత్వ మొందెను భవ - త్స్పర్శ కలన
దుర్భర దుర్మద దురితుఁడౌ విష భోగి
        ఘన యోగి యయ్యె నీ - కరుణ కలిమి
దండహ్యమానాగ్ని - దగ్ధ కాననము శృం
        గారమై వెలిఁగె నీ - కర విభూతి

తే॥ గీ॥ ముగుద యబల సంసార ని - ర్ముక్త యగుచు
రాణఁ జెందెను నీ పరీ - రంభణమునఁ
గుమతి నగు నేను శాపోప - శమన మంది
గాంచ నే నిన్ను నీ పాద ఘట్టనమున ౩౫

మ॥ భవదీ యాప్రతిమాన దర్శన మహా - భాగ్యమ్ము చేకూరె నా
భవ రాసుల్ మటు మాయమై తలఁగె నా - బ్రహ్మభవేంద్రాది దే
వ వరుల్ నిత్యముఁ గాంక్ష చేసెడి భవ - ద్భవ్యావతారోజ్జ్వల
న్నవ కౌమార విలాస రూప గరిమన్ - దర్శించితిన్ ధన్యుఁడన్ ౩౬

క॥ అనుచు సుదర్శనుఁడు పునః
పునః ప్రణామములు సలిపి - ముదల నడిగి కై
కొని వ్యోమ యాన గతుఁడై
చనియె నిజేచ్ఛను వ్రజాళి - స్తబ్ధతఁ గనఁగన్ ౩౭

వ॥ అచ్చట మధురా పురంబున నమాత్యుల మగిడి పిలువ నంపి కంస న
రాధిపుండు ౩౮

ఉ॥ "వింటిరి గాదె శౌరి ఘన - విక్రమ లీలలు దుర్వశంబుఁ జే
కొంటిరి గాదె మిత్రులను - గోల్పడి? దుర్భరమైన శోకముం
గంటిరి గాదె? బిట్టలుకఁ - గట్టెడి యాదవుఁ గిట్టఁ జేతు మం
చంటిరి గాదె? యింకయిన - నాసలు వాసి విరామ మందుఁడీ ౩౯

ఉ॥ కాలము కర్మమున్ గలిసి - కట్టుగ నన్యపథమ్ముఁ ద్రొక్కఁ జోఁ
దూలును స్థైర్య సంపదలు - దోర్బల సాహస కృత్యముల్ సము
న్మూలముఁ జెందెడిన్ సకల - మున్ జనుఁ గావున నూరకుంట యే
మేలు వృథా ప్రయత్నములు - మేదుర తాపము నార్తిఁ గూర్చెడిన్.

క॥ ఇఁక నేని నన్నుఁ బుచ్చినఁ
దికమకలను గనక యుసురు - తీపు విడిచి యం
తక నిలయు వాసినై బా

ధక జీవిత ముక్తిఁ గనుము - ధన్యుఁడ వగుమా ౪౧

చ॥ అనిన నమాత్యు లెల్లరు న - రాధిపు పల్కులు ముల్కులౌచు వే
దన నొనరింప మర్మములఁ - దప్పయుఁ బొందిరి వోయి రాజ నా
శనము స్వకీయ భంగమని - స్వాంతమునం దలపోసి కొంతమం
తన మొనరించి యిట్లనిరి - నమ్రిత మానవనాథు సన్నిధిన్ ౪౨

తే॥ గీ॥ కంస జననాయకా! యాత్మ - హీనఁ కంటె
నధమ కృత్యంబు కలదె? ప్ర - యత్నమునను
గాని కార్యంబు గలుగునే - కట్ట కడకు
నెట్టనఁ గడంగు వాఁడపో - దిట్ట జగతి ౪౩

వ॥ అంతియకాక ౪౪

ఉ॥ విష్ణుబలంబు గో విబుధ - విప్రగణంబుల నుండు గాన నా
కృష్ణుని వీడి తత్ప్రియులఁ - గీటడఁగించిన వీలు దూలి యా
వృష్ణి కులుండు లొంగుఁబృథి - వీధవ! సర్వ దిగంత కీర్తివై
జిష్ణుఁడవై వెలుంగుదువు - చేడ్పడి దైత్య విరోధి క్రుంగినన్ ౪౫

వ॥ కావున ౪౬

సీ॥ గోరక్షణము మాని - గో శాలలను నిషే
ధించి గోపకుల శి - క్షించ వలయు
పండిత సన్మాన - పరిపత్తు లాఁపి కో
విద సంతతిఁ బరాభ - వింప వలయు
వసుమతీ సురుల సం - భావన సేయక
సకల కర్మల నుగ్గు - సలుప వలయు
యజ్ఞము ల్విష్ణు నా - హ్వానింప కుండ ము
నీంద్రులచే జరి - పింప వలయు

తే॥ గీ॥ శిష్ట మార్గములను నిర - సింప వలయు
శక్తి పూజార్చకులను - బ్రోత్సాహ పఱచి

దేవతాద్వేష విధుల బో - ధింప వలయు
నీ మతము మీరు నేఁడె శా - సింప వలయు ౪౭

వ॥ ఇట్లు దుర్మంత్రాంగంబులకుఁ జెవియొగ్గి కంస నరాధముండట్లు శాసిం
ప నాజ్ఞాపించిన నాశ్రయములు వీడిన గో, ముని, విప్ర, విద్యద్వర్గంబులు
నానా విపదోన్ముఖంబులై చనియెఁ గొందరు విప్ర మునీంద్రులు బృం
దారణ్యంబు సేరిన వారి కాశ్రయ మొసఁగి శ్రీకృష్ణుఁడభయ మిచ్చిన వా
రు కంసుని వలని భయంబును మాని తమ తమ విధుల సక్రమంబుగ నిర్వ
ర్తించు కొనుచుండె ౪౮

మ॥ ముని బృందంబొకచోట సత్ర సవనంబుల్ జేయఁగాఁ బూను కొ
న్నను నవ్వార్తను గాఢచారు లెఱుఁగంగాఁ జేయఁగా గంసుఁడా
జ్ఞను బంపెన్ నిజభృత్య నాయకులచేఁ - గంజాక్షు నర్చించి శా
సనము న్మీరినఁ జేటుమూఁడు నని ద్వేషవ్యక్త మాత్సర్యుఁడై ౪౯

తే॥ గీ॥ బృంద మాధుర రాష్ట్రస్థ - విప్రు లగుట
గంస నరనాథు నాజ్ఞను - గడవ లేక
యధ్వర ద్రవ్యములు వ్యర్థ - మగు నటంచు
నచ్యుతుఁ ద్యజించి యాగ కా - ర్యములు జరుప ౫౦

మ॥ కమలాక్షుండిది యంతయుం దెలిసి యా - కంసాజ్ఞకున్ భీతులై
సమ శీతోష్ణులు యోగు లే కృపణులై - స్వార్థాప్తికై యాగ మ
శ్రమ లీలన్ బొనరింప వచ్చునొకో? యిక్కార్యంబు సైరింప ను
త్తమ మార్గంబున నేర్పెదన్ హితము మి - థ్యాదృ ష్టివారార్థమై

వ॥ అని తలపోసి యొక్కనాఁడు గోపాలకావృతుఁడై గోవులం దవిలి పో
యి పోయి మునులు సత్రయాగం బొనరించుచున్న యరణ్యంబు పొంత
గోవులను విడిచి గోపాలురతో నిట్లనియె ౫౧

ఉ॥ గోపకులార! మందలను - గూడి యెఱుంగక చాల దవ్వునే
దో పొరపాటునం గడచి - యుంటిమి నేఁడిటుఁ గూరుచుండుఁడీ

యోపిక లేమ మీకుఁ దినుఁ - డోగిరముం గడుపార వేగమే
యాపయి నాకుఁ గోఁగలము హాయిగ నాఁకటి మంట దీరుటన్ ౫౩

శా॥ గోవిందుం డిటు లాంతరీప్సను నా - గోపార్భకుల్ ప్రస్త్రపా
భావాధిక్యతఁ బొంది చద్దిఁ గుడువన్ - బ్రారంభముం జేయఁగ
మోమ్మోలిన్ వేఁడువు నిప్పు రాల్చె హరి బ్రి - హ్మోత్సాహ సమ్మోహన
ప్రావిర్భావ సమర్థ మంజుల గభీ - రాత్యద్భుత ధ్యానముల్ ౫౪

శా॥ ఆ వంశోత్కృష్టమణోచ్చల చ్ఛ్రుతుల బ్రి - హ్మానంద లోలాక్షులై
భావోత్సేక విముగ్ధులై వివశులై - వ్యామోహాకులై క్షుత్పిపా
సా వేళాతురులై విశేషముగ నా - చల్దిం గ్రసింపంగ క్షు
ద్దావాగ్ని ప్రభ లంటకంత రెగసెన్ - దంష్ట్ర్యామానలంబులై ౫౫

ఉ॥ ఆఁకటి బాధ కోర్వక గ - తాశనులై హరి జట్టు ముట్టి "కృ
ష్ణా! కడుపార నోరెను నో - సంగి మమున్ గరుణింప లేవె? నీ
వే కని ప్రోవకున్న భరి - యింపఁ దరంబె? క్షుదగ్ని కీలలన్
గాఁకల నార్పవే యనుచుఁ - గాలియు వెట్ట నిజానుయాయులన్ ౫౬

మ॥ కృప భావించి కటాక్షవీక్షణములన్ - గీలించి వేణు స్వనం
బుప సంహార మొనర్చి యాస్య శశి న - వ్యోత్పన్న హాసద్యుతిన్
పిపాసంబున్ దొలఁగింపఁ బల్కె నిటు లా - భీరార్భకుల్ శ్రద్ధమై
నుప లక్షించి వినంగ శౌరి మకరం - దోక్తుల్ మనోజ్ఞక్రియన్ ౫౭

మ॥ ఇదె యాచెంగట సత్త్రయాగమును యో - గీంద్రుల్ యథాశక్తి భూ
త దయా పూరితులై యొనర్తురు జగ - త్సంప్రీతికై చూడుఁడీ
యిదె ధూమాగ్ని యొకింతవిస్ఫురు నివే - బుజ్జ్వాదముల్ మీరుగా
న దరిం జేరఁ గాన వచ్చు రుచిరా - న్నంబుల్ నవాపూపముల్

మ॥ పరమోత్సాహము నొంది వల్లవులు నం - భ్రమమ్ములం దేర ముం
దర నేనేఁగుదు నేన పోదునని యా - త్మాసక్తిఁ బందెమ్ములన్
బఱవం జొచ్చిరి యజ్ఞ వాటికడకున్ - గాంతారముం దాటి యా

తురులై కార్చుచు స్వేదబాష్పముల సంతోషాత్ములై యార్చుచున్

వ॥ ఈ పగిది నా యాభీర కుమారులు సత్రియాగాశ్రమముం దరిసి యజ్ఞ దీక్షితులై నిష్ఠనున్న మానీంద్రులం గాంచి యిట్లనిరి.

ఉ॥ తాపస చంద్రులార! మన తామరసాక్షుఁ డరణ్య మధ్య మం
దోపికఁ దూలి యాఁకట న - వోదనముం గొని తేరఁ గోరి మీ
దాఁపున కంపెనమ్మ వృథ తార్కొనఁ గంస నృశంసు పంపునన్
బ్రాపయి రక్షగూర్తుమని - పల్కె సుధాభవిధేయ సూక్తులన్ ౬౧

మ. అనిన న్మానులు స్తబ్ధులై తమ యవి - ద్యామోహముల్ సంస్కరిం
పనుఁ గల్పించిన కన్నతెన్నటిఁగియున్ - బాపాత్ములై కయు భ్రీ
తిని, దగ్ధస్థితిఁ గాంచు దేహము పయిన్ - దీపిక జగన్నాథు చిం
తనముం బాసిరి మానులై విగత వి - ద్యారూఢులై మూఢులై

ఉ॥ కొందఱు జాలిఁ దూలుటను - గొందఱు మీఁదికిఁ జూచువారునై
కొందఱు నేల వ్రాయుటను - గొందఱు మెల్లఁగ నేఁప్పు వారునై
కొందఱు వీలుగాదనుటఁ గొందఱు శీర్షము లూఁచువారునై
యుండఱు వ్యగ్రులైరి కమ - లాక్షునిపై నభిమాన ముండియున్

క॥ ఈగతిఁ దికమకలాడెడు
యోగుల దుర్యోగ మరసి - యోగిర మిడకే
భోగిశయనునకు సలిపెడి
యాగం బుపయోగ పడునె? యాగడ మఁగఁజూ ౬౪

వ॥ అని మందకాపులందఱు గందర గోళముగఁ జిందులిడుచుం దలవం దోడరు నాకొందనము జోగి చందురుల డెందంబులఁ గొందల మొందింప నా యడవి మానిసుల గడబిడ నెడఁద నడలగి ముసీవడి విడివడని జడదారుల విడి యత్తాపసుల ముత్తైదువుల మొత్తంబులు గుర్తించి యుత్తలపాటు మాని తత్తరించు నా నెత్తమ్మి కంటిపై బత్తిఁ జిత్తమ్ముల హత్తించి రిత్తలగు జోగితొత్తులఁ గొత్తమొత్తుల బిత్తరింప నిట్లనిరె ౬౫

మ॥ ధరణీ నాయక నాయకుండు త్రిజగ - న్నాథుండు పద్మాసనే
శ్వర దేవేంద్రనుతుండు దైత్య గజరా - ట్పంచాస్యుఁ డామ్నాయ ధ
ర్మరతుం డాశ్రిత భక్తవత్సలుఁడు - సర్వజ్ఞుండు సద్యోగి శ్రీ
కరుఁడా నచ్యుతు వాసుదేవు మఱవఁగాఁ దుంతవ్యమే? న్యాయమే?
మ॥ భవబంధంబులు గూల్చి జీవులకు సం - బంధంబు హ త్తించు ప్రో
డ్భవిశాణ్మార్తి విశంత దివ్య పురరా ట్సామ్రాజ్య విస్ఫూర్తి యా
దవ వంశోద్భవుఁడైన మాధవుని వే - దాంతాధ్వగోద్ధారకుఁగా
సవనా ధ్యక్షుని విస్మరింపఁ దగునే? - సన్న్యాసు లున్మార్గులై 22
చ॥ అభయ మొసంగి మీకుఁ దగు - నాశ్రయమిచ్చి, మహావన క్రియా
విభవముఁ జేర్చి కఁస వృథి - వీవతిచే దురపిల్లు దారుణా
శుభములఁ గూల్చి ప్రోచు మధు - సూదను మీఁదురే? కృతఘ్నులై
యుభయ సుఖాతిరిక్తులయి - యోగము యాగముఁ గోలుపోదురే
వ॥ అని మర్మంబులఁ దూలనాడు నమ్మునిపత్నుల నిందాలాపంబుల నా
లించియుఁ బెడచెవిం బెట్టిన రోసి యమ్ముని భార్యలెల్లరుఁ గలిసి
ఉ॥ బుద్బుద తుల్య దేహులకుఁ - బోకలు రాకలు సాజ మేకదా?
యుద్భవ మందు భూత తతి - యున్కి - తిరంబె? తెగించి శౌరికిఁ
త్పుద్భుడఁ బాగ్ని పోయి బుది - గో నశఁగింతుము చూఁడుడంచు న
త్యద్భుత లీల యాగ రుచి రాన్నములఁ గొనిపోఁ గడంగుచో 20
ఉ॥ పేరాచుచుఁ జూడకుండు నటుఁ జూడ్కులఁ ద్రిప్పెడి వారు కొందఱై
యూఁచుచు శీర్షముల్ బొమల - నొత్తి బిగించెడు వారు కొందఱై
రాచుచు నొక్క నేల నుడి - రాక తడంబడు వారు కొందఱై
యూఁచఁ దొడంగి రందఱు మ - హార్షులు హర్షణ మన్న నేష్టులై 21
సీ॥ నాత్స్యుష్ణ భోజ్య ఖాం - డము లేర్చి యభిఘన
ణ మొనర్చి పట్టుక - స్త్రములఁ జుట్టి
ఒలిత మనుర భక్ష్య - ము ల సమ స్త్రములు

పాళి నోళ్ళకటిగఁ - బాడు కొలిపి
లేహ్య పాకముగఁ గ - ల్పించిన రుచిరాన్న
చయముఁ బళ్ళెరముల - నంతరించి
పాయసాదిక రుచ్య - పక్వ చోష్యంబుల
శుద్ధ పాత్రల నింపి - సిద్ధ పఱచి

తే॥ గీ॥ పానకాది పానీయముల్ - భద్రి పఱచి
స్వచ్ఛ జలములఁ దెచ్చిరా - యత్త పఱచి
ముని సతులు గీతికలఁ బాడు - కొనుచు హరిని
వేడుకొను చోరెములఁ గొని - వెడలి రంత ౭౨

ఉ॥ ఈదురటిల్లు వృత్తమును - గృష్ణుఁడు సర్వమెఱింగి యాత్మలో
నేది యెఱుంగనట్లు నిదు - రించు గతిన్ బవళించి యున్న సొం
పేది పరిశ్రమాకులిత - హృత్తనులై వ్రజబాలకాళి కా
లూఁది నిరాశతో మగిడి - యోపికఁ దూలి తపించి వచ్చినన్ ౭౩

ఉ॥ వచ్చు వ్రిజార్భకుల్ నిదురఁ - బాయని కృష్ణునిఁ జూచి కిన్కఁ జె
న్జిచ్చు విధానఁ గాల్చఁ దమ - చేతను లిట్లు నిరాసఁ గొల్పి బల్
మ్రిచ్చువలెన్ సుషుప్తిగను - మోసరివౌ యిఁక లెమ్ము లెమ్ము నీ
సచ్చరితమ్ము వెల్లడియె - సాధు లసాధ్యులు మాను లొటచే ౭౪

క॥ నీవేమో ఘనుఁడవు గా
భావించి త్వదుక్తులకును - భ్రమపడి క్షుద్బా
ధా వారణార్థ మరిగినఁ
గావలసిన దెల్లజరిగెఁ గద! యిఁక లెమ్మా ౭౫

చ॥ అని హితులెల్లరున్ గినిసి - యాడు ఛలోక్తుల సంచలింప కా
యనఘ చరిత్రుఁడే మెఱుఁగ - నట్టు తటాలునఁ గూరుచుండి యీ
కను జనుదెంచ రేల? ముని - కాంతలు మీకును సాకు నోరెముల్
గొని నవభక్ష్య భోజ్యములఁ - గూర్చి కనుంగొనుఁ డష్ట దిక్కులన్ ౭౬

కll అనినంత వహాని పళ్నలు
గొని తెచ్చిరి బహువిధాన్న - ఘుమ ఘుమిత సభా
జన బహుళము బత్తిమెయిన్
గనఁగొని యాభీర సుతులు - గళవళ పడఁగన్ 22

వll ఇట్లు భోజన పదార్థంబులఁ గొని తెచ్చి సమర్పించి వినమ్రులై కరంబుల మోడ్చి శ్రీకృష్ణునితో నిట్లనిరి. 23

చll వరదుఁడ వార్తి హర్తవని - భావములందు నెఱింగియున్ మునీ
శ్వరు లవివేకులై పరమ - పాప నృపాలున కోడి భీతిమై
సరినుడి యీని కారణము - సైరణఁ జేసి భుజింపుమయ్య! నీ
రెఱుఁగని దేది? మాధవ! క్షమింపఁగదే భవదాశ్రిత ప్రజన్ 24

కll అన నగి గోవిందుం డనె
వనితా మణులార! ఋషుల - భావమెఱుఁగుదున్
జనునే ద్వంద్వ రహితులగు
మునులకు దేహాభిమాన - మును గృపణతయున్ 30

ఉll మీరలు తెగించి నాకొఱకు - మీఁటి మునీంద్రుల యాజ్ఞ వారికిన్
నేరిపి జ్ఞాన బోధ స్తవ - నీయ గతిన్ జరియించినారు మీ
కోరిక చొప్పునన్ మునులఁ - గూరిమిఁ జూతు యథావిధిన్ నమ
స్కారము మీ కృపామతికి - గౌరవ బుద్ధికిఁ గార్య సిద్ధికిన్ 31

తేll గీll అనుచు గోపాలకులకు నా - హారమెల్లఁ
బంచిపెట్టెను దన కేమి - యుంచు కొనక
"గోపకుల క్షుత్తు దీర నా - క్షుత్తు దీరె
క్షుత్పిపాసలు నాకున్నె? సుదతులార! 32

కll అనుచు ముని కామినులతోఁ
గొని పొమ్మనె భాజనములఁ గుతుకమ్మున న
మ్ముని కాంతలు భాండమ్ములఁ.

గొని యాశ్రమమునకుఁ జనిరి - కొనియాడి వారిక ౮౩

మ॥ మునుతే పత్నులఁ బంపి గుట్టుగను దృష్టుంజేయఁ గృష్ణుఁ నవో
దన నైవేద్య మొసర్చినట్టులుగ వా - ర్తాగ్రాహకుల్ దెల్పఁ గం
స నృపాలుం డతి కోపియై పనిచె - శుంభత్త్రైన్యముఁ మానులం
గొని తే శృంఖలము ల్దగిల్చి చెఱకుఁ - దోషా సమేతంబుగ

తే॥ గీ॥ రాజు నాజ్ఞను గడవఁ ద - రంబె యనుచు
భటులు దోగులపై భక్తి - భావ మెంతొ
కలిగియును బరభృతులౌట - గానఁ దరిసి
యాశ్రమము చొచ్చి తెలిపిరి - యధిపు నాజ్ఞ ౮౪

మ॥ విని కోపోన్మదులై మునీశ్వరులు "గో - విందుండు మిమ్మె క్రియాక
మనుపంజాలునొ మేటిమీాటి యిటు స - న్మానంబు శూన్యంబు చే
సిన మీా మోములఁ జూడమంచు సతులం - జేతమ్ములఁ నొవ్వఁ ది
ట్టిన మానీంద్రుల పత్ను లజ్జనయనుఁ - డెందమ్ములఁ జేర్చుచుఁ

తే॥ గీ॥ దీన సంరక్షణా! జగ - దీశ! కృష్ణ!
నిన్ను నమ్మిన యాపన్ను - లెన్నఁడైన
బన్నముల నొందిరే? నీవ మిన్నకున్నఁ
బున్నెములు జన్నములు నింక - మన్నుగావె? ౮౫

మ॥ అనినంత న్నిపినాంతరోచ్ఛలిత సంఖ్యాతీత రింఖ త్ప్రభం
జన వేగోద్ధత దీర్ఘశృంగ సకలాశా ధ్వానితాంభా రవా
ద్రి నిభాత్యద్భుత దిగ్విలంఘన వియద్వీధీ స్ఫురన్నేత్ర గో
గణముల్ చాప విముక్త కాండగతులై కాన్పించె న్నుగ్రంబులై

చ॥ కనఁబడి కంస సైనికుల - కట్టెదుటఁ గనిపించి కొమ్ములుఁ
జొనిపి తదీయ దేహముల - నొంచిన భూమి పయిం గతాసులై
చను తమ మిత్రులంగని వి - షాదముతోఁ బరువెత్తి పోయి భీ
తిని యమునా నదింబడిరి - తేకువఁ దూలుచుఁ గొంద ఱార్తులై

ఉ॥ ఈ విపరీత దృశ్యము ము - నెంచుటలు గాంచి స్వకీయ దోషముల్
భావములం దెఱింగి తమ - భామల భక్తికి సంతసించి యెం
తో వగఁబొంది యాత్మఁబురు - షోత్తము వేఁడిరి సైఁపఁగా నహం
భావముఁ జెంది యుంటకు న - మానుష రీతిఁ జరించి యుంటకున్

మ॥ పదునేనేడులు పైఁబడన్ త్రిభువన - వ్యామోహనాకారుఁడై
మదనానేక సహస్ర జిదురుచిరుఁడై - మాన్య ప్రభావాఢ్యుఁడై
హృదయాకర్షకుఁడై మనోహరుఁడునై - కృష్ణుండు వర్ధిష్ణుఁడై
సుదతీ లోకముఁ దేల్చి ప్రేమ జలధిన్ - శోభిల్లె నానాఁటికిన్ ౯౧

మ॥ అదియే చోద్యముకాని వీడుకొను బా - ల్యావస్థ యందున్న యా
యదు వంశాగ్రణిఁ దొంగిచూడని వయస్యారత్నముల్ వానిని
మ్మదిఁ జింతింపని లేమ వానికెనరై - మారార్తి తాపంబుతో
మదిలోఁ గుందని భామ కన్పడదు బృం - దారణ్య మధ్యమ్మునన్

సీ॥ తనబిడ్డ సాటిగఁ - జను గుడిపిన ప్రోఢ
పులకాంకురిత యయి - వలపుఁ గులుకఁ
దన చంక నెత్తి త్రి - ప్పిన కోమలాంగి ని
త్యముఁ గామ పరవశ - త్వమునఁ దూలు
దను బుజ్జగించి యో - దార్చిన యెలనాగ
తహతహ లాడి చిం - తనము సేయుఁ
దనతోడఁ గూడి యా - డిన బాల మదనాగ్ని
వేదన నిద్రాన్న - విధుల మాను

తే॥ గీ॥ చిన్ననాఁడు నెఱింగిన - కన్నె మిన్న
భ్రమసి వివశయై చే పట్టఁ - బలవరించు
వచ్చియును రాని పసరు జ - వ్వనము గలిగి
జగము మెఱపించు శౌరి సో - యగముఁ జూచి ౯౩

సీ॥ ఏ యింటఁ వినుచున్నఁ గృష్ణలీలాలాప

కర్ణ పేయాద్భుత గాన రచన
ఏ మూలఁ గనుఁగొన్న - నిందీవర శ్యామ
లాంకారు వాసుదే - వాభి నుతులు
ఏ వంక నరసిన - భావజోద్రిక్త గో
పీ యువతీ జన - గేయ చయము
ఏ చక్కిఁ జూచిన - శృంగార లాలిత
మూర్తి దైత్యారాతి - కీర్తనములు

తే॥ గీ॥ గలిగి దర్శనోత్సుక చం - చలమనస్క
మూర్ఛితా తను బాణ - సమ్మోహ తప్త
గోపికా భావ నోర్జిత - గోకులంబు
మారు మొరసె గోపాలు శృంగార గరిమ ౯౪

సీ॥ అబ్జాక్షి! డాఁచితే - యబ్జాక్షు సత్కులఁ
గరుణా కటాక్ష వీ - క్షణము లేవే?
శ్యామలాకారు వ - యస్యవై వెలసిన
శ్యామలా! జన్మ న - న్యము ఫలించు
మృదుల వేణుస్వనఁ - గృష్ణాఖ్యఁ బడసి గ
ర్వించిన ఫలమేమి? - కృష్ణవేణి!
మాలతీ! వర్ధిల్లు - మాధవా శ్రయమున
నల్లి బిల్లిగ దెస - లెల్ల నల్లి

తే॥ గీ॥ అనుచు నరోన్మత్తు లాడుచు - నాడు కొనుచుఁ
గూడి నడయాడి పాడుచు - వీడు కొనెను
పువ్వుఁ బోఁడుల పోఁడిమి - పొంగి పొరలె
నంద నందను సవ్య సౌం - దర్య గరిమ ౯౫

మ॥ అసితా కారమ కోరి భృంగవర! యా - త్యాసక్తి నీకై పవల్
నిసియుం జింతన సేయు పద్మిని పయిన్ - ప్రేమన్ దిగన్ ద్రొక్కరో

దసి సుధార మొసఁగ నెంచెదవుగా? - ధర్మంబె? యంచొక్క ప్రే
యసి న బోధన సేయు గుప్త మతియై - యన్యాప దేశోక్తులన్

మ॥ మొక మీఁలాకునఁ దీసి పెట్టు కొనుదే? - పున్నాగమా! నేఁటి నీ
వికచోన్మీలిత పుష్ప గుచ్ఛ మధు వ - న్వేషించి కాంక్షించు భృం
గికిఁ దృష్ణాప నయంబు బొసఁగ్చుటకు సం - దేహింతువే? యంచు గో
పిక యొక్కర్తు పరార్థ సూచక వచ - స్స్వీకారయై తూఁగెడిన్ ౯౭

మ॥ పరితాపంబునఁ బ్రేమ శృంఖలముచేన్ - బంధించి మచ్చిత్త పం
జర సంబద్ధు నొనర్చి యుంటి శుకరా - జా! యింక నెవ్వోటికిన్
బఱువం జాలవు నాక చిక్కితివి నా - భాగ్యంబుచే నందు సుం
దరి వేఱోర్తుక భావ గర్భితవచో - ధాటిన్ బ్రలాపించెడిన్ ౯౮

మ॥ సొగసుం గొల్పు నవ హంస నాయక విలా - సోన్మాదినై నీవయున్
దగులుం జెందిన యంచపెంటు గన కుద్ఘాటించుచున్ నింగికి
న్నెగయం జూచెను తెల్లమయ్యెఁ గదె! నీ - నీచత్వముం చొక్కసో
యగవుం జిన్నది తూలనాడి బహు న - ర్మాలాపముల్ ప్రేలెడిన్

వ॥ ఇట్లు మనోజాస్త్రోను విద్ధలై సోలుచు బహువిధ పరితాపంబునఁ దూలుచు శృంగార రసార్ణవంబునం దేలుచు, యౌవనోద్ధత్యంబునం గ్రాలుచు, శ్రీకృష్ణ సౌందర్య సుధాసహారిం గోలుచుఁ, బ్రేమ వల్లరుల వ్రేలుచు, భావోన్మాదంబునన్ వాలుచు, వగలఁ దగిలి బిగి పిగిలి సెగలఁ బొగులు నిగుడుఁ బోంట్లు. ౧౦౦

చ॥ తుమురులు చేసి దిద్దుకొన - దోఁచక యుత్తల తొత్తులై, తమిం
బడి పయి కొన్న వల్లభుల - మన్నన సేయని రిత్తలై, మొదో
విడి చిగురెత్తఁ గన్మొడిచి - ప్రేమ నడంచెడు నప్రమత్తలై,
కడపిరి రేఁ బవళ్ళుఁ జిర - కాలము చిత్తముఁ జొచ్చి యచ్యుతున్

ఉ॥ కొందఱు లోన గుందినను - గొందఱు భావము విప్పి కందుచున్
గొందఱు తొంగి చూచినను - గొందఱు సందుల వేచి కాచుచున్

కొందఱు మాట మాటికిని - కొందఱు పాటున నోటఁ బాడుచున్
అందఱుఁ గృష్ణునిన్ వలచి - యారటఁ జెందుచు జెంగి రిందఱున్ ౧౦౩

ఉ॥ ప్రాయము లేదు జవ్వనపు - వాసి యెదో పొడఁగట్టు వీనికిన్
చాయలు చూచు చేఁటి నెలి - జాణలు పెక్కుర, యెండమావికిన్
పోయి ప్రయాస లొందెడి కు - బుద్ధి విధంబగు నోక్కొ? యంచెదన్
బాయదు కృష్ణుపై మమత - భామ యొకర్తయు నేమి చిత్రమో?

సీ॥ వరదుఁడౌ కతన సం - భావించి ప్రార్థింప
దయఁజూపి యాశ్రితా - ర్థనుఁడు గాఁడె
భక్త వత్సలుఁడౌటఁ - బరమ నిశ్చల భక్తిఁ
జరియింపఁ జరితార్థ - సలుప కున్నె?
దీన బాంధవుఁడు గాఁ - దీనాతి దీననై
తూలెడి నాకు బం - ధుగుఁడు గాఁడె?
శ్రీహరి నామ ప్రసిద్ధి - గాంచుట నా య
రిష్ట తాపముల హ - రింపఁ దగఁడె?

తే॥ గీ॥ అనుచు జపముల భజనల - ధ్యాన పరతఁ
బూజలఁ బ్రహృష్టు నొనరింపఁ - బూను కొనిరి
మనన జనకుని నిలుపుచు - హృదయ వీథి
గోపికా తరుణీ మణుల్ - గోకులమున ౧౦౪

వ॥ అంత.

మ॥ చివురించెన్ నవ చూతవుం దరుణి పూ - చెన్ గోమలాశోకవుం
జివురుం జోడి విలాస లాలసతలన్ - జెన్నారెడిన్ మల్లికా
యువతీ రత్నము పద్మినీ కుముదినీ - యోషామణుల్ మెచ్చి కం
దోవలన్ విప్పిరి సంతసమ్మున వనం - తోత్సాహ తోద్భ్రాంతలై

మ॥ చిగురుం జిన్నెల వన్నె పూఁ బొగచుతోఁ - జెన్నారు చిన్నారి తే
వగవుం జిన్నది మావి గున్న కొయి సిం - గారమ్మునన్ బట్టి రా

ల్పుంగుహూహూరావము లేర్చి యొక్క పిక బా - లుండవ్వ సంతానగమా
ది గళ న్మాధుర జైత్రి మంజుల సుధా - దివ్య స్రవంతీ గళిక్ ౧౦౭

శా॥ పూవుందేనియ సోనలన్ బడి రజః - పోతమ్ముఁ జేలి పూ
దావుల్ గమ్మనఁ గ్రమ్మి చిమ్మ తనుఃఁ బ - త్రావుల్ పిసాళించి యు
ద్భావ ప్రేరిత ఝూంకృతిన్ మదన గీ - తా లాప సంచారియై
తీవిన్ జాఱు వసంత రాడుదయ ధా - టిన్ దేటి పాటించుచున్

చ॥ వికసిత భూజకాంతలు న - వీన గతిన్ గయిసేసి యాడ, గా
యకులయి శారికా పికము - లల్లన నుల్లస మ్మారఁబాడ నా
యకులయి కీరముల్ చెలఁగి -యాదట బారులు గూడ నావసం
తక పతి మన్మథ ప్రియుని - దార్కొనఁ గూర్చిన భంగి యేర్పడెన్

వ॥ ఆ సమయంబున. ౧౧౦

ఉ॥ వారిజ నాభుపై గలుగు - వారని కూరిమి వ్రాలి గోపికా
వారిజ నేత్రలెల్ల రని - వారిత మోహ పరీత చిత్తలై
వారిజ సాయకున్ సవరి - వారముగా భణియించి నగ్నలై
వారి జపించి నిష్ఠమెయి - వారి మనోరథ సిద్ధిఁ జెందఁగన్ ౧౧౧

క॥ తలపోసి పూర్ణ మండల
సలిల జపోత్కృష్ట దీక్ష స - రసిజ నయనన్
గలియం దగు నని ధృవమున
సలిపిరి పెక్కురు వ్రజాంబు - జాక్షులు పెలుచన్ ౧౧౨

ఉ॥ వేకువయంద ఘేలుకొని - శ్రేత లోకళ్ళోకరన్ బ్రియంబునన్
గేకలవైచి పిల్చుకొని - కేరుచు మూఁగుచు నెల్లరొక్కచో
నోకుల వీథులన్ దరలి - కోమల గాత్రములెత్తి పాడు చు
త్సేకముతో సమీప పద - సీమఁ గలట్టి కొలంకు పొంతకున్ ౧౧౩

క॥ చని కాల్యంబుల దీఱిచి
కొని వసనంబులను నూడ్చి - గుట్టగ నొకచో

మునిచి దిగంబరలై వా
రిని గుర్తింకుచు నాచరించి - వ్రతస్థితికపై ౧౧౪

క॥ కందర్ప నిలిపి గోపీ
సుందరు లటుఁగన్ను మోడ్చి - చూచుచుఁ దమకుం
గందర్ప జనకుఁ గూర్పఁగ
నందరు జపియించి కడపి - రావ్రత నియతిన్ ౧౧౫

ఉ॥ ఈవ్రత నిష్ఠ నెల్ల గమ - లేక్షణుఁ డాత్మ నెఱింగి నగ్నలై
యా వ్రజ కామినుల్ సలుపు - నట్టి దనైచ్యముగాఁ దలంచి ప్రీ
పై వ్రతలాభ మిచ్చియును - నక్రమ చర్య నెఱుంగఁజేసి జ్ఞా
నావృత భావలన్ జలుప - నన్నుత మార్గముఁ బన్ని నెమ్మనిన్

ఉ॥ నాఁడు వ్రతాంత మయ్యెడి ది - నంబని కేశవ జాము రంద యా
నాఁ డరవింద నాభుఁడు మ - నంబునఁ గాంచి వనంబుఁ జేరి పూఁ
బోఁడుల జాడలం దెలిసి - మున్నె సరోవర తీర భూజ పుం
గూఁడెము నందు నొక్కట ని - గూఢముగాఁ జరియించు నంతలోన్

ఉ॥ "కో"యనుకోకిల ధ్వనికి - "కూ"యని మార్వ్రాచియించుచు "ముకుం
దా" యను కీర రాజముల - "దా"యనిపించుచు "కుక్కుకో కుక్కు
కూ"యను కుక్కుటమ్ముల "వి గో"యని మార్చుచు తొక్కులాప్ప "కే
కై" యని యాడు కేకుల వృ - థా యనిపించుచు డాసిరంగనల్

ఉ॥ డాసి సరోవరమ్ము నిక - టస్థ మహీరుహ శాఖ సంతతుల్
గోసి సమీప తీరమున - గుయ్యన కుండఁగఁ బండ్లఁదోమి వే
ణీ సమితిన్ విదల్చి రమ - ణీయ నిజాంబర రాజి నూడ్చి పెన్
రాసిగఁ జేర్చి యొక్కెడ బి - రాన జొరంబడి రా కొలంకునన్

ఉ॥ చొచ్చి వ్రజాంగనల్ కెరలి - జోలుచుఁ గుత్తుక బంటి నీటిలో
మచ్చికఁ గుర్తింకి హాస్తములు - మాళి పయిం గడియించి చిత్తము
వచ్చుగ భావజున్ నిలిపి - యంబకముల్ ముకుళించి వక్త్రముల్

విచ్చి నటించి రీ పగిది - వేమరు మార్దవ చారు సూక్తులన్ ౧౨౦

సీ॥ భావజ! భావ గు - ప్తార్థ మెఱింగి సం
భావింప కున్న జీ - వనము లున్నె?
కందర్ప! దర్పింప - కయ తర్పణ మొనర్చు
తర్పణ కోటి న - మర్పణమ్మ
చిత్తజ! మా మొర - ల్చిత్తగించుచు వ్యథో
చ్ఛిత్తి హత్తింపు మీ - చిత్త:మలర
కామ! కామినులకుఁ - గామ్యంబు లొసఁగి కా
మిత పారిజాత స - మ్మతివిగమ్మ
తే॥ గీ॥ మదన! సూనాస్త్ర - సంతప్త మతుల మేము
మదన జనకుని జేర్చ న - మ్మదము తోడ
మార! సుకుమారలము గాకు - మార దనుజ
మారకునిఁ గూర్చి తమిఁ బరి - మార్చఁ గదవె ౧౨౧

చ॥ అని నుతియించు నంతఁ గమ - లాప్తుఁడు పూర్వ దిశాంగణమ్మునన్
గనఁబడ గోపికాంగనలు - కంపితలై కమలాకరంబుఁ బా
సి, నిజ దుకూల ధారణము - సేయ జనన్ మటు మాయమయ్యెఁ జే
ర్చిన వసనంపు రాసి యతి–చిత్రముగా హృదయంబు ప్రీలఁగన్

చ॥ కనుఁగొని తెల్లవోయి వ్రజ - కాంతలు నల్గడలందు రోసి చూ
చిన నొక పొన్న గున్నపయిఁ - జీరలు వ్రేలుచు కాక కోటరం
బున నునుమేని డాల్ పసుపుఁ - బుట్టపు మేల్మిజరీ వలాయల్ సిగన్
దనరు తురాయి ఈాల కిర - ణమ్ములఁ జిమ్ముచు శౌరి కన్పడెన్

మ॥ కని లజ్జావన తాస్యలై కరములం - గంకర్ప గేహోన్నత
స్తనముల్ దాఁచి మహీజ వల్లరుల పొం - తం డాఁగి యాభీర కా
మిను లన్యోన్య విలోక నాదికములం - బెంపొందు సత్యద్భు తో
ల్బణ భావంబున స్తబ్ధతం గనిరి వి - భ్రాంత భ్రమా లోలలై

క॥ తడఁబడి పడఁతుక లెపఁదలు

దడదడ మన ముఁడిగి యుఁడిగి - తడవ్రకొనెదు నా
జడిమలలో గనుసునఁ బే
ర్వడిన వడు చొకర్తు వెడలి - వడి పిడి నడిగెన్ ౧౨౫

వ॥ పొగరుం జిన్నెల వన్నెలాఁడ! పసమం బూఁదావి లేఁ బ్రాయపుల్
జిగికే కొ్రివ్వి జగంబుఁ గాన వఁటరా! - నీ మానినీ మానసముల్
దగులంబెట్టఁగ సాహసించెద వె? న - న్యాయంబుఁజేకూర్చి మా
తగులాటంబుల కంతరాయ మగు దే? ధర్మావనా కాంక్షివే: ౧౨౬

చ॥ అన నగి వాసుదేవుఁడని - నంబర హీనత నవ్వులం బడం
జనునె? దిగంబరత్వమున - సాధులు తొల్లిట నెన్నఁడేని ధ్యా
న నియతి నుంట వింటిమె? మనః ప్రభ వోన్మద చిత్తలై జగం
బును గనఁ జాలరే? పడుచుం బోడిమిం గొ్రివ్విరు బోఁడు లీగతిన్

మ॥ అనసంతన్ జవరా లొకర్తుక మహీ - జాగ్రస్థుఁడౌ నంద నం
దను సంబోధనఁ జేసి యిట్లనియెఁ గాం - తా మాన చౌర్యాబు స్త్రీ
జన హృత్తస్కరు యెసనెప్పి పట్టువడ కీ - త్రుమ్మజాబుపై నెక్కి డాఁ
గిన మన్నింతుమె? యెన్నినాళ్లు గడచున్ - గృష్ణా! దురుద్యోగముల్

ఉ॥ నావుడుఁ బల్కె శ్రీహరి న - నాథల నాథలు భోగు లార్తులన్
భావము నంటునన్ దలఁప - వారి మనోధన మాన గేహముల్
చేవ హరింతుఁ బట్టుకొనఁ - జిక్కక చిక్కులఁ గూర్తు నెక్కటన్
గావున నన్ను వీడ్కొనుట - కార్యమ యేల వృథా ప్రయాసముల్

చ॥ ఇదివిని వ్రేతలందొకతె - వృక్షము చాటున డాఁగి మీఁదికిన్
వదనముఁ ద్రిప్పి యిట్లనియె- "వారిజనేత్ర! హరించి మానముల్
చదలఁ దిరోహితుండవయి - సర్వ విధంబుల నేఁచఁ జూచు నిన్
వదలము కాచికొమ్ము రసి - పట్టినిచో నభిమాన మేటికిన్" ౧౩౦

చ॥ అనవుడు మాధవుండు కుట - జాంతర శాఖలఁ గూరుచుండి ద
ర్శనము నొసంగి యిట్లనియె - "భ్రాంత పరిభ్రమణంబు లేల? నన్

జెంకుట కష్ట సాధ్యమ వ - శీకర విద్యకు నొజ్జనైన నా
మినుకల గానలన్ మునిఁగి- మేదుర తాపముఁ జెంద నేటికిన్" ౧౩౭

ఉ॥ అంబుజ పత్ర కాండములు - నంబుజ నేత్రి) యొకర్తు గుహ్య భా
గంబుల సంవరించి తరు - కాండముఁ బ్రాకుచుఁ బల్కె వీక్షమై
నంబర ఖేలు నిన్ని దె ది - గంబరుఁ జేసి పరాభవించి మా
యంబర రాజిఁ దెత్తు కమ - లాంబక! యంబ పదాబ్జ సాక్షిగన్

ఉ॥ నా వశినాత్ముఁ డీట్లనె ఘ - నా ఘన మూర్తి ఘనాఘనత్వము
న్నో! నవలా! దిగంబరుల - నెయ్యము కోరు దిగంబరుఁడ; మా
యా నిబిడాంధకార వివ - శాంబర మార్గ వినూత యానుఁడన్
మానము లున్న నాకు నవ - మానము మానములున్ సమానమే

క॥ మానిని! మీపై నే నభి
మానంబు వహించి - దురభిమానము నాన్స్త్రీ
మానము నరసితిఁ దెలిసె బ్ర
మాణము మార్గిసెక్క ప్రాపకు - మాను మని వడిన్ ౧౩౮

మ॥ వనితా వస్త్రము లెల్ల రాల్ప ధరపై - భగ్నాత్మలై నగ్నతా
ప నతుంబున్ బొనరించుకోఁ దొడర గో - పాలుం డదృశ్యత్వమున్
గని వర్షించె సువర్ణ పూజ్య మురళీ - నాళోల్లు లత్పిచ్ఛల
స్వనమాధుర్య నిరంతరో ద్గమిత ది - వ్య ద్యోధునీ ధారలన్ ౧౩౯

శా॥ ఆరావో న్మథిత స్మరానల వరీ - తా త్యాకుల స్వాంతలై
యారామ భ్రమణ భ్రమోచ్చలితలై - యారామ మధ్యంబులో
నా రామామణు లారమాధవుఁ డవ్య - క్యా కారుఁడై వేణు మా
యా రావా వశ గాత్రిలన్ జలువ నా - హారావ దిగ్భ్రాంతలై ౧౪౦

ఉ॥ "ఆ"యను వేణురావమున - "గా"నని తన్మయతన్ వహించుచున్
"ఊ"యను మంజునాదమున - "శో"యని వేడుకఁ గేరి పాడుచున్
"సా"యను పేశల ధ్వనికి - మాసరి సాయని కూడి పాడుచున్

రోయుచుఁ, గృష్ణు గీతికల - మోఁగియుచుఁ గానఁ జెలంగి రంగసల్

సీ॥ నవ రసాలస్థిత - నవసన సల్లాప
లాలన పరభృతా - లాప ములకు
కుంజ నికుంజ స్థ - గుంజ న్మనోహర
మంజుల కీర సం - భాషణలకు
భోగి దుర్భోగ కృ - ద్భోగ్య సీనిమ రాగ
నాగభుక్ షడ్జమ - నాదములకు
వంశ రవాంశ ని - స్త్రింశ ధారా ఘాత
వంశ వంశోచ్ఛ్రిత - ధ్వానములకు

తే॥ గీ॥ బ్రమసి పరువిడి, హర్ష సం - భ్రమము లొంది
సంచ లించియు మురిసి తో - షణముఁ దగిలి
బెగడు వడియును నానచే - డిగులు గొనక
విరహ వేదనఁ జిక్కి - వెదకి వెదకి 67

సీ॥ భవదీయ చిహ్నిత - వదనుండు డాఁగెనే?
భవదాశ్రితోజ్జ్వలాం - బకుఁడు గలఁడె?
యుష్మత్సమాననా సో - ద్భాసితుం డేడ?
యుష్మదీయ ఫలోప - మోష్ఠుఁ డెచట?
భవదీయ బీజ ప్ర - భా డశనునిఁ గంటె
కాంచితివే త్వ - దాఖ్యాత బాహుఁ
జూచితే భవదీయ - సుమ సమోన్నత నఖుఁ
గానఁ జాలితె త్వత్స - మాన దేహు?

తే॥ గీ॥ అనుచుఁ జంద్ర రేఖా కమ - లాకరములఁ
దైల, బింబ, దాడిమ, సుమం - దార శాఖి
మల్లికా, తమాలాది క్ష - మాజ వితతి
సంశయమున శోధించిరా - యంశ లుబట 68

సీ॥ హరిమధ్యముఁడె కాక - నరహరి ఖ్యాతుఁడా
హరిపోయి నిలుచునే - హరుల మధ్య?
ఖగరాజ హరి కాక - ఘన హరిగ్రీవుఁడా
హర్యక్షుఁ జీవన - హరులఁ గలఁడొ?
నాగవరుఁడె కాక - నాగ శయానుఁడా
నాగ మర్దనుఁడున్న - నాగపాళి?
నగధన్వి పతి కాక - నగభేది గతియైన
నగధారి కలిసెనే - నగచరాళి?
తే॥ గీ॥ త్రిభువనాక్రాంతితాంఘ్రియా - త్రిజగ దమల
సురధుని పదుఁడొదిగెనే - వర జలముల
ననుచు నిర్ఝరములై కాంచి - రచట శిఖరి
భోగిలి, బిల, వన, వల్మీక - నగ ఝరముల ౧౪౦
ఉ॥ కంటిరె కీర వాహ పితఁ గానన కీరములార! మాధవుం
గంటిరె మాధవీ విటప - కాండములార! మృగంబులార! మీ
రంటిరె యీ వనస్థలి మృ - గాక్షి మనోహరు? బక్షివాహనుం
గంటిరె పక్షులార! యని - కంపమునం జవియించి రంగనల్ ౧౪౧
ఉ॥ కొండలఁ గాన నాధ్వములఁ - గ్రుమ్మరి క్రుమ్మరి సొమ్మసిల్లి తూన్మ
జాండజ, వన్య సత్త్వముల - సారెకుఁ జీరుచు వేసరిల్లి యా
యండజ వాహనుం దలఁచి - యారసి, యారసి, సోలి, తూలి నో
రెండ, వడంకఁ, గాళ్లు, కను - లెఱ్ఱనగా, ధృతి వ్రీలఁ గూలుచున్
మ॥ ఒక పెన్గొండల లోయలో సరస చూ - తోద్యాన మధ్యంబులో
వికచోత్ఫుల్ల మృదూత్పలాంబుజ నవో - వేలా సమీపస్థ కో
రక సంయుక్త నికుంజ పుంజ నవ సూ-ర్యాంశు చ్ఛటా ద్రావితో
దక సందోహ మరంద సిక్త తృణ ని - స్తంద్ర ప్రదేశంబునన్ ౧౪౩
ఉ॥ ఓపిక లేదియున్ స్మరణ - మాంచి ముకుందునిపై దృఢంబుగా

గోపిక లెల్లరుఁ వివశ గోత్రనులై యచలానురాగలై
గోప్పున కప్పగించి నిజగోత్రను భారముఁ గేలుమోడ్చి మా
ర్గాపరలై ధరంబడిరి సర్వముఁ ద్యాగ మొనర్చి ధన్యలై. ౧౭౮

ఉ॥ అంత స్ఫురన్నటద్దళిత - హారి నిరామయ మంజురావ వి
క్రాంత దిగంతమై సురభి - సార చలన్మలయానిలా ప్లుదా
త్యంత మనోజ్ఞమై ప్రకృతి - తామనసాక్షి చెలంగి గోపికా
కాంతల నేదఁదేర్చి యటఁ గన్గవలన్ వికసింపఁ జేయుచోన్

శా॥ నీలాకాశ విశిష్ట నీల తనుఁడై నీరేజ మిత్ర ప్రభా
చేలుండై ముఖ చంద్రబింబ రుచిర స్మితుండునై శీతలా
లోలానద మయూరలోకనుఁడునై లోలంబ జైత్రాలకుం
డై లోలాక్షుల కక్షి పర్వముగఁ గం - జాక్షుండు ప్రత్యక్షమై

మ॥ దరహాసామృత కౌముదీ లతలఁ జై - తన్యంబుఁ జేకూర్చి సుం
దర నిర్వ్యాజ కటాక్ష వీక్షణములన్ - దాపాగ్నిఁ జల్లార్చి న
న్మురళీ మోహన దివ్య నాదల హరిన్ - బోత్సాహముం గూర్చి ని
ర్భర మోహాంబుధి ముంచి తేల్చి మనిచెన్ బాలించ తత్సుధాసూక్తులన్

మ॥ లలనా రత్నములార! యీపగిది నేలా చేలలై పోలి చం
చలలై తూలెఁ? నమఁజసంజెఁ? యిది వి - న్నన్ లోకు లేమందు ర
త్తలు మీ భర్తలు మెత్తురే? యిటుల నిందార్హక్రమోద్రిక్తలై
తలపం జాలరె సంప్రదాయ గతులన్ - ధర్మస్థితిన్ లోకమున్

మ॥ అలివేణుల్ నళినాక్షు పల్కులకు న - త్యాశ్చర్యలై నిర్మలాం
జులులై యర్ధనిమీలితాక్షులయి సం - భావించి తీలీల భ
ర్తలకున్ భర్తవు లోకనాథుఁడవు ధ - ర్మత్రాతవై యొప్పు నిన్
గలియన్ జూచుట నింద్యమౌనె జన సామాన్యోక్తి మాకేటికిన్

మ॥ మురళీ మోహన కృష్ణుఁ డిట్టు లనియెన్ "ముగ్ధాంగనా రత్నముల్
పరమోత్కృష్ట మదీయ దివ్య తను సం - పత్ప్రాప్తి కాసింపకే
క్షరమై జర్జర మౌ శరీర లవ సౌఖ్యప్రాప్తి కాంక్షింతురే?

చిరమౌ సుస్థిర సౌఖ్యమే యిహ పర శ్రేయః పదంబౌఁ జూడీ
మ॥ అనఁ బ్రీత్యుత్తర మిచ్చి రంగపలు శ్రీ - వైశ్యంబునన్ మాధవా
నినుఁ బ్రత్యక్షముగాఁ గనుంగొనెడి యీ - నేత్రద్వయిన్ వ్యర్థులం
గనలే మచ్యుత నీ పవిత్ర చరితం - భ ప్రాప్తి లేకున్న జీ
వన మేలా? నినుఁ గూడి యాడుటయు జీ - వన్ముక్తి మాపాలికిన్
సీ॥ భవదీయ దృగ్జ్యోత్స్న - పడయని భవరాత్రి
పరమ పాతక తమః - పటల మయము
నీ కరుణావృష్టి - సోకని తనులత
తాప తీవ్రాతప - తప్తయష్టి
నీ నియంతృత్వము - లేని జీవన నౌక
దుఃఖ ఝంఝానిలో - ద్ధూత పటము
నీ స్నేహ సుర శాఖ - నిలువ నోచని జీవ
పటలి, తృష్ణానల - బాధితంబు
తే॥ గీ॥ త్వత్సుసారథ్య రహితమౌ - భావ రథము
ప్రబల నారక దుర్గమా - రణ్య గామి
యదు కులార్ణవ సోమ! దయా మయాత్మ!
ధర్మపాలన! భక్త మందార! కృష్ణ! ౧౫౩
సీ॥ భవ దతిమానుష - ప్రతిభ నెఱింగి నీ
బడయని వారి జీ - వనము వనము
నీ మహత్త్వముఁ గాంచి - నిన్ను భావించి చే
పట్టని వారి భా - వమ్ము వమ్ము
నీ యమేయాద్భుత - నిజ తత్త్వ మెంచి నీ
గలియని వారి ని - ఖిలము ఖిలము
నీ మహనీయాతి - సామర్థ్య మరసి నం
శయ మందు వారి యా - లయము లయము

నీ సమీపస్థ లయ్యు నీ - స్నేహ గరిమ
గనని వారల జన్మ సా - గరము గరము
జీవనాధార యిందిరా - చిత్త చోర!
పరమ పావన వైకుంఠ వాస! కృష్ణ! ౧౫౩

మ॥ విను వేమాటలికేల కృష్ణ! మము నీ ప్రేమామృతాంభోధి ముం
చి నిజావ్యాజ కటాక్ష వీచికల ను - జ్జీవింపఁగాఁ జేయుచు
న్నను జీవంబుల వీడి సూక్ష్మతను సం - ధానమ్మునం నిన్ను జొ
చ్చి నిరంతోత్కట హర్షముం గనుటయే సిద్ధాంత మో శ్రీహరీ!

మ॥ అని గోపాంగన లంబుజాక్షుపద విన్యస్త స్ఫురన్మస్తలై
వినుతింపన్ బ్రకటానురాగ రస సం - ప్రీతాత్ముఁడై శౌరి యి
ట్లనె గోపీమణులార! మీ విమల ని - ర్వ్యాజాను రాగంబు మీ
ఘన నైర్మల్య పవిత్ర భక్తి రస శృం - గారంబు విస్పష్టమే? ౧౫౪

ఉ॥ మానినులార! మీతలఁపు మానక సే నఫలం బొనర్తు న
ద్దాన జనాపవాద గుణ - ధర్మ పరిచ్యుతు లుండఁ జాల వీ
కానఁ దరించి వేఁ జనుఁడు - కాల విడంబన మయ్యె రాత్రులన్
గానఁగ వత్తు మిమ్ములను - గాచుచు నుండుఁడి మీ గృహంబులన్

క॥ హరి యిట్టు లాన తిచ్చిన
దరుణీ రత్నములు చనిరి - తమ గీములకున్
దరుణం బత్రిక మించిన
హరి కృప నించింప రేమ - సతివలఁ గినుకన్ ౧౫౬

చ॥ పరదుఁడు నాఁటనుండి వ్రజ - భర్తల కాయములందు రాత్రులన్
గర మనురక్తిఁ జొచ్చి లఘు - కాయములన్ నిజ దర్శనాప్తి నుం
దరులకుఁ బ్రీతిఁ గొల్పి సుమన - శ్శర లీలలఁ జూపి హర్ష సా
గరమునఁ దేల్చి వారిఁ గల - కాలముఁ బోచెఁ గృపా సముద్రుఁడై

మ॥ పర కాయాప్తి విశేష సిద్ధుఁడొకఁడే - వాఙ్మనసా తీత దు

స్తర కౌశల్యముఁ జూపి షోడశ సహ - స్రాధిక రూపంబులన్
దిరుగం జాలి పదాఱువేల సతులన్ - బ్రీతాత్ములం జేయునే?
వరదుం డొక్కఁడు గాక వేఱొకఁ - డిటుల్ వర్తింపఁగా శక్యమే

ఉ॥ ఈ కథ కొన్నిచోట్ల వనజేక్షణుఁ గోరిన గోపికల్ పయో
జాకర మగ్నలైన సమ - యంబున నంబరముల్ గ్రహించి వేఁ
బ్రాఁకి మహీజ మచ్యుతుఁడు - వస్త్రములీక పరాభవించి పె
న్గాకల ముంచి యిచ్చినటుఁ - గానఁబడున్ లవ భేదమాత్రమై

ఉ॥ అంతియ కాక శౌరిఁ గలి - యం దలపోసి తపించు గోపికా
కాంతలఁ బ్రేమ భక్తుల ప్రి - కారము శోధనచే నెఱింగి య
త్యంత కృపాళుఁడై యతను - తాపము మాన్పి యభీష్ట దాతయై
శాంతి ఘటించినట్లు గనఁ - జాలెడి గ్రంథములందుఁ గొన్నిటన్

ఉ॥ ఎయ్యది సత్యమైనఁ బరమేశుఁడు గాని నరుండు బాల్యమం
దొయ్యనఁ గాంక్షితుం డగునె? యొర్తుఁ నిద్దఱఁ గాక పెక్కురన్
జయ్యనఁ గూడి తుష్టియిడఁ జాలునె? యీగతి మర్త్యుఁ డెవ్వఁడే
నియ్యకొనంగ వింటిమె? గణింప నమానుష మిద్ది కావొకో?

ఉ॥ కొందఱు రిక్త లాయమితి - గోచయుఁడౌ హరి పామరత్వముల్
పొంది చరించునే విషయ - భోగివలెన్ విని కృష్ణ కామ్యముల్
సుందరు లాత్మఁ గోరిన వి - లోకన జేయ కొసంగు టర్హమే
యందురు వారి కర్హగతి - నాదట నుత్తర మీఁ గడంగుదున్

చ॥ ప్రతిఫల దచ్ఛ దర్పణ ని - భంబగు నచ్యుతు చిత్తమందునన్
బ్రతిఫలి తాత్మ భక్తజన - భావములే పొడఁగట్టు టన్నమాఁ
బ్రతిహత వస్తురాజి ముకు - రంబునఁ దోఁచిన మాత్రిదాని స్వ
చ్ఛతకుఁ గొఱంతయే? సుగుణ - సంపదకున్ బ్రతిభఁ జకంబొకో

సీ॥ శాక్తేయులకుఁ దమ - శ్శక్తికర్గాడి దేన?
మోక్షార్థులకు - దేన మోక్ష మగును?

అర్థార్థులకు దేన - నర్థ లాభము గల్గు?
కామ్యార్థులకుఁ దేనఁ - గామ్య మబ్బు?
ధర్మార్థులకు దేన - ధర్మ సంపద. గూడుఁ?
పుత్రార్థులకు దేనఁ - బొసఁగు సుఖము?
రాజ్యార్థులకు దేన - రాజ్య లాభము గల్గు?
స్వర్గార్థి దేన సా - ఫల్యమందు?

తే॥ గీ॥ నట్టి నిశ్చల సంకల్ప - మమరఁ జేయు
వాంఛితార్థంబులను సర్వ - భక్తులకును
భక్త సంకల్ప దాయి యీ - శ్వరున కెన్నఁ
బామరత్వంబుఁ బుణ్య పా - పంబు లున్నె? ౧౭౫

తే॥ గీ॥ విషయ వాంఛ దాని ననుభ - వించు నతఁడు
భోగి, ప్రాప్తాను గామియై - పొందు నతఁడ
యోగి, పరహితార్థి, సమశీ - తోష్ణ జీవి
ప్రాప్త భోగియౌ త్యాగి, యీ - శ్వర సముండు ౧౭౬

తే॥ గీ॥ కేవ లైహిక పరతఁ గాం - క్షింపఁ బడెడు
ధర్మ మైనను దుదకు న - ర్థంబ కాని
కామమేని నికృష్టంబ - కరము సుఖద
మోక్షమున కైన కామ్యమే - ముఖ్య మగుట ౧౭౭

తే॥ గీ॥ ధర్మమేకాని కడకు నర్థంబ కాని
కామమేనియు వాని మో - క్షంబు కొఱకు
సాధనంబుగఁ గైకొన్న - సౌఖ్యదంబు
శ్రేష్ఠతమ మని యెందు వ - చింపఁ బడియె ౧౭౮

తే॥ గీ॥ రూపితోత్కృష్ట లీలా స్వ - రూపములను
శ్రీశుఁ డగు హరి నెఱిగి యా - కృష్ణచిత్త
లగు వ్రజస్త్రీల ఘోంబు - నరయ మోక్ష

సాధకము గాని మఱి - నికృష్టంబు గాదు ౧౯౭
తే॥ గీ॥ వ్యక్తమే కాని సాయుజ్య - ముక్తి కంటె
వాంఛ విడలేని సాలోక్య పదము కంటె
స్వామి పరిరంభణాదిక - సౌఖ్య మొసఁగు
పదవి వాంఛించు టరయ శు - భావహంబు ౧౮౦
తే॥ గీ॥ కామమునఁ గోరికొను వారిఁ - గామ తృప్తి
వైరమునఁ గోరు కొనువారి - వైరమునను
స్నేహమునఁ గోరు భక్తులఁ - జెలిమి కలిమి
నుద్ధరించుట యతని యు - ద్యోగ మెపుడు ౧౮౧
ఉ॥ కావున గోపికామణులు - కామమునన్ హరి సన్నిధానమున్
భావన సేయు టాయనుర - భంజనుఁ దర్మిలి నియ్యకొంట దు
ర్భావముగాఁ దలంచుటది - భావ్యమె? కామము మోక్ష సాధనం
బై వెలయున్ వ్రజ ప్రమద - లందిరి నిస్తుల మోక్ష సౌఖ్యముల్

పంచచామరము.

వ్రజాంగనా మనోభవా! ధ - రామరాంగనా వనా!
ప్రజాపతీశ్వర స్తవా! ప్రు - రాణ పూరుషోత్తమా!
ప్రజా వ్రజాధి బోధకా! వ - రాజతామర ప్రభూ!
నిజాను యాయి రక్షణా! ము - నీంద్ర లోక సాక్షణా! ౧౮౨

గద్యము.

ఇది శ్రీమదిందిరానాథ ప్రసాద లబ్ధ సహజ కవితా విరాజమాన
శ్రీమ ద్గౌతమసగోత్ర దివి వంశోద్భవ నరసింహాచార్య
పౌత్ర వేంకటాచార్య రంగమాంబికా తనూజ
రంగాచార్య ప్రణీత శ్రీకృష్ణాతిమానుషత్త్వ
ప్రథమ ఖండాతర్గత చతుర్థాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# శ్రీ కృష్ణాతి మానుష తత్త్వము.

## పంచమాశ్వాసము.



క॥ శ్రీపతి! సతగౌరీ పతి
గోపక పతి! విజిత గర్వ గోలోక పతీ!
గోపతి! పరిభావిత వి
ద్యాపతి! మునిలోక సుకృతి యదువంశ పతీ! ౧

వ॥ అవధరింపుము.

ఉ॥ మాగధ మాధురాంధ్రి యదు మాళవ కాదిక రాజ్యసీమలన్
భోగి శయాను సన్నిధి, తనపోకడ మార్గ్మరయక విభీతుండై
తూగుచుఁ గంస భూధవుఁడు దుఃఖ పరీవృత చిత్తుఁడౌట, ను
ద్యోగులు మంత్రులున్ నృపతి యొద్దకుఁ జేరి వినమ్ర గాత్రులై.

ఉ॥ పుట్టిన నాఁడె యెల్లరకు ఫాలమున గిట్టుట వ్రాసి ధాత; యా
పుట్టిన చుట్టుఁదాల్పు చనిపోవక యుట్టిని గట్టికొంచు నె
వ్వట్టునఁ బట్టువట్టి నిలుపం దరమౌ? యొడిఁగట్టి ముట్టి యా
చట్టల మారి శౌరి మసిఁజేసి కసిన్ దుదముట్టఁ జేయమే. ౪

తే॥ గీ॥ జతనమున సిద్ధిఁగొందవి వరణఁ గలదె.
పురుష ధర్మమౌ? ఫని తుదముట్ట కుండ

సహమ జాలించి పొగడునఁ దడయు చుంట
విఫల సఫలమ్ము సు మున్నె వెదకఁజనదు

ఉ॥ అరసి చూచి సర్వ విషయాంతర భూముల మల్లనాథుఁ జా
ణూరుని నాంధ్రపాలక వినోదకుదోర్బలవంతు ముష్టికున్
స్ఫార మహేంద్ర జాలకు విషప్రతిభున్ రజకాభిధాను నా
యా రచితేభమున్ నగరమందున నిల్పితిమా నృపోత్తమా! ౬

ఆ॥ వె॥ ధర్మయాగ మిషను దవిలి యాహ్వానించి
కృష్ణ బలులఁ బురికిఁ గిట్టఁ జేయ
రజకు మల్లవరుల గజముఁ బ్రయోగింపఁ
గార్యసిద్ధి మనకుఁ గలుగు నిజము ౭

చ॥ పలుక నిటుల్ నృపాలుఁడు సెబాసని భృత్యులఁ బంపి ముఖ్య మం
త్రులఁ బిలిపించి పల్కె వారిఁ దోడ్కొని రాఁగలవని నొక్కరిన్
దెలుపుఁ డటన్న మంత్రులు విధేయత శీర్షములొగ్గి యోజనన్
సలిపి వచించి రీపగిదిఁ జన్యునఁ గంస నృపాలు తోడుతన్ ౮

మ॥ కలఁ డక్రూరుఁడు స్వామిసేవకుఁడు నా కంజాక్షు భక్తుండు ని
చ్చలుఁ దద్దర్శన ముత్సహించు చపల స్వాంతుండు మీ పాదసే
వల జీవించుచుఁ గృష్ణ పక్షమున వాగ్వాదంబుఁ గావించు దు
ర్బలుఁ డిప్పట్టున వానిఁ బంపినను గార్యప్రాప్తి గానౌఁ జుఁడీ

తే॥ గీ॥ ఇతని దుర్ణయమునకు శిక్షింపఁ దగదు
కార్య సాధకముగ వానిఁ గైకొనుండు
హాని కరమయ్యు నొక్కొక యవసరమున
గరళమే మన కుపయోగ కరము కరము ౧౦

క॥ అని యక్రూరునిఁ జీరుట
కనుపన్ భటు నధిపు నాజ్ఞ యడిగి యడిగి కై
కొని యంతట నక్రూరు న
కును ముదలను బంపె దధిపు కొలువున కేఁగన్ ౧౧

వ॥ అంత నాయక్రూరుండ క్రూరుండు గావున నక్రూరుండగు కంసాధి నేత యందు వక్రమార్గంబును గ్రూరబుద్ధియుఁ జింత సేయక యతని మం దిరంబునకు విచ్చేసిన. ౧౨

మ॥ కని యుల్లంతన తిచ్చవోయి నగుచుఁ గంసావనీ నేత డాఁ
గిన కాపట్యము వెల్లడింపక యుపాస్తిప్రస్తవంబుఁ గావించి తి
న్నన జేసన్ననఁ గూరుచుండు మని యాజ్ఞాపించి దగ్గుత్తికన్
గని భాషింపఁ దొడంగె గూఢమతియై కార్యార్థియై యీగతిన్

శా॥ అక్రూరా! విను మిన్నినాళ్ళకు ధనుర్యాగంబుఁ గావించి యా
శాకాంతంబు మదీయ కీర్తి లతఁ జేయంబూనితిన్ బోయి యా
చక్రిన్ రాముని దోడి తేఁగదవె నాజామాతలై యుండుటన్
వక్రత్వంబగు వారిఁ బిల్వకయ నిర్వర్తింపనా యజ్ఞమున్

కం॥ నామాట బృందకుం జని
నా మేనల్లురను గదిసి నాపిలిపినటుల్
ప్రేమను నాహ్వానించుచు
నామాట వచించు మిట్లు నయ వినయములన్ ౧౫

మ॥ గగనా లాపము లాలకించి బెగడున్ గష్టంబు దుష్క్రోధమున్
వగవుం జెంది వృథా దురాగతములన్ గావించితిన్; మిమ్ములన్
జగదా రాధ్యుల నాత్మబంధువుల సచ్చారిత్రులన్ గూళనై
బగవారిం బొనరించి కొంటిఁ గద నా పాపంబు సైరింపరే ౧౬

చ॥ అరదముఁ బంపుకొంటిఁ బ్రియమార క్షమించి దయామయాత్ములై
కర మనురక్తి నధ్వరముఁ గాంచి మముం గరుణింప రండు సా
దరమున మత్కృతాపకృతిజద్రయుఁ బ్రేముడిఁ గైకొనుండు విశా
గుర్తులను జేరికొండు కడుఁ గూరిమిఁ బెద్దలఁ గూడుఁ డిమ్ములన్ ౧౭

వ॥ అనిన గల్లయుఁ గపటంబెఱుంగని యక్రూరుండు గంసు కపటాలాపం బులకు సంతసించి నిజమగు మనః పరివర్తనంబుగ భ్రమించి యిట్లనియె

ఉ॥ నేటికినైన సత్యగతి నెమ్మది ద్రోహకమయ్యె నజ్ఞతన్
జాటిన భక్తవత్సలుఁడు సాదరుఁడై కృప గారవించు మ
మ్మాటికి దుష్ట మార్గ గతి మాని దయామతివై చరించి య
ప్పాటల గంధి దేవకిని బావను బుచ్చుట ధర్మబద్ధమా ౧౯

తే॥ గీ॥ అనిన నక్రూరు పలుకుల కాగ్రహంబుఁ
బొందియును గార్య భారంబుఁ బూని యుంట
నట్ల చేయుదునని పల్కి యతనిఁ బంపె
బృంద కాహ్వానమును జేయఁ గృష్ణు బలుని ౨౦

వ॥ అంత గోకులంబున ౨౧

మ॥ ఒకనాఁ డప్పులఁదేలి యాడుటకు సత్యోత్సాహముం బొంది గో
పిక లుల్లాసమునన్ ప్రభాతమునన్ బృందావనాంతస్థ దీ
ర్ఘికకుం జేరి నిమజ్జనాదిక జల క్రీడా వినోదంబుఁ బూ
నికఁ గావించు నెడం గుబేర భటుఁ డన్వేషించుచున్ దిక్తతిన్

కం॥ ఆకాశ గమనుఁడై చను
చాకారాదిక విలక్షణాదులఁ దన చి
త్తాకర్షక లగు లేమల
నా కాసారమునఁ జూచి యతను వశుండై ౨౩

ఉ॥ భూమికి డిగ్గి నైజమగు భూమిక మాటిచి కృష్ణ రూపుఁడై
లేమల పొంతకుం జని నిలింపుఁడు నిల్చిన గోపికాళి క
న్బామి ముకుందుఁ డచ్చటికి వచ్చుటకై తడబాటునన్ బహి
స్సీమను డాసి వచ్చి నిజచేలములన్ ధరియించు నంతలోన్ ౨౪

చ॥ ధనద భటుండు శంఖుఁడు సదగ్ర మనోభవ దగ్ధ చిత్తుఁడై
వనితలఁ గృష్ణ రూపమున వారిరిఁ గూడఁ దలంచి తత్తరిం
చిన విక్షతాద్భుతక్రియకుఁ జేడియ లెల్లరు జిచ్చపోయి భ
క్తిని గమనించి యా కపటకృత్యము "హాహరి! ప్రోవవే!" యనన్

మ॥ మురళీ నాదముతో మయూర శిఖతో ఫుల్లాస్య పద్మంబుతోఁ
దర హాసాంగ కటాక్ష వీక్షణముతోఁ దారుణ్య విస్ఫూర్తితో
వర బింబాధర విభ్రమ ప్రభలతో భాస్వ ద్విభూషాళితోఁ
దరుణీ మోహనుఁడై ముకుందుఁ డటఁ బ్రత్యక్షంబుగా శంఖునన్

ఉ॥ నివ్వెఱఁ బొంది యొక్కెదుట నిల్వఁడఁ జాలక తూలి కూలుచున్
బ్రువ్వనఁ దిట్ట గోపికలు రూపతి యెప్పటి శంఖ రూపుఁడై
యవ్వనమాలి కాళ్ళఁ బడి యజ్ఞతతున్ క్షమియింపఁ గోరి నో
రొవ్వ నుతింప సాఁగినను గ్రోధము మాని ముకుందుఁ డిట్లనున్

తే॥ గీ॥ శంఖ! వంచింపఁ దగునె? నిశ్శంక మోస
మొనఁగఁ జాలని వ్రేతల నింక నైనఁ
గన్న మెలఁగి వర్తింప లేకున్న నిన్ను
విన్న మన్నను గాకుండ విసరివైతు ౨౮

క॥ అని యతనిఁ బంపి గోపీ
జనులును గోకులముఁ జేరఁ జని, బలరాముం
గని సకలముఁ దెలుపుచుఁ గా
వనమును దరియించు నెడల నరపతి నియతిన్ ౨౯

చ॥ అరదము నెక్కి సూతునకు నావలి ప్రక్కనఁ గూరుచుండి యా
హరి బలరాము లెక్కుటకు నై రచియించిన నవ్య పీఠికన్
వరవరు నాజ్ఞఁ దాఁకక మనంబున కెక్కు విచిత్ర భావముల్
విరివిగ నంట నాఁడి కోన వెక్కనమై కనుపింప భక్తిమై ౩౦

శా॥ గోవిందార్పిత చిత్తపద్ముఁడయి యక్రూరుండు బాహ్యంబుగన్
గోవిందా! కమలేక్షణా! నరహరీ! గోపాలకా! మాధవా!
భావాతీత! ముకుంద! కృష్ణ! వరదా! పాలింపవే యంచు సం
భావింపం బలుమాఱు మోదజలధిన్ మగ్నాత్ములై సోదరుల్

ఉ॥ భక్తుఁ డెవండు తన్మయతఁ బాడుచుఁ జొక్కి రథస్థుఁడై పరా

వక్తి నిజానురక్తి నిహ సౌఖ్య విరక్తి భజించుచుండె వి
ధ్యుక్త విధిం బ్రభాతమునఁ దోషిత పాంథులఁ జేసి వాని సం
యుక్త మనః ప్రకామ్యుఁ గృప నూని ఘటించుట యర్హ ధర్మమా

క॥ అనుకొను సంతటిలో రథ
మును డాసినఁ గృష్ణు బలుని ముదితుండై భ
క్తిని నక్రూరుఁడు గనఁగొని
వనజాక్షుఁడు బలుఁడటంచు భావించి హృదిన్. 33

వ॥ రథంబు డిగ్గి నమస్కరించి యిట్లనియె. 34

ఉ॥ భూరమణుండు కంసవర భూధవుఁ డంపఁగ వచ్చినాఁడ న
క్రూరుఁడ మీకు భక్తుఁడ విరోధము మాని నరేంద్రుఁ డర్మిలిన్
జేరఁగఁ బంపె మిమ్ముఁ జనుదేర దగున్ ధనురధ్వర క్రియన్
బోరన మాతులుండు దలపోసి ఘటించు జగద్ధితార్థమై 35

చ॥ అన నిజమంత్రయుక్తిఁ దెలిసి యంబుజనాభుఁడు వాని నిర్మలా
త్మను నరపాలు కృత్రిమ విధానముఁ జూచి ప్రతిక్రియన్ వడిన్
మనమునఁ జింతఁ జేసి చని మందకు నంద యశోదలన్ బ్రియం
బున నొడఁబాటుఁ గూర్చి వ్రజముఖ్యులఁ దృప్తులఁ జేసి రాదగున్

వ॥ అని యొడంబరచి యతని గోకులంబునకుఁ దోడ్కొని పోఁ గడంగ న
క్రూరుండును పాదచారియై వారి పిఱుఁదంటి నడచి బృందఁ బ్రవేశించి
నంత వాసుదేవుండు 36

శా॥ ఆతిథ్యంబు నొసంగి హృష్టమతియై యక్రూరుఁ బూజించి సం
ప్రీతిం గూర్చి యశోదకుం దెలిపి యా బృందాటవీ వాసులన్
జేతో మోదము తోడఁ గూర్చి యొకట న్విన్పించె నాత్మ ప్రియా
ణాతీతాద్భుత దుఃఖ వార్త హరి యిట్లాభీరు లల్లాడఁగన్ 37

పుట్టిన నాఁడె గోకులము పొంతకుఁ దెచ్చిరి నన్ను మీ కడన్
బెట్టిన దాది నన్నుఁ గరుణించి భరించితి రింత దాఁక మీ

చుట్టరికంబు మాన ననుఁ జుట్టిన కర్మ తలంగఁ జేసినన్
గట్టిడి బమ్మ వైదములు గానఁగఁ బోలునె యెంతవారికిన్ ౩౯

చ॥ మధురకు రమ్మటంచఁ జెప్పె మామయు దూతను నేడ చూడ నా
విధి నియతంబ పోన; మిము వీడ్కొని కూడుట దుర్లభంబు; నే
బృథివి నొనర్పఁగాఁ దగిన పెక్కు కృతుల్ గలవిఁద యున్న నే
డిధిని నసాధ్యముగా కతన వీడ్కొనుటే యుచిత ప్రియుక్తిగా ౪౦

చ॥ అరుల దురాగతంబు లెవి యుంటవు నన్నుఁ బ్రియాళి నెన్నఁడున్
మఱువను; ధర్మగాములకు దాసుఁడఁ బాపుల కెగ్గు సేయు నే
వెఱవను; లోక కంటకుల భీతి నడంతును; శాంతిఁ గూర్తు దు
ర్భర దనుజ ప్రవృత్తి నఘ భారముఁ ద్రుంతు శుభంబొసంగుదున్

శా॥ ఈ యావాహ్వనము నా కపాయకరమం చేలా తలంపన్? శుభం
బై యొగించును; దీనఁ గ్గలెడిని గంసాంతమ్ము సాంతమ్ముగా
మాయాత్మీయుల ముక్తి తాతకును సామ్రాజ్యాప్తి దుర్బోధకుల్
మాయోద్యోగులశాస్తి రాష్ట్ర జన సామాన్యాశయ ప్రాప్తియున్

చ॥ నను గికురింపఁ బూని కొన నాశము దప్పదు; భూత్రయంబునన్
నను మఱపించునెద్ది? జననాథుఁడు పంపిన యీ రథంబునన్
ననుఁ బరిమార్పఁ బీతికఁ గణంగి యమర్చె విచిత్రలీల వే
గనుఁగొనుఁ డంచు నారథము కట్టెదుటన్ జని నిల్చి యంతటన్ ౪౩

చ॥ ధనువు నొకండుఁ దేఁబనిచి ధార్మికుఁడై శరముం దగిల్చి యే
సిన శకటస్థ పీఠికను శీఘ్రమ భగ్గున బొబ్బరిల్లి తు
త్తునియలునై స్ఫులింగ కణ దుస్సహమై శకటంబు మాడినన్
గని ప్రజపాళి బెగ్గడిలెఁ గంసుని భృత్యులు విన్నవోవఁగన్ ౪౪

శా॥ ఈ వైచిత్ర్యముఁ జూపి యెల్లరకు శ్రీకృష్ణుండు భాషించె వి
ద్యా వైదుష్యము వెల్లడించు చిటు మిథ్యా దేహ విభ్రాంతి మ
ద్భావార్ధంబు గ్రహింపఁ జాలకయ దుర్భ్రాంతిన్ భవాంభోధి నే

లా వాంఛింప? యథార్థ సంగ్రహణ బాహ్యార్థ స్మృతిం బాయుఁడీ

ఉ॥ తొలి జన్మంబున నిట్టి స్పృశించుటకు నెంతో ఘోరయుక్తి దపం
బులు గావించుట యీ యభీష్ట గతి నెమ్మిం గూర్చి వర్తించితిం
బిలువం శిష్యుల భక్తిం గన్నవుడు నట్ల ప్రేమించు సన్న్యాసి ప్రా
జ్ఞాజాంతస్థిరాగ చంచరీకము నవా నప్పుడ్డుంటిం బద్ధుండనై ౪౩

మ. అన రాధాసతి దక్క నెల్లరును బాష్పాంబోధితార్ద్రాక్షులై
ముసుంగిరి శోక పయోధి వారలను సంబోధించి బోధించి శాం
తిని బోం గొట్టి వ్రజ ప్రజా సమితికిన్ వేదాంత భావంబుఁ గూ
ర్చెను నా రాధ నవాద్భుతానుభవ వాక్ప్రోక్త సూక్త సూక్తంబులన్

వ॥ అంత మరునాటి దినంబు సంధ్యా కాల కృత్యంబుల నిర్వర్తించి తొని బల
రామ కృష్ణులు యశోద నెయ్యంబున నొసంగిన తీయంబులగు తాయంబు
ల నపూర్వ పూపంబుల నక్రూరునితో భుజించి నందునకు నమస్కరించి
యశోదమ్మ శిరమ్మూర్కొని రాధిక బిగ్గఁ గౌగలింప వృషభ శకట
స్థులై ప్రయాణోన్ముఖులగు నెడ ౪౪

సీ॥ కనులారఁ గను గోపికా చాతకముల కీ
క్షణ తటిల్లతల హర్షము నొసంగి
ఫలసముదీర్ణ గోపక సస్యములఁ గృపా
మృత తుషారముల వర్షించి పెంచి
పశు మృగ ఖగ జీవ వంశాళి వంశీ ని
స్వన గర్జనముల జీవములఁ బోసి
దగ్ధ బృందావన స్థలి మహోదారాతి
వృష్టి ధారలఁ జిగురింపఁజేసి
తే॥ గీ॥ నమ్యగవతరణోచ్చల త్పంచల తను
భవ్య గోకుల క్షేత్రంబు పదను జేసి
పక్వ పాకంబుగా కన్ని పక్షములకు

దర్శన మొసంగఁ గృష్ణాంబుదంబు వెడలె ౫౦

వ॥ అని వాపోవు వారు గొందఱును ౫౦

సీ॥ భూజ విహీనమౌ భూభృత్సమానమై
వనరాజు లేని కాననము కరణి
సంతాన విరహిత సదనోప మానమై
యధిపుఁడు లేని రాజ్యంబు పగిది
కంజ రిక్తంబగు కాసార సదృశమై
రజనీకరుఁడు లేని రాత్రి విధము
విద్యాసుశోభ లేని పేద మానిసి భంగి
ధర్మము లేని యాగాదాయ మట్లు

తే॥ గీ॥ కుసుమ గుచ్ఛ విహీన నికుంజ మట్లు
సస్య రహిత కేదారంబు చందమునను
చెన్నడలి పోఁడిమిని వీడి చిన్నవోయెఁ
గృష్ణు నిష్క్రాంతి దునదృష్ట బృంద నేఁడు ౫౧

వ॥ అని పరిపరి విధములఁ బలవించు వారు గొందఱును ౫౨

సీ॥ పదునేను వర్షముల్ పది నిమేషములయ్యెఁ
గలఁగని మేల్కొన్న కరణి జరిగె
భావనా జగతిపై బడి లేచినట్లయ్యెఁ
గనునంత జమ్మ చీఁకట్లు గ్రమ్మె
జీవన నౌక మాయా వారినిధిఁ గ్రుంకె
నాసలు పొడసూపి యంత రించె
భవనాట్య రంగాన యవనిక పడిపోయె
నిజ జీవసారథి నిష్క్రమించె

తే॥ గీ॥ భక్తిమయ పటచిత్ర వైకుంఠ మమరఁ జూపు
నింద్రజాలి యదృశ్యుఁడై యెగిరి చనియె

నీకు నేనధి మనము జీవింపఁ గదము
విశ్వ శుభమూర్తి శ్రీకృష్ణ విరహార్తి ౪౩

చ॥ అని విలపించుచుఁ బరమ నంటి కడంక వ్రజాధినేత లం
గనలు వ్రజార్భకుల్ వ్రజాలు గాఢపరితాపమున న్నొర్చిరా రథం
బును గృప నాఁగ చుండుచిక ముందు నిలంబడి యచ్యుతుండు వ
ల్లవుల ప్రియకుమార సిగతీని గేనుచు గోపకు లాడఁ బ్రీతిమై ౪౪

క॥ నాపై బ్రేమయు భక్తియు
నేపారఁగఁ గల్గునేని యుండక నిలువఁడి!
గోపకు లారా! వినుఁడు
ప్రాపయి మిము మనెడి కేప వస్తు నను డీ! ౪౫

వ॥ గుప్తంబుగా నచట నున్న రాధికఁ బిలిచి యావలకుం గొనిచని రహ
స్యంబుగ మంతనంబు లాడి తనసంతసంబ యిట్లని యె. ౪౬

ఉ॥ నా ప్రియరూప రాధ కరుణారస పూరి; భక్తి యుక్తలై
సప్రియ భావులై కనిన సర్వ శుభంబులు మీకు లభ్యమా
నీ ప్రమదోత్తమ ప్రకృతి వృత్తి సదిష్టము లెల్లఁ బాయు; మీ
ర ప్రతిమానులై ప్రతి హంతాదు లెఱుంగక నన్నుఁ జేరుఁడీ. ౪౭

వ॥ అనుచులఁ బొడమిన కడింది విడి గడువుదాఁటక నిలువంబడిన వడి వడి
నాబడి వేఁచువు వెనలెఁ; నాఁటనుండి రాధిక ౪౮

శా॥ భావ్యంతః పరిశుద్ధయై స్థిరముగా భావాబ్జ వీక్షా బుధి
కోపత్యఖండ నిరంత భక్తి హరి దివ్యోత్కృష్ట తేజంబు దు
ర్గాహ్యంబు న్మది నిల్పి మాధవ గుణాకారాది సంపత్తి వ్యా
ప్తమ్య శ్రీహరి రూపముం బడసి తద్గోపాలుర బృందలో ౪౯

క॥ సంతోషాంబుధిఁ దేల్చుచు
వింతగు భక్త్యధ్వరాగ్ని వ్రేల్చుచు నాత్మన్
గాంతి సఘ తృణముఁ గాల్చుచుఁ
గంతు జనకు నుఖ్యపఁ బొల్చి కాంక్షల మనిచెన్ ౫౦

శా॥ సామాన్య వ్రజపాళికిన్ సదయుఁడై సాలోక్య సామీప్య మో
క్షామోద ప్రదుఁడైన మాధవుఁడు భక్తగ్రామణిన్ ధాధికన్
సామీప్యంబునఁ గాక ధర్మమతియై సారూప్య సాయుజ్యముల్
జేర్పం గూర్చి కృపా కటాక్ష తతిఁ దల్లీలాప్తి లాలింపఁడే ౯౯

వ॥ అంత నక్రూర బలరామ కృష్ణులు గొంత దవ్వరిగిన పిమ్మట మధురా నగరమున కనతిదూరమునఁ గల యమునానదీ చేరువకు సంధ్యా సమయంబగుట నక్రూరుఁడు బలరామ కృష్ణుల కిట్లనియె. [illegible]

మ॥ "అదిగో చండ కరుండు రాక్షసతను మాధ్యాహ్నంబుఁ జాటించు నా
టిది యుష్మ ప్రస్తనకాల సంయమన సత్కృత్యాళికిన్ వేళ; యీ
నది స్నానాదిక కర్మలం గడప నాజ్ఞాపించినన్ నేఁ బోన
గ్చ్రేన మీ చిత్తను"టన్న వారు "సరియే శీఘ్రముఁబ గావింపుమా"

కం॥ అని బలకృష్ణుల యనుమతిఁ
గొని శకటము నిలిపి యమున కును నక్రూరుం
డనుపమ నియతిసిఁ జని యం
దున మజ్జన మాచరించి మునుకల నిడఁగన్ [illegible]

మ॥ హరి తోషించి నిరుక్త ధర్మగతి నా యక్రూరు సాఫల్య క
ర్మ రచనావల్లభుఁ జేయనెంచి ముదమారన్ దర్శనం బిచ్చె సా
గర కన్యావర భోగి భోగములతోఁ గౌమోదకీ శంఖ శా
ర్ఙ్గ రథాంగాదులతో క్షమావనితతోఁ బ్రద్యుమ్న వైకుంఠుఁడై

వ॥ అంత నా యక్రూరుండు [illegible]

శా॥ పూర్ణానంద పరీత హృత్కమలుఁడై పుణ్యాతి పుణ్యప్రభో
ద్దీర్ణాత్యద్భుత దర్శన ప్రతిభకున్ దిగ్భ్రాంతుఁడై తొల్లి తాఁ
గర్ణాకర్ణిక విన్న వర్ణనకు సాక్షాత్కార దృశ్య క్రియా
తూర్ణ ప్రజ్ఞ యతీతమౌటఁ గని సంతుష్టిన్ నుతించెన్ హృదిన్

సీ॥ జగముల వెలిఁగించి యుగతతి నడిపించి

దిగమ్రింగి జీర్ణించి తిరుగు నెవఁడు
ఇక్కడి కక్కడి కొక్కఁడనై నిక్క-
యెక్కడఁ జిక్కని చుక్క యెవఁడు
ఐంద్ర జాలికులకు నైంద్ర జాలికుఁ డయి
సర్వలోకక్రియల్ జరుపు నెవఁడు
మూఁటి కతీతుఁడై మూఁటిని దగిలి మూఁ
టను బెంచి మనుచుచుఁ దునుచు నెవఁడు
తే॥ గీ॥ వికృతినై పుట్టి ప్రకృతి భావించు నెవఁడు
పుట్టు వెఱుఁగక గిట్టింపఁ బుట్టు నెవఁడు
రూపమే లేని భాస్వర రూపి యెవఁడు
అట్టి నినుఁ గంటి శుభముల నందు కొంటి ౭౮

వ॥ అని ప్రార్థించి తాసంబుమాని వెలువడి దుకూలంబులఁ దాల్చి మగిడి వచ్చిన యక్రూరునిఁ గాంచి మందహాసంబుఁ జేసి హరియిట్లనియె. ౭౯

శా॥ ఏమోచోద్యముఁగాంచివచ్చినటు గాన్పించున్ మొగంబున్ గనన్
మే మావృత్తము నాలకింపఁ దగమా? నీయుందడించింప నే
లా? మాకుం దెలియంగ రాని యది? యేలా? భావమున్ డాఁచ చి
త్రామానుష్య వచో౽తి దృశ్యమను గన్నారన్ గనం జాలితే
వ॥ అన నక్రూరుఁడు స్తబ్ధతన్ గని ముకుందా! నన్ను శోధింతువేఁ
కననోనే భువనత్రయంబునను నీకాయంబునన్ లేని సా
ధన సంపత్తియు దృశ్య సంతతియు యాథార్థ్యంబుగానీవ ద
గ్సన భాగ్యంబొనఁ గూర్ప జన్మ చరితార్థం బయ్యె ముమ్మాటికిన్
క॥ అనిన నగి వాసుదేవుఁడు
వినమితుఁ డక్రూరుఁడై పవిత్రితనుండై
పణఁకెను బులకితుఁడై చే
తనుగుణగణము రథము హృదయము ప్రీదులన్ ౮౧

ఉ॥ కంసుని గూఢచారులు వికావికలై హృదయంబు వీఁల వి
ష్ణ్వంశుని నంద నందనుని యాగమనంబు రథాంగనాశమున్
సంశయ మెల్ల మాని చని చాటినఁ గంసుఁడు దారుణాతి ని
స్త్రింశ హతిన్ గలంగి తనభృత్యులఁ బంపి యమాత్యులన్ గనన్

కం॥ కని నిర్ణీత విధంబున
వనజాక్షున కెగ్గు గూర్చి పగ సాధింపన్
బనిచెను మంత్రులఁ గార్యం
బును న్యాయముగఁ దాల్చి తలను బూనిరి కడఁకన్ ౭౪

తే॥ గీ॥ అంత మధురా పురాంగణ మందుఁ గృష్ణు
నాగమన సూచకం బగు నసుర రచిత
డమరిక యొకండు దనయంత ధమ ధమార్భ
టులను దిక్తతి మార్మ్రోఁగఁ జెలఁగి మొరసె ౭౫

వ॥ అంత.

ఉ॥ మూఁపునఁ బెద్ద మూట, ముకుపోఁగు, బుజంబుల దుప్పటంబు, వా
ల్చూపులు, పంచకట్టుఁ దలచుట్టును, ముందట గార్ధభంబుఁ, బొ
జేపల గాల మొందు కేలఁ బట్టి కరాన, పదాలజాల నా
లాపనఁ జేసికొంచు గవలాక్షునితో రజకుం డొకండనన్ ౭౬

శా॥ ఎబ్బే మొద్దులబండి నున్న పసియబ్బీ! మొద్దులం గట్టితే
అబ్బేఁ గుబ్బెత లుబ్బ గబ్బి వగుదబ్బీ దెబ్బలే ద్రొబ్బుతే
నిబ్బంగుప్పడి వబ్బుముం గడుప నీ కిబ్బట్టలం ద్రొబ్బి మా
యబ్బాయిబలె నిబ్బరింతు నిజ మబ్బా! దబ్బకల్ గావు నూ ౭౭

వ॥ అనిన

చ॥ శకటము నాఁపెఁ గృష్ణుఁడు నిజంబు గ్రహించి మనంబునన్ సురాం
తకు రజకానుగున్ దగు విధంబున మన్నన బుద్ధిసెప్పి యుం
తక నిలయమ్ము నల్పుటకు దైత్య హరుండను దూఁకి క్రిందికిన్

వికట వచోఽద్భుతముగ్ రజకుఁ బిల్చుచుఁ నిల్చుచు బల్కె నీగతిన్ ౭౯

శా॥ అల్లాగా! మెను గొల్లపిల్లఁడను; కల్లా పొల్లులన్నేర్వ, నే
నుల్లాసంబున నేఁగు దెంచితిని మీ యాకారం బలే పిల్లఁగాం
గల్లుం గల్గు నటంచు వింటి దయతో నాకిమ్ము సెల్లాలు నా
వల్లన్ జెల్లిన దెల్లఁ గొల్లనిడి మావల్లెన్ గనన్ వెళ్ళెదన్

మ॥ అన నాచాకలి నవ్వి గార్దభముపై నాయత్తముం జేసి యుం
చిన గోతంబును విప్పి యందుఁగల న చ్చీనాంబరం బిచ్చి దీ
నిని మా రాజులకే నొసంగెదను; సీనయ్యాంబు తియ్యాంబు దీ
నినిఁ బైఁ దాల్చిన నెత్తి కెక్కెదరు కన్నుల్ నిన్ను గన్నంత నే ౮౦

మ॥ అనుసంతన్ గనుసన్న రాముఁడును నత్యంతాశుగా వేఁడుదై
కనుపింపన్ ధరపై ముకుందు కనుసైఁగన్ మూసె నాదైత్యు వీ
క్షణముల్; తత్క్షణమా రజాసురునకున్ గంజాక్షుఁ డావ స్త్రి రా
జినిఁ జాటెన్ క్షణమాత్రి భగ్గుమని యర్చిజ్జ్వాల లుప్పొంగఁగన్

ఉ॥ ఆవల నేఁగి రాబలుఁడు నచ్యుతుఁడున్ దరహాస చంద్రికల్
భూవలయంబుఁ గ్రమ్మ నట మూఁగిన కంసుని గూఢచారులున్
జేవ తలంగి పాతి రవనీపతికిన్ రజకాంత మెంతయో
బావురు మంచుఁ దెల్ప నచివ ప్రవరుల్ పరితాప మొందఁగన్

వ॥ అంత.

శా॥ కాలాంభోధర కాలకాయరుచితోఁ గల్పాంత గర్జారవో
ద్వేల క్రూర కఠోర ఘీంకృతులతో విద్యుల్లతోద్దీప్త దృ
క్జ్వాలోద్భ్రామిత జిహ్మదేభ తతితోఁ గాలాంత కోచ్చాలితా
ఖీల వ్యాళకరంబులతోఁ గువలయాపీడేభ ముద్వేగియై ౮౩

మ॥ పృథు పాదోద్ధత ఘట్టనోత్థిత రజో వేగాప్తిఁ బంకీకృతా
భ్ర ధునీ భంగము సంచరత్తను వికారాంభోదమై చంచల
త్ప్రథులోగ్రాక్ష జయత్తటిల్లతికమై హృద్భేది కాలాంత కాం

బుద గర్జోపమ ఘీంకృతిన్ వెడలె సద్యోత్పాత ససూచియై ౮౪

మ॥ మధురా ద్వారము దాఁటి డాసి యెదుటన్ భాసించు నామాధవుం
దధిరోహించిన వింత గోశకటమున్ హస్తీంద్ర మంత్రి క్రతన్
బధి మధ్యస్థలి కీప్సి శుండమున గోద్వంద్వంబుఁ దాడించినన్
రుధిరోద్గారము సేసి నేలఁబడ నత్రూరుండు నిశ్చేష్టుఁడై ౮౫

మ॥ వరదా! గోద్వయమీల్గెఁ; స్యందన మదేవాప్రిలెన్ ధరన్ దూలుచున్
ద్విరదం బల్లదె తుండ దండ మదిగో విస్ఫోధి పైకెత్తి యే
డ్తెర నన్నో మఱి నూతునో హళినో తాడింపం బ్రయత్నించు; ని
ష్ఠుర మీలాగు వహించి సైపఁ దగునే? వారింప రావే కరిన్

మ॥ అన నక్రూరుఁడు, మాధవుండు నగి మిథ్యా భీతి యేలా? కరం
బనురాగంబున స్వాగతం బొసఁగ భూపాధీశుఁడో మాతులుం
డనుపన్ హస్తము మీఁది కెత్తి మనుడాయన్ జీరె నీ హస్తి వా
హనమై యందఱ వీధులన్ గొని చనన్ వ్యాలోలతన్ మానుమీ!

మ॥ అని యుద్ఘాటనఁ జేసి యొక్క త్రుటి దైత్యారాతి విశ్వంబుపైఁ
జని మత్తేభము మ్రోలకున్ బ్రకృతి రక్షా దక్ష దుర్మార్గ శి
క్షణ శస్త్రంబగు హస్తమున్ గజముపై సారించి తుండంబుఁ గై
కొని బిట్టీడ్చిన మోకరించి పడియెన్ గ్రోధంబు మోదంబుగాన్

మ॥ హరి యారోహణ చేసి యా గజముపై నక్రూరు నెక్కించి స
త్వర మా రాము సధస్థితుం జలుపుచున్ బాదాహతిన్ గుంభమున్
జరుపన్ దంతి నిటాలున న్నిలచి యుత్సాహంబునన్ సాఁగె సుం
దర విస్ఫార గభీర ధీర లలితోదారాతి సంచారమై ౮౯

మ॥ మధురాపట్టణ వీధులం దగిలి సన్మానించి యక్రూరునిన్
మధుదైత్యోన్మథనున్ బ్రలంబ దమనున్ మార్గోప మార్గంబులన్
మధురా రామ వణి క్పథాంతరములన్ బ్రాసాద మధ్యంబులన్
మద వృష్టిన్ వెదఁజల్లుచున్ గొనిచనెన్ మాతంగ మూర్కేగుచున్

వ॥ ఇట్లు లూరేగు సమయంబునం గొందఱు

శా॥ శ్రీకృష్ణోన్నత సార్థవై విపుల కీర్తిన్ శిక్షితంబైన మా
యా కల్పారక సామజంబయిన యత్యాశ్చర్య శాంత స్థితిన్
జేకూర్పంగల యీ ప్రజాప్రభుఁడు రోజింపన్ మనుష్యాధికుం
డౌ కంజాక్షుఁడొ? భోగి భూషణుఁడొ? దేవాధీశుఁడో? బ్రహ్మయో

వ॥ అని కొనునంత మఱికొందఱు ౯౩

సీ॥ మధు రాక్షస ధ్వంసి మధురా క్షమాధిప
ధ్వంసియై వెలయు నిస్సంశయమ్ము
మధుర వేణు వినోది మధురసా స్వాదనా
లోల భూపక కంఠ లుంఠనంబు
మాధురంధరుఁడు మా మాధుర రాజ్య మా
థర కంస వర జీవ హార విహారి
మా ధరాధవుఁడు త్రి మా ధరధరుఁడు త్రి
మా ధరాధిపు దుర్గించు మాటనిజము

తే॥ గీ॥ మాథురాధీశ హృదయ తాపకర రుధిర
మధురస ప్రీతి మధుపుఁడు మాధవుండు
అనుచు మధురాధ్వ చరులెల్ల రాడిగొనెడు
యమక భాషణల్ మొరసె దిగంతరముల ౯౪

ఉ॥ గొల్లల పిల్లఁ డందు రదిగోఁ గనిపించెడి పిల్లవాని వ్రే
పల్లె నివాసి నల్ల మెయివాని, భళీ! యిటువంటి సుందరుం
డెల్ల జగాన లేఁడు; మన దృక్కులు నేఁడ యదృష్ట వంతముల్
చెల్లి! యటంచుఁ బల్కు చొక చేడియ ప్రేయసి నాపి చూపెడిన్

ఉ॥ ఈ నవ కోమలాంగకము లీ మృదు శీతల వీక్షణాళి యీ
మానిత కంబు కంధరము మంజుల చంద్ర నిభాస్య బింబ మీ
శ్రీ నిలయాఢ్య వక్షము విశిష్ట ఘనాఘన దేహకాంతి యొం

దేనియుఁ గంటి రే? యనుచు నింతులు మూఁగిరి సౌధ పాళిపై

మ॥ ఇతఁడే పూతన మారకుం డితఁడె దైత్యేశాంతకుం డీతఁడే
తత భీమోరగ మర్దనుం డితఁడె దగ్ధారణ్య సంజీవనుం
డితఁడే సర్వజ్ఞ నాథ పూజిత పదుం డేతెంచె రారండు! గు
ణ్యైతలారా! యని లేమ యోర్తు చెలులన్ బిల్చెన్ ఘనావేశయై

శా॥ ఎన్నన్నాళ్ళకుఁ గొన్న నోము ఫల వత్కృత్యంబు గాఁ జెల్లె నాఁ
గన్నారం గనఁ గల్గెఁ గంతు జనకున్ గంజాక్షు నా బృందకున్
గన్నాకున్ దనుఁగన్న యీ మధురలోఁ గన్పించు గార్యార్థియై
పున్నాగుండ నిరాల్చి రర్థి విరులన్ బూఁబోఁడు లా శౌరిపై ౯౮

సీ॥ ఆకాశవాణి సత్యము పల్కిన దటంచుఁ
శాప మిన్నాళ్ళకుఁ బండె ననుచుఁ
గలికి దేవకి రాణి కడుపుఁ జల్లన యంచు
ధర్మ మెన్నఁగ వజ్ర వర్మ మనుచు
ఓడలు బండ్లు బండ్లోడలఁ జను నంచు
దైవ బలంబె ప్రధాన మంచుఁ
జేసిన వారికిఁ జేసికొన్నంతంచుఁ
గట్టి కుడ్పుదె కీడు కడకటంచు

తే॥ గీ॥ మునుల బాధించు టూరక పోదటంచు
నిట్టి దృష్టాంత మవసరమే యటంచు
బాటసారులు వెలిపుచ్చు భావ చయము
పరమ శ్రావ్యమై యలరారెఁ బౌర తతికి ౯౯

శా॥ సర్వజ్ఞుండని యందురే యితని దుశ్చారిత్రుఁ డీ కంసుఁ డీ
యుర్వీధ్వంసకుఁ డధ్వరంబని యసత్యోదంతముం బంపినన్
దుర్వార ప్రతిభా యుతుండు హరి యా దుర్మార్గ మూహింపఁ డే
ఖర్వోద్యోగమునన్ ధనుస్సవనమున్ ఖండించి త్రెళ్ళింపఁడే ౧౦౦

వ॥ అని గుసగుసలాడు వారు కొందఱును.

ఉ॥ ఈ సుకుమార      రసము లీ యాదవ శౌ కుమార వీరు లు
ల్లాసముతో సమాయకులై దార్కొని యుత్కట మృత్యు కన్గొనగా
మోసరి కంస భూత మటు బొట్టను బెట్టి కొనంగ నేచి నిం
డానను గాంచుచున్న దకటా! యని కుందిరి కొంద ఱజ్ఞులై ౧౦౩

వ॥ ఆ తరుణంబున.

సీ॥ వాసుదేవుఁడు వచ్చె స్వాగతంబు నొసంగి
యర్ఘ్య మొసఁగెద మనెడి వారు
శ్రీకృష్ణుఁ డరుదెంచె శ్రీలఁ జెంపొందింపఁ
బూజింతు మా యని మురియువారు
వరదుండు సనుదెంచె భక్త సంఘంబుఁ జేట
సత్కరింతుమె యంచు ననెడు వారు
సర్వ విభుండు వచ్చె సర్వసాక్షి యిందు
పిలిచెన మా యని తలఁచు వారు

తే॥ గీ॥ నగుచు యాదవుల్ ధన పరు లగ్రికులులు
సేవకులును సంభావింపఁ జింత చేసి
కంస భూతంబునకుఁ బె..ఁ గంప మొంది
స్వాగత మొసంగ నొకరైన పోఁగిరారు ౧౦౪

వ॥ అంత. ౧౦౫

ఉ॥ పౌకల నిశ్చితార్థమును భావ మెఱింగిన మాల్యకారి యా
వారిజ నాభు నిత్యమును భావనఁ జేసి మెలంగు వాఁడు న
క్రూరుని శిష్యుఁ డొక్కఁడు నిరోధము సేసి నృపాజ్ఞ జీవముల్
ధానను బోసి యచ్యుత పదాంబుజ పూజ ఘటించ సిద్ధుఁడై ౧౦౬

ఉ॥ సంపఁగి పూల దండలను జయ్యనఁ జక్కఁగఁ గూర్చి భక్తిమై
పెంపుగ దంతి ముందు కరుదెంచి వహించి "మహానుభావ! శా

లింపవె నన్ను: నోములు ఫలించుట సిన్గనుఁగొంటి; దప్పు నై
రింపవె; దాస దాసుఁడ; భరింపవె; నిన్గొలువంగ వచ్చితిన్ ౧౦౭

మ. అన మత్తేభము మోకరించి పడి సత్యాశ్చర్య చేష్టాప్తి దూ
రెను వేగిర్చిండికి వాసుదేవుఁడును దూరేన్ రాముడున్ వాని వెం
టనె యక్రూరుఁడు దూరె నందజను సంభావించి పూజించి వై
చెను పెం దండల మాల్యకారుఁడు పుర స్త్రీలున్ విరుల్వోయఁగన్

ఉ. అచ్చట నున్న కంస భటు లాతురతన్ బరువెత్తి వచ్చినన్
జెచ్చెర వారి నందజను జిందర వందరచేసి దొండముల్
పచ్చి యనేకపంబు; యదువీరుఁడు హస్తము మీఁది కెత్తినన్
మచ్చిక నాఁగె నేనుఁగు సమస్తకృతులున్ భటపాళి పాఱఁగన్. ౧౦౮

వ. ఆ సమయంబున

సీ. బాల్యమునంద దేవకి దాసిగ నొసంగఁ
బడి రాజ గృహమున బ్రతుకు దాని
గంసు నక్రియ చర్య గర్హించి దేవకీ
పక్షపాతంబునఁ బరఁగు దాని
గంధ మాల్యాదులఁ గంసునకుం దెచ్చు
పనికై నియోగింపఁ బడిన దాని
గృష్ణ వృత్తాంతముల్ ప్రీతిమై నెఱిఁగిన
కోలఁదిని వ్యాధి హరిం గూర్చు దాని

గీ. హరి విలోకించి దిక్కులు నరయు దాని
గుంతి తాంగంబు గల మఱుగుజ్జు దాని
మిట్టఁ బలు జాఱు నొక కను లొట్ట దాని
గుబ్జ యనుదాని హరి కనుంగొనియె నంత. ౧౧౩

శా. అష్టావక్రిన కష్ట వక్రిము లసంఖ్యాకంబు లా కుబ్జకున్
భ్రష్టాకారకుఁ గుష్ఠ చిహ్నములు కుబ్జాంగంబు లంబోష్ఠ యున్

దృష్టంబా బకనాసి పుల్పిరి వియాపై కాన్తియుం దొత్తియుగా
స్పష్టంబా ఘన దంష్ట్రికల్ గలిగి కుబ్జాదేవి పరిత్యక్తమై ౧౧౨

ఉ. చేతనుగందపుం దబుకు చేలవుఁ గొంగునఁ బూల దండ, డా
చేత విడెంబు, వ్రేలు వెలచీర దొండిగా ఫలముల్ బుజాలపై
నూతన వస్త్రము ల్గలిగి నూపురము ల్గడియాలఁ జేరఁ బె
న్మోహిత లావర్ప దాసి వడి మ్రోల నిలంబడి శౌరి కర్థమై ౧౧౩

ఉ. గంధ మలంది మేనికి నెగాదిగఁ గన్గొని దండ వైచి యా
సుందరదివ్యమూర్తిఁ దనచూడ్కులనిల్పి ఫలంబొసంగి యా
నందముతోడఁ గ్రొత్త వసనంబులఁ గప్పి విడెంబొసంగి, గో
వింద పదారవిందముల విందు నుతించుచు బత్తిఁజాగిలెన్। ౧౧౪

కం. చాగిలిన లేమఁ బనుపుచు
వేఁ గరముల లేవనెత్తి వెన్నుఁడు పదముల్
బాగుగఁ గాళ్లఁ గుదించుచు
లాగి నిమిర ముఖము కరతలంబులఁ బెలుచన్। ౧౧౫

మ. పదునారేడుల ప్రాయముం గలిగి భాస్వద్రూప గాత్రంబుతో
వదనాంభోజముతో దరస్మిత విభాస్వద్వీక్షతో విస్ఫుర
న్మదనోద్యోతక రాజ్యలక్ష్మి యన సౌందర్యాతిరేకంబునన్
మధురాకాంతల మేలు బంతి యయి సౌందర్య ప్రభా రాశియై

కం. తన రేడు కుబ్జఁ గనుంగొని
జను లెల్లరుఁ దెల్ల వోవ సరసిజ నేత్రుం
గనుఁగొని కుబ్జ వచించెను
వినయంత వినయోక్తి రచనఁ బ్రియ మెసలారన్ ౧౧౬

మ. కమనీయాంబుజ నేత్ర! నీ విమల సాక్షాత్కార సమ్మూర్తి భ
క్తి మరందోజ్జ్వల హృత్సరోజమునఁ గీలించి యున్నాళ్లు నే
మము సామంబునఁ బొమ్ముడించితిని; నీ మారోపమానాంగ సం

గముఁ జేకూర్చి కృతార్థఁ జేయఁ గదవే మా రాకృతీ! శ్రీపతీ!

చం. అన విని వాసుదేవు, డబలా! నిజ తత్త్వ మెఱుంగుదుర్ గృహాం
బున కరుగంగదే యిచటఁ బూనిన కార్యము నిర్వహించి నం
తన నినుఁ గూడికొందు నను నమ్ము మటంచని పంపెఁ గుబ్జ, మూఁ
గిన జన సంఘముల్ దలరి కృష్ణ మహత్త్వముఁ గీర్తి సేయఁగన్,

వ. ఇంతలోఁ గంసుండు.

తే. గీ. కృష్ణ వృత్తాంతమును నాలకించి పగల
సెగల దిగులొంది యించుక చింత సేసి
కొమరుకొని రొక్క విపిఁ జూపింపఁ బనిచెఁ
దగిన యుద్యోగి చయము మాధవుని కడకు ౧౨౦

శా. రాజోద్యోగులు రాజమార్గమున నా రాజాధి రాజేశ్వరున్
రాజశ్రీ విభవాన్య బింబు, మృగ తా ణ్మన్యూన్ గుమారోజ్జ్వల
త్తేజున్ మార కుమార రూపుఁ గని భక్తిన్ స్వాగతం బిచ్చి మా
రాజేంద్రుం డిట నుండఁ బంచె నని భద్రావాసముం జూపఁగన్

వ. సర్వజ్ఞుడును సర్వ సాక్షియు నగు వార్ష్ణేయుండు ౧౨౨

ఉ. మాకొఱకే వినిర్మితము మందిర మైనటులఁ గానుపించు నీ
ప్రాకట శిల్ప కౌశలము ప్రాజ్యము; ఱా దృశ హర్మ్య కల్పనా
బేకడఁ గాన మీ సుకృత కృత్యముఁ గూర్చిన కంస నేతకున్
మా కృత వందనంబుల సమాదరతన్ వినిపింప రే యనన్

వ. సాయంసమయం బగుట రాజభృత్యులు శౌరిని వీడ్కొని వెడలిరంత

మ. విను వీధిం బొడఁగట్టె మెల్లెడలఁ బర్వెన్ సంజ కెంజాయ ల
ల్లనఁ దిక్కాంతల పేద పెల్లొదఁ తె జాలన్ జిమ్మ చీకట్లు; మె
ల్లనఁ దోతెంచె వెలింగి నింగివయి వేరెన్ జుక్క చుట్టాలు చ
ల్లనఁ జూపట్టెను నేత్రపర్వముగ మోరెన్ వెన్న జాబిల్లియున్

శా. అంతన్ నందకుమారుఁ డిల్లనియె రామా కూర్యలన్ జూచి, యీ
వింతన్ గాంచితిరే! నృశంసుడగు సుస్నేహ యాజ్ఞాన్విత

స్వాంతుండై మనలన్ దహించుటకు లాక్షా కల్పితావాసమై
కేంతో పూనికఁ జేర్చె దాన ఫలవ త్కృత్యుండు గానోపునే

మ. అని యక్రూరుని గుప్త మార్గమునఁ బోఁ బంపించి వైశంబ యా
తని యావాసముఁ జేర భద్రముగ నంతన్ భిక్షుకాకారముల్
గొని తానున్ బలరాముఁడున్ వెడలి యా కుబ్జా నివాసంబుఁ జే
రినఁ గుబ్జాంగన కంటి ఱెప్ప వలె వారిం గాచె జాగ్రత్స్థితిన్ ౧౨౮

కం. నియమిత విధమున సరభతి
భయమున యామికులు వచ్చి, భవనంబును ని
ర్దయఁ గాల్ప నా యుదంతముఁ
బ్రియముగ నెఱిగించి రంత భృత్యులు వేగన్ ౧౨౯

కం. నేఁటికి నా పాట్లు నిరా
ఘాటముగా లోటు లేక గాటపు రక్తిన్
చాటిల్లె ననుచుఁ గనుఁడు
నాఁటికిఁ గనుఁ గూర్కి మేను మఱచిన యంతన్ ౧౩౦

మ. కలలో నొక్క నిమేషమాత్ర హరి చక్ర స్వీకృతిం జేయుచున్
దల ఖండించిన డిర్ధిరం దిరుగు మస్తంబున్ భయోద్రిక్తమై
యిలపైఁ గూలెను మొండెమున్ గనులకున్ దృష్టంబుగా మూర్ఛ గుం
డెలు ద్రీలన్ బలుకాఁగి నేలఁ బడెఁ గన్నీ రేఱులై పాఱఁగన్

చ. గిలగిలఁ దన్నుకొంచుఁ బలు గీటుచు బొబ్బలు వెట్టి పూన్కిఁ గ
న్నులు పెకలించి విచ్చి, కడు నొచ్చిన చిత్తము తత్తరింప వే
నిలచి సమీప దర్పణము నిక్కి కనుంగొని భూమిపైఁ బడెన్
దల గనుపింప నందులకు, దర్పణ మందున మూర్ఛితాత్ముఁడై ౧౩౧

ఉ. ఒక్క ముహూర్త మాత్రమున నోపిక మూర్ఛను దేఱి యొట్టులో
నొక్క సమీప శయ్య నిదురింపఁ గడంగినఁ గానుపించె నా
రక్కసికిం గ కృష్ణుఁడును రాముఁడుఁ బ్రక్కను జేరి తొమ్మునై

నొక్క కిరీట మూర్ధ్ని వధియించెను లీల భయానకంబుగన్ ౧౩౨

మా. కని నిర్భిన్న మనస్కుఁడై వెఱచి యాకంప భ్రమాలోలుఁడై
జనితావేశ వికార చాలిత వచస్స్వాంతుండునై యార్చి మూ
ర్ఛినఁ ద త్కాంతలు లేచి యుల్కిపడి ఛీకృచ్ఛేష్టితాత్మలు లే
వీన గీపెట్టుచు దొర్లి నేలఁ బడి విప్పన్ గన్నుఁ గెందామరల్

మ. వడి చాంచల్యము నొంది బొబ్బరిలి, విభ్రాంతోన్మదోద్వేగుఁడై
వడఁతు ల్మాధవ రాములంచు మదిలో భావించి, యుద్రిక్తుఁడై
వడిఁ గాంతాలక బంధముల్ద్రిగిచి గ్రీవాగ్రాహముం జేయ మూ
ర్ఛపడియుం దెంపు వహించి యార్చిరి భయోన్మాదాత్మలై ప్రేయసుల్

ఉ॥ ఆర్చిన సేవకా నివహ మాకులతన్ బకవ త్తి కాంచె బి
ట్టార్చుచు రోజుచున్ వివశుఁడై సిగలూడ్చుచు సంతత క్రియన్
జేర్చు మహీధవున్ భ్రమిత విహ్వాలలై పలవించు చశ్రులన్
గార్చుచు నేర్చియార్చు నృపకాంతల నివ్వెఱఁగొంద స్తబ్ధతన్ ౧౩౫

ఉ॥ కాంచి వినమ్రులై ప్రభుని కట్టెదుటన్ భటులంత నిల్చి ప్రే
మాంచిత రూప! భూప! కరుణార్ద్ర మనస్కుల రాణులన్ గటా
రొంచక క్రింద మీఁదు వధియింప గడంగితి రేల? మమ్ము ముం
ద్రించఁ డటంచు మ్రొక్కిడి రోదనఁ జేయ నిమీలితాత్ములన్

ఉ॥ విప్పి నిజస్వరూప గతి వేద్యముగా సవమాన మేఘముల్
గప్ప ఘనాశ్రు వర్షము నిలం గురిపించుచు గర్జనార్భటిన్
గప్పుచు మాఱుమ్రోయ దివినల్గడలన్ ధర ప్రాలె విజ్ఞతన్
దప్పి నిజాంగనల్ భటులు దారుణ భీతిఁ గలంగి కుందఁగన్ ౧౩౭

చ॥ పరువున నొక్క సేవకుఁడు పాఱి యమాత్యుల కీయుదంతమున్
బిటబిటఁ జెప్పఁ దుళ్ళిపడి నెవ్వగ డాసిరి మంత్రిసత్తముల్
నరపతిః నాలకించి నరనాథుని పాటు, గ్రహించి సత్య మం
దఱ నటనుండి పంపి యుచితక్రియలన్ నృపు మూర్ఛఁ దేర్చుచున్

వ॥ సవినయ వినమిత గాత్రులై యిట్లనిరి.

చ॥ తలఁపునఁ దోఁచి వర్తిలు పదార్థములుం విషయంబులుం దలం
పులుఁ గలయందుఁ గన్పడును బో సహజంబుగ; నింత మాత్రకై
కలఁగుదు రే భవాన్వితులు? గాసి వహింతురె యొండ మాలికై
జలమను భ్రాంతిఁ, నిందపయశంబు యశంబు జనించ బోలునే

చ॥ కలఁగననట్టి మానిసి యొకానొక స్వప్నమునందు నేని భీ
తిలి పలవింపఁ బోని సముదీర్ణ మనోబలశాలి భూమిపైఁ
గలుఁగఁగనె దీనికై వగచు కారణమేమి? విదగ్ధ దేహులై
పొలిసిన రామ మాధవుల పోకడ నీకు నెఱుంగ రానిదే?

మ॥ అని యోదార్చిన యంత నెల్లజనము లేణాంకుండు చూపట్టె న
ల్లన వస్త్రాద్రిఁ; ససూహఁ దశ్యములఁ దోలఁగన్ బాల మిత్రుండు తూ
ర్పునఁ దోఁచెం; బ్రభాత గీతికల యేపారన్ మ్రోఁగె నానా ద్విజ
స్వన మేళోద్గత మాధు రేఁచె వృషభాంభారావము ల్దిక్తటిన్

మ॥ అది ప్రాతస్సమయంబుగా నెఱిఁగి స్వస్థాపోషిత స్వాంతుఁడై
యధిపుం డోలగ మొందు నిండుగతిఁ జేయుంబంచె దుశ్శాంత్రపో
స్మఘనోత్సాహము వెల్లడించుటకు జైత్ర ప్రాభిమన్ జాటి స
మ్మాన లీలం బిలిపించి భృత్య హిత సామంత ప్రజానీకమున్

ఉ॥ అంతట మంత్రిలేఁగి నృపునానతి చొప్పునఁ గొల్వుకూట మ
త్యంత మనోజ్ఞ దర్శన విధంబున నేర్పరుపన్ భటాళి సా
మంతుల బంధుమిత్రుల నిమంత్రణ సల్పఁగ, నిర్ణయించి కృ
ష్ణాంతముఁ గంస భూధవు జయంబును జాటిరి వీధివీధులన్

మ॥ అట మేల్కాంచిన రామకృష్ణులకు నాయా వీధి విన్పించు ప్రా
కట జైత్రోత్సవ వార్త వీనులకు సోఁకన్ విస్మయంబంది యం
తటఁ గాల్యంబులఁ దీర్చి నేర్పు మెఱయన్ బ్రచ్ఛన్న వేషంబులం
బటులై ముందటి యాసనంబులను బొందం జాలిరా కొల్వునన్

చ॥ ఇది ధ్రువ వార్తఁగాఁ దలఁచి హృద్వ్యథ వచ్చిన వారు కొందఱ
య్యది హరిమాయఁ జూడఁ దగు నంచని వచ్చినవారు కొందఱ
య్యది యటుకానె? యక్రియ జనుంగొనఁ గూకుట దుర్లభం బటం
చునవదఁ జెంది కొంజఱుచు నానథ శేరిరి పౌరులందఱున్

మ॥ ఒకచోఁ బట్టణ మధ్యరంగమున రమ్యోద్యాన మధ్యస్థలిన్
ప్రకటాలంకృత వస్త్రమంటపమునన్ భద్రోచ్ఛ్రితోద్ద్యోతి పీ
ఠిక సామంతులతో నమాత్య తతితో శీఘ్రన్ జనధ్వానముల్
సకలాశాంతర వీథులన్ మెఱయఁ గంసక్ష్మాధిపుం డొక్కచోన్

చ॥ నిలఁబడి వంది మాగధులు నిస్తుల లీలనుతింప బాలికల్
జలజల రాల్చి పూలఁజడి సన్నుతిఁ జేయ మృదంగ తూర్య కా
హళ పటహాది వాద్య రవ మంబర మార్గము ముట్ట వారకాం
తలు పటునృత్య గీతికల నర్మగతిన్ జరియించి రద్ధిమై.

సీ॥ స్వస్తి వాచక పాళి స్వస్తిఁ బఠింప వృ
ద్ధోర్వీసురేంద్రు లాశీర్వదింపఁ
గవి తల్లజులు ధరాధవు లావు వర్ణింపఁ
బండితుల్ప్రాగి యుపన్యసింపఁ
బడఁతుక లారతుల్ పాడి కుంకుమ మెత్త
గాయకు లలరింప గేయ వితతి
మంగళ వాద్యముల్ రంగు మీఱి చెలంగ
వైతాళిక ధ్వాన పటలి తనర

తే॥ గీ॥ వీర నివహముల్ బాసలు దీరియుండ
వేత్రహస్తులు సేవకుల్ వెంటనిలువ
జయ పతాకముల్ సభయందు సందడింప
నక్కా వారి వీఁకఁ గంస మహీంద్రుఁ డెలమి

ఉ॥ అంతట ముఖ్యమంత్రి మనుజాధిపు పంపున లేచి యాత్మ భా

పాంతక నామధారి దనుజాంతకు దుర్నయముల్, జడీయ ని
ష్క్రాంతి నుపన్యసించి జన రక్షకు డౌ ప్రభు ధిక్కరింపఁ బ్రా
ణాంతము దప్పదంచుఁ "బరమాత్ముని సృష్టం" డను చాటి పల్కెనన్

మ॥ పటు రూపంబున నున్న రాముఁడు సహోదరజాల కావాక్యముల్
పటు రోష బున నిల్చి యిట్లనియె "నేలా యిట్టి ప్రలాపంబు లు
త్కట దుష్టాంతకు డాయుధాంతకుఁడు మీ కంసాంతకుం డచ్యుతుం
డిట నాయొద్దనె యున్న వాఁడిదిగో మంత్రీ! విస్పష్టఁగఁ దెల్పెదన్

మ॥ పటురూపోజ్జ్వల రామ కృష్ణులను తత్పౌరాళి వీక్షించి ప్రా
త్సృట పాళిఁ బరిపూర్ణరాగమును సంతోషంబు గీల్కొల్ప, నం
కట సందిగ్ధ పరిస్థితిం దెలియుటన్ వ్యాకస్థితిన్ బొంది సం
ఘటన ప్రాప్తి నిరీక్షఁ జేసె ప్రజాది సంకల్పించి కంసాంతమున్

మ॥ సచివుల్ సత్యము నిర్ణయించుకొని యా చాణూరు మల్లాధిప
ప్రచయాజ్ఞాప్తుని ముష్టికాహ్వయుని నాక్రమ్యాతుఁగన్ సన్నఁబి
ల్చి చెవిన్ జేనికి నేమొ చెప్పి తృటిలోఁ జేకూర్చినన్ ముఖ్యుఁడౌ
సచివుం డొక్కఁడు లేచి పల్కెనిటు వాచాలత్వ మేపారఁగన్

చ॥ పురజనులార! చేఁబడిన పోటు రిపుం బరిమార్పఁ గల్గియున్
దుర మొనరింప కన్యగతిఁ దుంచుట ధర్మము; చేతఁ జిక్కెనే
కరణి మెలంగలేని నృప కంటకుతో బలరామ కృష్ణులన్
నరపతి చంపగల్గియు ఘృణన్ సమయమును గూర్చె నీగతిన్

శా॥ చాణూరాంధ్రులు మల్ల వీరవరులీ సంకర్షణాబ్జాక్షులే
ప్రాణశ్రీయుత బాహుజాతులగుచో మార్కొడ్డి యీ మల్ల వి
ద్యా నిష్ణాతుల గెల్వఁ గల్గినను రాజ్యశ్రీ సమర్పింప భూ
ఈశేంద్రుండు ప్రతిజ్ఞఁ జేసె వినుఁడీ తాత్రి ప్రతిష్ఠార్థమై.

ఉ॥ అంత బంచానన శాబకద్వయము చాయన్ రామకృష్ణుల్ రణాం
గణమందే యని లేచి నిల్వఁబడ రంగంబున్ వినిర్మించి రా

క్షణమేః కంసుని భృత్య సంఘములు నిర్ఘాంత స్థితిం జూపఁగన్
గన, రామాచ్యుతు లా రణాంగణమునన్ లంఘించి రత్యేకతన్
శా. చాణూరుం గలిసెన్ హలాయుధుఁడు; దోస్సార స్ఫురన్ముష్టికున్
నా నారాజ సభా విభూషణుని నాంధ్రఖ్యాతునిన్ దాఁకె ర
క్షోనాథేభ మృగాధిపుండు విలస ద్గోవర్ధనోద్ధారఁ ధీ
కో నారాయణుఁ డచ్యుతుండు వడి సత్కోదండ ముక్తేషుఁడై

వ. అంత.

చ. కలకల నాదముల్ గదలి కాయలఁ గాఱురుము ల్స్రలంగి సే
రలుకలుఁ బంచెముల్ గలిగి యార్భటు లాగడము ల్చెలంగి నిం
దలు నుతు లోలి వెల్వడలి, తద్దయు గందర గోళమాచు నా
కొలు వల నారె రాజ భటకోటి కడంపఁగ రాని గొడ్డమై ౧౫౮

సీ. హరిణ శాబకములా! హస్తీంద్రముల కీడు?
హస్తి కుంభ విదళ ద్ధరులు సుమ్ము
మాయావి కంసుని మర్మ మెఱుంగరే?
మర్మ భేదన సేయు మాట నిజము
దోర్దండ నిహతులఁ దూలుదు రక్కటా!
దుర్జయుల్లై నిల్తు రూర్జితముగఁ
గాలాంతకుల తోడఁ గదిసి పోరాడుట?
కాలము పరిపోయెఁ గంస పతికి

తే. గీ. ఏమి దుష్ప్రాప్తి గలుఁగునో యెఱుఁగఁ దరమె?
ఏటి కీశంక యఘము నశించి తీరు
ననుచు ఘోషించు పథ్య వాక్యములు భటులు
వినుచు రోషించి సుంత నిర్విణ్ణులైరి. ౧౫౯

సీ. కేలెత్తెఁ బలునకే కీడు మూఁడునొ? చూడు
కేలి సేయుచుఁ బెడ కేలఁ జఱచి
పాద ఘాతంబులఁ బడిపోవునో హాని?

పడి లేచె నాంధ్రుఁడు పాదనిహతి
ముష్టి తాడనమున మొత్తె రాముని నదో
చాణూరుఁ డార్చుచుఁ జదికిల పడె
నెగసి దూఁకెడి కృష్ణు దిగఁద్రొబ్బునో! నింగి
కెగసి మూఁపున నెక్కెఁ గృష్ణుఁ డదిగొ
తే. గీ. బలుఁడు తూలిక మల్లుని బలము నాఁచె
నాంధ్రు నలయించె శూరత నాక్రమించి
యనుచుఁ బ్రేక్షకు లాడెడి యాతురోక్తు
లెల్లెడఁ బ్రతిధ్వనించి వ్యాపించి నిగిడె ౧౭౦

మ. అదె వ్యాఘ్రద్విరద ఘోర మల్ల రణ దృశ్య స్ఫూర్తి వీక్షింపుఁ డ
ల్లదె దుర్వీక్ష్య భయానక ప్రకటిత ప్రాజ్య ప్రతాపాప్తి య
ల్లదె భీభత్సక వీర సాహస మటం చాశ్చర్య సంభ్రాంత స
మ్మద భీ సంభ్రములై వెలార్చు జన సంభాషల్ ధ్వనించెన్ దెసల్

సీ. అటు చూడు! చాణూరుఁ డెటుతూలి నొచ్చెనో
యిటు చూడు ముష్టికుఁ డెటులఁ బడెనొ
అటు రాముఁ గనుమెటు లార్చి జృంభించెనో
యిటు గంటె వార్ష్ణేయు చటుల మూర్తిఁ
నెటు కేఁగి డాఁగెఁ గన్పింపఁడా చాణూరుఁ
డిట నాంధ్రుఁ డెట్టు లదృశ్యుఁడయ్యె
సాధించి కొని తెచ్చెఁ జాణూరు రాముఁడు
పెకలించి పట్టె ముష్టికుని శక్రి
తే. గీ. అదిగొ! బలుఁడు వక్షస్స్థితుఁ డయ్యెఁ జూడుఁ
డిదిగొ ముష్టికాంతము నమరించెఁ గాంచుఁ
డనెడు పౌర సంభాషణ లాలకించి
[illegible] దిగులొందెఁ బృథ్వీశ్వరుండు ౧౭౧

వ. అంతలోన.

మ॥ కనుఁడీ! కన్గొనుఁడీ హలాయుధుఁడు వక్షః పీఠి భేదించి చీ
ల్చినఁ జాణూరుఁడు రక్తసిక్తుఁ డయి విచ్ఛిన్నాంగుఁడై యీ రణాం
గణ మధ్యంబునఁ గూలెఁ గూలెనను వాక్యధ్వానముల్ మాఱుమ్రోఁ
గను హాహా ధ్వనులన్ నృపాల భటు లుద్గ్రీవోద్ధతిన్ రోయఁగన్
వ॥ అనునంత
ఉ॥ కష్టము కష్టమాహా మన కంసమహీపతి కింకఁ గష్టమే
స్పష్టముఁ ముష్టి ఘాతమునఁ బ్రాణము ఏడెను మల్లనాయకో
త్కృష్టుఁడు ముష్టికుం డిఁక నదృష్టము కృష్ణునిదే యటంచు నా
దుష్ట నృపాల భృత్య రవ తూర్ణ మహార్ణవ ఘోష వెల్వడన్
శా॥ కంసుం డంత నయోమయాకులిత నిర్ఘాంతాత్ముఁడై తీక్ష్ణ ని
స్త్రింశాఘాత విభిన్న హృద్వ్యథ ఘనోద్వేగార్తుఁడై తూలి, వి.
ధ్వంసం జేయిటఁ దప్పదంచుఁ దన స్వాప్నార్థంబ ప్రత్యక్ష స
త్యాంశంబై చనునంచు నమ్మి హృదిమూర్ఛాక్రాంతుఁడై తేచుచోన్
సీ॥ సామంత నృపులు విచార వార్నిధిఁ గ్రుంక
బంధు మిత్రులు మనోవ్యథఁ గలంగ
మంత్రులెల్లరు నయోమయ విస్మయము లంద
సైనిక సంఘముల్ చాలి పోవ
రక్షకభటులు విభ్రమఁ జెంది వాపోవ
నుద్యోగి బృందము లుస్సురు మన
రాజాభిమానులు భ్రాంతులై చలియింపఁ
బరివార మఱిముఱి పాటుఁ బొంద
తే॥ గీ వంది మాగధుల్ కంపించి భయము
రాజ శుద్ధాంత జనము చిరాకు నంద
వేత్రహస్తులు వివశులై వీఁగి చనఁగ
మ్రానుపడి రాజసభ తికమకలఁ బిగిలె ౧౬౫
వ॥ అంత

సీ॥ చాణూర సంహారి సంకర్షణునకు "జై"
ఆంధ్ర సంహానునకు హరికి "జయము"
ధేనుకాంతక నామధేయ రామునకు జై
జై యసురారికి జయము జయము
దుష్పాల నాంతకో ద్యోగులకు జయంబు
దుష్ట శాసన నిరోధులకు జయము
తే॥ గీ॥ మల్లయుద్ధ నైపుణ్య సంపాదితాజ్య
సకల రాజ్యాధిపులకును జయము జయము
ప్రబల పీడాఘ దురిత హర్తలకు జయము
హల సుదర్శన పాణుల కలఘు జయము ౧౮౭
వ॥ అని ప్రేక్షకులు సేయు కోలాహలంబును
శా॥ జై జై ధ్వానము విన్నమట్టజన తోషాలాప మాశాంతమై
రాజిల్లెఁ బురవాస సంస్తుతులుఁ సుగ్రీమస్థ నిందార్భటుల్
రాజ ద్రోహ్యపహాస భాషణలు సర్వాశాంతరాళావృతం
బై జాగ్రత్థిరతిఁ గొల్పుచోఁ బ్రబల మూర్ఛాక్రాంతుఁడై తేనికిన్
మ॥ మద మాతంగము మీఁదికిన్ దుముకు కుంభగ్రాహ సంసిద్ధ భీ
ప్రద పంచానన శాబకద్వయము శోభన్ వీర ఘోరార్భటిన్
యదు వంశోద్వహ యుగ్మ మాగ్రహ వశోదగ్ర క్రియన్ భూపుపైఁ
గదిసెన్ భూ గగనాంతరాళములు మ్రోఁగన్ బ్రేక్షకాహా ధ్వనిన్
చ॥ కదిసి కిరీట మూడ్చి యలకన్ గుటిలాలకముల్ గ్రహించి వేఁ
బడపడఁ బీకికిన్ దిగు భవత్పద మింతకు మున్నె పోయె నం
చధిపతిని నేలకీడ్చి, పరిహాసము సేయుచు మీఁదికెక్కె నా
మధు దనుజాంతకుండు; హలి మాధవు రక్షణ కొగ్గి నిల్వఁగన్
మ॥ అదియే మాయయొ కాని యాత్మ నృపువక్షోఽధిష్ఠుఁడై గ్రీవమున్
బద సంఘట్టనఁ ద్రొక్కి నొక్కి కర దండాస్ఫాలనోద్దండ చం
డ దురంతోద్ధత నాట్యమాడు త్రిజగన్నాథున్ నిరీక్షించి యున్.

హృదయము స్ఫాలన మాని నిల్చిరి మంత్రీంద్రు ల్భటుల్ సైనికుల్

సీ॥ ప్రతిన చొప్పునఁ బరిపాలకుం డీహరి
పలుక రాదని భయంపడెడు వారు
తెలివి మాలి ప్రతిజ్ఞ సలిపి మమ్మెల్లర
బంధించె నని కిన్కఁ బలుకువారు
క్రోధ ఘూర్ణితులై విరోధులయ్యె నయో మా
యభ్రాంతి నివ్వెఱ గందు వారు
నరపాలు గతిఁజూచి పరితాప మొందియు
మెదలఁ జాలక నోట వదరువార

తే॥ గీ॥ లగుచుఁ గంసాను చరు లవశాత్ములై వి
వణ్ణులైరి నరేంద్ర వక్షః కవాట
భేదనోద్రేక పూరిత వీర రౌద్ర
భీభయానక మూర్తి గోవిందుఁ జూచి ౧౭౫

చ॥ విరుల జడుల్ పురాంగనలు వెల్లువగాఁ గురిపింప లాజలన్
ధరణి సురేంద్రు లాగమ నినాదములన్ వెదఁజల్ల ముత్తెపుం
సరులు వణిగ్వరుల్ విసరఁ జక్రి నరాధముఁ గంసు కంఠమున్
బిటబిట నొక్కి కూల్చెఁ గఫ ఫేన రసారుణ వారిఁ గ్రక్కఁగన్

వ॥ అంతటితోఁ దనివోందని వార్ష్ణేయుండు కంస దుర్మాంస మలపూరిత దుర్గంధమయ పూతిపూయ రుధిరార్ద్రీభూత శరీరంబు వీడక

శా॥ వీరోద్రేక మయూవశాత్ముఁడంబు దుర్వృత్త్యాగ్రహ స్ఫూర్తి వి
స్తారాడంబర దుర్దమ ప్రళయ నృత్యారూఢ భీమాధికుం
డై రక్తారుణ భీమనేత్ర ముఖ బింబాబ్జాప్త ధిక్కారియై
ఘోరాకారము నన్నటించె బహుళాత్తుదోగ్ర హృద్వేగుఁడై

శా॥ ఈ యాకారము దుస్సహంబగుట లోనెక్కించి రాముండు తో
డై యక్రూరుఁడు నిల్వ శౌరి కెదురై హస్తంబులన్ మోడ్చి దే

వా! యేపం దగు నీ మహాప్రళయ నృత్యాటోప మీ పాపి కో
ల్పోయెఁ జీవము లింక శాంతిఁ గని మమ్మున్ బ్రోవవే మాధవా!

శా॥ స్వామీ! ధర్మ జయార్థమై యఘ వినాశార్థంబుగా నీవు లీ
లా మానవ్య శరీరివై మెలఁగి హేలా లీల సాధించు నీ
సామర్థ్యంబును లీలలన్ దెలియఁగా సామాన్యమే? యెంతో యో
గామేయాత్ముల కందరాని ఫలమీఁ గంసాధముం డర్హుఁడే.

శా॥ ఏయే ధర్మము లెట్లు నిల్పెదవొ నీకే ద్యోతకంబౌఁ జుమీ
యేయే పాపుల నెల్లడంచెదవొ యూహింపన్ దరంబే? హరీ!
యీ యుత్కృష్ట మహావతారమున నే యే కృత్యముల్ బూనితో
మాయా దేహులమేము తెల్పఁగలమే? మాయా పరిత్యాగికిన్

ఉ॥ నీలవ భీషణాకృతియె నేఁడు భయానక మౌచు నల్ల క
ల్లోల మొనర్చె; భూప్రజ విలోకనఁ జేయునె? యో దయానిధీ!
చాలు; భరింపజాల ముప సంహరణం బొనరింపకున్న చోఁ
దూలు జగత్త్రయంబు జనతోషణ దుష్ట వధాంతమే కదా!

తే॥ గీ॥ నమ్మి నిన్నెద భక్తు లున్నారు చెఱను
దేవకీ వసుదేవులు దీనులైన
యుగ్రసేనుండు వారి నమగ్ర కర్మ
ఫలిత మనుభుక్తమయ్యె నజ్జాత నయన ౧౯౩

వ॥ అనవుడు

సీ॥ ధూళిధూసరితాస్య తోయజ విన్యస్త
ఘర్మాంబు సిక్తాలకముల తోడఁ
గల్హార జిత్కటాక్షారుణి మాక్రాంత
లాలితారుణ కపోలముల తోడ
నుద్ధత హార కేయూర కుండల బింబి
తాస్యామృతాంశు సంతతుల తోడ

ఘర్మ ముక్తాహార కవిత శీలాంజన
ధాత్రీధరోజ్జ్వల తనువు తోడ
తే॥ గీ॥ రక్త సంసిక్త పాదాంబరముల తోడ
స్ఖాలనాలోల దీర్ఘ హస్తముల తోడ
నిలచి నీలాంబరాకూర్చిరు లొలసి పలుకు
స్తవము హరియాలకించి ప్రసన్నుఁడయ్యె. ౧౫౯

వ॥ ప్రసన్నుఁడై మందహాస కందళిత వదనేందుండై వేదిక నధిష్ఠించుచు నిట్లనియె.

చ॥ అనుచరులార! పౌరజనులార! యమాత్య గణంబులార! మీ
జనవరుఁ డీల్గె రాజ్య బలసంపద నా వశమయ్యెఁ గంస నా
ధుని కుటిలోద్యమంబునకుఁ దోడ్పడి యున్నను జిత్తవృత్తి పై
రణ ఘటియించుకొన్నఁ బరిరక్ష రొనర్తు భయంబు వాయుఁడీ

మ॥ అన సామంతులు మంత్రులున్ భటులు సైన్యానీక ముద్యోగులున్
బ్రణతుల్ సల్పి క్షమాపణం బడిగి సంప్రార్థింప మన్నించి భీ
తినిఁ బోఁదోలి, యథాస్థితి న్నిలిపి, బంధీ భూతులన్ జూడఁగో
రిన వెన్నంటెను భృత్యవర్గములు దారింజూపుచున్ శౌరికిన్

ఉ॥ హరి జయవార్తయున్ నృపుని యంతము నా చెరసాలఁ జేరఁగాఁ
బరులు ముకుందు నాగమన భావము మున్నె యెఱింగి భీతిమైఁ
బరువునఁ గంస బంధితుల పాశములూడ్చి కడంక ద్వారముల్
తెఱచి, నిరీక్షఁజేసిరి విధేయతఁ గృష్ణుని రాక వీక్షమై ౧౬౦

తే॥ గీ॥ దేవకీ వసుదేవులు తెలిసి సర్వ
ముగ్రసేనుని కడకేఁగి యున్న రీతి
నెఱుక పఱచిన నతఁడు హర్షించె ధర్మ
సంస్థితికి దైవ బలముంటఁ జాలఁ దలఁచి ౧౬౧

వ॥ అంతలో

శా॥ మ్రోఁగెన్ గాలిఁ బ్రజాసమూహములు దిక్పూరంబులై "జై" ధ్వనుల్
మ్రోఁగెన్ బ్రోద్ధత ధూళి రేఁగి నభమున్ ముట్టాకు చాళీస్ఫులున్
సాఁగెన్ జిష్ణుని విష్ణుఁ జేర్కొనుచుఁ గృష్ణప్రాప్తి సూచించుచున్
వీఁగెన్ మూఁకలు త్రోవవిచ్చి గురు పృథ్వీనాథు వీక్షింపఁగన్

మ॥ తొలి నక్షత్రుఁడు త్రోవఁజూప హరి జైత్రోత్సాహుఁడై వెంటరా
బల విధ్వంసక బాహుల్ దనరిరాఁ బౌష్య(స్థులై మంత్రి) భృ
త్యులు సామంతులు ముట్టిరాఁ బుడిజనుల్ తోరంపు టుత్సేకతన్
బలియన్ దిక్కులఁ బిక్కటిల్లి చెలఁగెన్ వార్ష్ణేయు జేతేసచోన్

ఉ॥ కావలివారు నిల్వఁబడి కైమొడుపుల్ ఘటియింప దేవకీ
దేవి నిరీక్షసేయ వసుదేవుఁడు సంభ్రమపాటు నొంద, సం
భావన సేయ ముందునకుఁ బర్విడి రా నల యుగ్రసేనుఁ డిం
తే వినయాతి నమ్రపదవృత్తి ముకుందుఁడు చొచ్చె లోనికిన్

ఉ॥ చొచ్చి తటాలునన్నెదురు సోఁకఁగ మాతకు మ్రొక్కి కౌఁగిటన్
గ్రుచ్చి నమస్కరించి పితకున్ గుశలంబు నెఱింగి తాతకున్
నొచ్చిన కాళ్ళపై సొలఁగి నాల్కొను బంధితులన్ నయోక్తులన్
మచ్చిక సేమమారసి రమాధిపుఁడా చెఱసాలఁ దొల్గిటన్

వ॥ ఆనందాశ్రు లేరులై పారల నిర్నిమిత్తంబు సంతత ధారా పాతంబులై ప్రవహించు స్తన్య బిందు సందోహంబు లొలికి తొటఁక నా కంపితాంగయై హర్ష పరవశ రోమాంచయై దేవకీ లలామ లీలా మానుష విగ్రహు మాయా జాలకు బాలకుఁడని భ్రమించి యుంట నాఁచరాని కూర్మిపేర్మి నర్మిలి డగ్గఱి బిగ్గఁగవుంగిలించి పొంగి యిట్లనియె

శా॥ అన్నా! నిన్గనుపాఱఁ గన్న ఫలమత్యాసక్తి నిన్నాళ్ళకే
మెన్నెన్నో కడుబన్నము ల్గుడిచి నేఁడే నిన్గనన్ గల్గె నా
పున్నెంపుం సురశాఖి పంట కతనన్ మున్నెన్నఁడో చన్న మా
కన్నుల్ పండెను బందువయ్యె మదికిన్ గన్నార నిన్గాంచుటన్

మ॥ అనునంతన్ వసుదేవుఁ డాఁచవి తమిన్ హర్షావశ స్వాంతుఁడై
దనుజారిన్ వడి డాసి హత్తికొని మూర్ధ ఘ్రాణము జేసి యి-
ట్లనియెన్ బావనమయ్యె వంశము త్వదీయావిర్భవ ప్రాప్తి నం-
దన! యానందము గంటి నీకతనఁ జంద్రార్కిన్ సముద్రుం బలెన్

వ॥ అనునంత.

ఉ॥ ఎత్తిన కృష్ణు డింపికొని వృద్ధనృపాలకుఁ డుగ్రసేనుఁ డా
యత్తముఁ జేసికొన్న దౌకహారముఁ గంఠమునం దగిల్చి మో
మెత్తి కపోలముల్ బుణికి యిట్లను జీవము తోడనుంట నీ
పొత్తును గంటి; ధన్యుఁడ; శుభోదయ! నోములపంట పండెఁగా

వ॥ అన మందస్మిత వదనేందుండై కంసారి యిట్లనియె.

మ॥ గురులారా! నను నింతవాకొనుట మీకుం జెల్లునే? యిందులో
పరమార్థం బిసుమంతయుం గలదె? నా స్వార్థంబ సర్వంబు; య
బ్బురమే పైతృక భక్తి, బంధుహిత సేవోద్యుక్తి, ధర్మానుగా
ద్ధరణాసక్తి, యధర్మశాస్తి, వటు దైత్యచ్ఛేదన ప్రాప్తియున్

వ॥ అనునంత బలరాముఁడు సాఁగి వచ్చి దేవకీ వసుదేవోగ్రసేనుల పాదం
బుల కెఱఁగిన వారతని లేవనెత్తి యిట్లనిరి.

తే॥ గీ॥ అనలుజృంభణ మగ్గించు ననిలురీతిఁ
జక్రి చక్రార్చి కీలకు సాయము పడి
బలమహాఖ్యాతి సార్థక పఱచుకొంటి
రామ! నినుఁబోలు దురె? జగత్త్రయిని నొరులు. ౧౦౬

వ॥ అనిన శ్రీకృష్ణుఁ డుగ్రసేనునితో నిట్లనియెను. ౧౦౭

శా॥ తాతా! నీభుజవీర మొక్కయు బలాత్కారంబునన్ ధారుణీ
పాతం బొందిన రాజ్యలక్ష్మి భవదవ్యాజానురాగ స్ఫూర్తిన్
జేతన్ఫూర్తిఁ ద్వదీయ పోషణమునే చింతించు నిత్యంబు నీ
చేతం గైకొని యుద్ధరింపు మరలన్ శ్రేయఃప్రదాతా! నృపా!

సీ॥ మద కరీంద్రముపైని మాతామహుని నిల్పి
సంరంభ మొసఁగ నుత్సవము సల్పి
చతురబ్ధి నుత నదీజలములఁ దెప్పించి
మంత్రోక్తముగను హోమంబు నడపి
ఋషుల యాశీర్వాద ఋక్తతుల్ వెలయ మం
గళ వాద్య రవములు బలసి మొరయ
జయజయ ధ్వానముల్ చదలంట మంత్రి సా
మంతులు వచ్చి నమస్కరింప
తే॥ గీ॥ స్వయముగను హారములఁ జేసి సన్నుతించి
వరపుణ్య ముహూర్త మారి సమీపమున నిలచి
యతఁ గృతకతను మాతామహు నుగ్రసేన
నరుని పట్టాభిషేకోత్సవమ్ము నెఱపె. ౨౧౩

కం॥ దుందుభులు మొరసె విరులా
నందప వర్షమును గురిసె నాకిగణంబా
నందంబున మునిసెఁ బ్రజా
నందోహము వెల్లి విరిసె సాధ్యోత్సుకతన్ ౨౧౪

శా॥ సాక్షాద్గ్రత్థి ప్రశస్తి దర్శనంబౌనట్లు యాజ్ఞాపించె నే దేవ ని
త్యాత్మోజ్జానుగ్రహ శక్తి గ్రంథకృతి శ్రీ యాయిందిరా దేవి హృ
ద్రాజీవాంతర కర్ణికన్ నిలిపి యీ గ్రంథంబు సాగించి ద
త్సాక్షిత్వమ్మున గృతిసేఁ జేయుటఁ గృతార్థత్వంబు చేకూరెడిన్

## రథోద్ధత వృత్తము.

నీలదేహా! రజనీ చరాంతకా!
బాలగోప! సురపాలకా! మహో
త్తాల! కీర్తి సుల తాలవాల! గో
పాల! బాల శశిఫాల! పాలకా! ౨౧౫

గద్యము.

ఇది శ్రీమదిందిరానాథప్రసాదలబ్ధసహజకవితా
విరాజమాన శ్రీమద్గౌతమసగోత్ర దివి
వంశోద్భవ నరసింహాచార్యపౌత్ర
వేంకటాచార్యరంగమాంబికా
తనూజరంగాచార్యప్రణీత
శ్రీకృష్ణాతిమానుషతత్త్వ
ప్రథమఖండాంతర్గత
పంచమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ వైఖానస ముద్రాక్షరశాలయందు ముద్రితము
ఈగావారిపాళెం. (ప్రతులు 2000)